# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 1

కన్నడ దేశంలోని బీదరికోట అనే గ్రామంలో గురు శాంతప్ప, దేవ మల్లమ్మ అనే పుణ్య దంపతులు వుండేవారు. వారు గొప్ప శివభక్తులు. ఈ దంపతులిద్దరు నిత్యము శ్రద్ధాభక్తులతో శివపురాణం శ్రవణంచేసేవారు. వారికి ఇద్దరు మగపిల్లలు.

ఇలా ఉండగా ఒకరోజు తెల్లవారుజామున గురు శాంతప్పకు ఒక శుభ స్వప్నం వచ్చింది. వెండికొండ మీది నుంచి ఈశ్వరుడు దిగివచ్చి, దేదీప్యమానమైన కాంతితో అతని హృదయంలో కలిసిపోయాడు. ఒకమధురమైన వాణి ఇలా వినవచ్చింది. - "గురు శాంతప్పా! నీ సద్భక్తికి మెచ్చి నీ పుత్రునిగా జన్మిస్తాను".

గురు శాంతప్ప మేలుకొని భార్యతో తన స్వప్న వృత్తాంతం తెలిపాడు. అదివిని దేవమల్లమ్మ ఇట్లా చెప్పింది. - "ఓనాథా! మీకు వచ్చినటువంటి స్వప్నమే నాకూ వచ్చింది. పార్వతీదేవి నా వడిలో ఒక వెలుగు ముద్దనుంచి నీ గర్భాన జన్మిస్తాను" అని చెప్పింది. తర్వాత ఒక దివ్య ప్రకాశం నా హృదయంలో కలిసి పోయింది.

కొంతకాలానికి దేవ మల్లమ్మ గర్భవతి అయినది. ఆమె తన కాలాన్నంతా ధ్యానము, పూజ, పంచాక్షరీ మంత్ర జపములతో గడపసాగింది లౌకిక విషయాల మీదకంటె ఆధ్యాత్మిక విషయాల మీదనే శ్రద్ధ ఎక్కువైంది. "నేను ఎవరు? నా పుట్టుకకు సార్థకత ఏమిటి? ముక్తి ఎప్పుడు పొందగలను?" అనే ఆలోచనా స్రవంతి ఆమెలో రోజు రోజుకీ బలవత్తరమైంది. ఈ విధమైన సద్విచారంతో నవమాసాలు నిండాయి.

శక సం॥ 1758 దుర్ముఖి నామ సంవత్సర శ్రీరామనవమి గోధూళి సమయాన కర్కాటక లగ్నంలో ఒక శుభ నక్షత్రాన మగ శిశువు జన్మించాడు. పదమూడవ రోజున ఆ శిశువుకు సిద్ధుడని నామకరణం చేశారు.

శ్రీ వీర భద్రస్వామివారి వద్ద శివపురాణ శ్రవణానికి తల్లిదండ్రులతో పాటు సిద్ధుడు కూడ వెళ్తుండేవాడు. ఒకరోజు గురువుగారు శివజీవైక్యము గురించి చెప్తూవుంటే, అది విన్నంత మాత్రానే సిద్ధుడు బ్రహ్మానందాన్ని పొంది నిశ్చేష్టుడై పోయాడట.

ఒక సంక్రాంతికి సిద్ధుడు నువ్వులు, బెల్లం పెడతానని పిల్లలందర్నీ ఇంటికి పిలుచుకువచ్చాడు. ఉట్టి మీద వున్న నువ్వుల కుండను పంచాక్షరీ మంత్రం చదువుతూ కర్రతో ఒక్క దెబ్బవేశాడు. కుండపగిలి నువ్వులన్నీ క్రింద పోయాయి. మీరంతా సంక్రాంతి దోషం పోగొట్టుకోండి అంటూ ఉల్లాసంతో అందరికీ నువ్వులు, బెల్లం పంచి పెట్టాడు. సిద్ధుడు ఎంతమందికి పంచిపెట్టినా ఆ నువ్వులు, బెల్లం తరగనేలేదు. ఈలీల చూడటానికి వచ్చిన ఊరి ప్రజలు తరగని నువ్వుల రాశిని చూసి,"ఇతడు శివుని అవతారమే" అంటూ అందరూ సిద్ధునికి న... రించారు. ఇది చూసిన తల్లి, "నాయనా సిద్ధా! ఇది ఏమి?" అని అడగగా సిద్ధు... మ్మా! ఇదంతా నీ పాదమహిమే" అన్నాడు.

ఒకరోజు తల్లి ప్రేమతో, "బాబూ! నువ్వు పెద్దవాడివౌతున్నావు. బడిం... వు!" అని ముద్దు మాటలతో చెప్పింది. సిద్ధుడు "నువ్వు ఇలా అనడం బాగుందా...? ఈ భూమి అనే పాఠశాలకి గురువై వచ్చాను. నేను బడికి వెళ్ళాలా? మందమతులకు అక్షరాభ్యాసం గానీ, నిత్య వ్యాపకం, నిర్మలం అయిన అక్షరాత్మలకు పాఠశాలకు వెళ్ళాలనే ఇచ్ఛ ఉంటుందా?" అన్నాడు. బాలుని ఈ జ్ఞానపరమైన మాటలు విని దేవ మల్లమ్మ "ఇవి శ్రుతి వాక్యములు. ఇంతటి బుద్ధిశాలియైన పుత్రుని పొందిన నాగర్భము సఫలమైనది. నేను ధన్యురాలను" అని సంతోషంతో పొంగిపోయింది.

మరునాడు గురు శాంతప్ప "ఇక నీవు హఠం చాలించి బడికి నడువు" అని కోప్పడి పిల్లవాని చేయి పట్టుకొని పాఠశాలకు తీసుకువెళ్ళి, గురువుగారి వద్ద వుంచి, "గురువర్యా! ఈ బాలునికి అక్షరాభ్యాసము చేయవలసినది" అని చెప్పి, ఇంటికి వచ్చాడు.

అంతట గురువుగారు సిద్ధుని తమ వద్ద కూర్చోబెట్టుకొని పలక మీద "ఓం" అని వ్రాసి దిద్దమన్నారు. సిద్ధుడు గురువునకు నమస్కరించి, "గురువరేణ్యా! ఈ ఓంకారానికి అర్థమేమిటి?" అని అడిగారు. దానికి గురువుగారు "ఇప్పుడు దీని అర్థం చెప్పినా నీవు గ్రహించగలగవద్దా? మొదట నీవు అక్షరాలు నేర్చుకో. తర్వాత వ్యాకరణం నేర్చుకొని బుద్ధిశాలివగుదువు. ఆ తర్వాత ఓంకారానికి అర్థం చెప్తాను" అన్నారు. "మీరు దీని అర్థాన్ని తెలిపితేగానీ నేను దిద్దను" అన్నాడు సిద్ధుడు. గురువు పిల్లవాని మొండిపట్టుదలకు ఆశ్చర్యపోయి, "విను. ఓంకారంలో ప్రసిద్ధమైనటువంటి

అకార, ఉకార, మకారాలనే మూడు అక్షరాలున్నాయి.'అ' అక్షరం మీద రెండోదైన 'ఉ' అక్షరం రావడంతో గుణసంధి జరిగి ఓంకారంగా మారింది. ఆ ఓంకారం తర్వాత 'మ' కారం చేరి 'ఓమ్' అయింది. అది విన్న సిద్ధుడు "నేను ఓంకారానికి అర్థం అడిగితే మీరు వ్యాకరణ నియమాలు చెప్తున్నారు" అన్నాడు. పిల్లవాని మాటలకు ఆశ్చర్యపడి గురువు, "అట్లైతే దాని అర్థం నీకు తెలిస్తే, నీవేచెప్పు" అన్నారు.

అప్పుడు సిద్ధుడు, "గురువర్యా! వినండి. ఓంకారము బ్రహ్మవాచక పదము. ఆ ఓంకార రూపుడైన సగుణ బ్రహ్మకు మాయయొక్క పంచగుణములు ఆవరించినందువల్ల, అతడు పంచముఖ బ్రహ్మ అని పిలువబడుతున్నాడు. సత్వ, రాజస, తామస, శుద్ధ సత్వ, విశుద్ధ సత్వ అనే ఐదు మాయయొక్క పంచగుణములు. వీటినుంచి క్రమంగా వామదేవుడు, సద్యోజాత, అఘోర, తత్పురుష, ఈశాన్య అనే పంచముఖాలు వచ్చాయి. ఈ ముఖాలనుంచి క్రమంగా 'అ' 'ఉ', 'మ' అర్థమాత్ర బిందువు అనే పంచాక్షరాలు జన్మించాయి. ఈ ప్రకారంగా బ్రహ్మదేవుని పంచముఖాలనుండి పుట్టినటువంటి ఈ 'ఓం' అనే ప్రణవాక్షరము అనంత తత్వజ్ఞాన గర్భితమై భ్రాంతి పరిహారానికి కారణభూతమైనది. ఈ 'నమశ్శివాయ' అనే పంచాక్షరికి తామస గుణ ప్రకృతిచేరి, పంచభూతాలైనవి. ఈ పంచతత్వాలతో, అనంత జాతులతో విరాజిల్లే శరీరాలు, వాటికి అవసరమైనటువంటి భోగభాగ్యాలు పుట్టాయి. ఈ విధంగా జగత్తు ప్రకాశిస్తున్నది. కన్పించేదంతా ఈ పంచభూతమయమే. త్రిశక్తిమయము. కన్పించేదంతా ఓంకార ప్రణవమయము. అకారణంగా సర్వ జగత్తు బ్రహ్మమయము అంటారు. ఇవన్నీపోను, మిగిలిన శేషమే ఓంకారానికి లక్ష్యార్థము. ఈ అర్థము శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాయోగీశ్వరులకు తప్ప మీకు తెలియదు. నేను మీ పాఠశాలలో ఊరికినే కూర్చోవడమనేది వ్యర్థం"- అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఒకరోజు సిద్ధుడు ఒకగేదె మీదకూర్చుని, తన స్నేహితులతో, "నేను ఏనుగు మీద కూర్చున్నాను. మీరంతా మేళాలు వాయిస్తూ నడవండి" అన్నాడు. పిల్లలంతా నోటితో బాకా ఊదుతూ, తొడలు చరుస్తూ బయలుదేరారు. గేదె ఎంత బాదినా ముందుకు నడవక పోవడంవల్ల సిద్ధుడు "నీకు అహంభావం ఎక్కువైంది. నువ్వు ఇట్లాగేపడిపో" అని శపించాడు. వెంటనే ఆ గేదె నిర్జీవంగా పడిపోయింది. అదిచూసిన పిల్లలు దేవమల్లమ్మ వద్దకువచ్చి, "సిద్ధుడు మీ గేదెను చంపేశాడు" అని చెప్పారు.

అది విన్న మల్లమ్మ వచ్చి, చచ్చిపడివున్న గేదెను చూసి, "బాబూ! ఇదేమిటి? పాలిచ్చే గేదెను చంపేశావా? ఇది నీకు తగునా?" అంటూ రోధించసాగింది.

సిద్ధుడు, "అమ్మా! ఊరికినే ఏడుస్తావు దేనికి? నీకు ఈ గేదెవల్ల అన్నీ కష్టాలే! దీని మలమూత్రాలు ఎత్తివేసి శుభ్రంచెయ్యాలి. గడ్డిమేపడం, కుడితి పెట్టడం, నీళ్ళు పెట్టడం, పాలు తీయడం ఇవన్నీ నీకు కష్టమనుకొని ఇలా చేశాను. ఈ కష్టాలన్నీ కోరుకొంటే తీసుకో, నీగేదెను" అని పంచాక్షరీ మంత్రాన్ని ఉచ్ఛరించి, ఆ గేదె మీద తన అమృత హస్తాన్నుంచినంతనే నిర్జీవంగా పడివున్న గేదె, సజీవంగా లేచి నిల్చున్నది.

కొన్ని రోజులు గడిచిన తర్వాత సిద్ధుడొకసారి తన స్నేహితులందర్నీ తీసుకొని స్నానానికని ఏటికి వెళ్ళాడు. అందరూ ఈత కొడదామని దిగారు. కానీ, వాళ్ళలో దేవదత్త అనే అబ్బాయి, "నాకు ఈతరాదు. నాకు భయం" అన్నాడు అప్పుడు సిద్ధుడు, "నిన్ను నిర్భయుణ్ని చేస్తానురా" అంటూ, ఆ కుర్రవాణ్ణి నీళ్ళ మధ్యకు తీసికెళ్ళి ముంచబోయాడు. అతడు భయంతో అరవసాగాడు. దాంతో పిల్లలందరూ చేరి సిద్ధుడినే నీళ్ళల్లో ముంచాలని ప్రయత్నించారు. కానీ, వాళ్ల ప్రయత్నాలేవీ సాగలేదు. ఇంతలో సిద్ధుడు గబుక్కున తాను మునిగి, వెంటనే పిల్లవాడినీ ముంచివేసి, ఒడ్డుకు వచ్చి "నీకిక భయం పోయింది" అంటూ చప్పట్లు కొడుతూ నవ్వసాగాడు. పిల్లలందరూ భయపడి, "ఇదేమిటి సిద్ధా! దేవదత్తుడిని నీళ్ళల్లో ముంచి విడిచి పెట్టేశావు? ఇదేమన్నా న్యాయమా?" అని అడిగారు. సిద్ధుడు "నాదేమి అన్యాయము? ఇతడు భవరూప సంసార సాగరమంటే భయపడుతున్నాడు. ఇతడికి జలరూపుడైన పరమాత్మయందు నిమగ్నంచేసి, భయరహితుని చేశాను. ఏమీ తెలుసుకోకుండా మీరు ఊరికినే మాట్లాడటం మంచిదికాదు" అన్నాడు. ఈ వార్తవిని పిల్లవాని తల్లి గుండెలు బాదుకుంటూ, ఏడుస్తూ వచ్చింది. ఊరిజనము పరిగెత్తుకొంటూవచ్చారు. "పిల్లల్లారా! ఇదేం ఆట మీది? దేవదత్తుణ్ణి నీళ్ళలో ముంచేసింది ఎవరు?" అని అడిగారు. కొడుకును పోగొట్టుకొన్న ఆ తల్లి, "నువ్వు భూమిమీద పుట్టింది కరుణ, జాలి లేకుండా ఇంతటి ఘాతుకం చేయడానికా?" అని విలపించసాగింది. ఆమె రోదన విని సిద్ధుడు, "అమ్మా! కొడుకు చనిపోయాడని ఊరకే ఎందుకేడుస్తావు? అతడు తారకమనే జలాశయంలో నిజబ్రహ్మానందంలో మునిగి వున్నాడు. ఎలుగెత్తి పిలువు -వెంటనే లేచి వస్తాడు. వాని కోసం ఎందుకేడుస్తావు?" అన్నాడు.

ఆమె "దేవదత్తా! ఎక్కడ వున్నావు? రా నాయనా!" అని పెద్దగా పిలిచింది. వెంటనే ఏటి మధ్యలోనుంచి దేవదత్తుడు "అమ్మా! నన్నెందుకు పిలిచావు?" అంటూ లేచివచ్చాడు. లేచి వస్తున్న తన ముద్దుల కొడుకును కళ్ళారా చూసుకొంటూ, ముద్దుపెట్టుకొంటూ, "బిడ్డా! మూడు నాలుగు గంటలు నువ్వు మడుగులోనే మునిగివుండటంతో చనిపోయావనుకొని దుఃఖంతో పిలిచాను. ఇంతసేపు నీటిలోపల నీప్రాణం ఎట్లా తట్టుకొన్నది? చెప్పుబాబు!" అంటూ ఆత్రుతతో అడిగింది. దేవదత్తుడు, "అమ్మా! నా ప్రాణానికి ఏ అపాయము లేకుండా సిద్ధుని దయ వల్ల నీటిలోపల నేను సుఖంగానే వున్నాను. ఏడుస్తూ పిలిచిన నీ ఆర్త ధ్వని విని గాబరా పడుతూ బయటికి వచ్చాను." అన్నాడు. అక్కడ చేరిన జనమంతా ఈ పిల్లవాడు నీటిలోపల ఇన్ని గంటలు ఎలా బ్రతికివున్నాడు? ఈ విషయం సిద్ధుడినే అడగాలి అనుకుంటూ సిద్ధుని చుట్టుముట్టారు. అప్పుడు సిద్ధుడు "ఇతని స్థితిని విచారిస్తే ఇతని ప్రాణము సుషుమ్ననాడి ద్వారా శిఖాచక్రంలో పురీతతి నాడిలో వున్నది." అని చెప్పాడు. దానితో అందరూ "సృష్టి, స్థితి, లయకారకుడైన భగవంతుడే ఈ రూపం ధరించి వచ్చాడు" అని భక్తి భావంతో సిద్ధుని స్తుతించారు.

ఒకరోజు ఊరిలోని జనమంతా కలిసి వనభోజనానికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నారు. ఆరోజు తమ తమ ఇండ్లలో అవసరమైన పక్వాన్నాలన్నీ సిద్ధం చేసికొని వృద్ధులు, తరుణులు, బాల బాలికలు అందరూ తండోపతండాలుగా భీమరాయన వనానికి వెళ్ళారు. వనశోభనుచూసి సంతోషంతో పులకితులై సరసనల్లాపాలాడుతూ సరోవరంలో స్నానంచేసి, తమ తమ నిత్యకర్మలు పూర్తిగావించుకొని, చెట్ల నీడలో కూర్చొని తాము తెచ్చుకొన్న భోజన పదార్థాలను వనదేవికీ, గంగకూ నైవేద్యమిచ్చి, నమస్కరించి ఆకులు వేసుకొని అందరూ భోజనానికి కూర్చున్నారు.

సిద్ధుడు తమతో లేడని గమనించి ఒక బాలుడు ఊరిలోకి వెళ్ళి, "అక్కడ నీవు ఎవరికీ కన్పించక పోవడంతో నిన్ను తీసుకురమ్మని పంపించారు. పద-వెళ్దాము" అని సిద్ధుని తీసుకొని బయల్దేరాడు. సిద్ధుని నడక వేగాన్ని చూసి, ఆ బాలుడు ఇట్లా అన్నాడు. "నీకు వాయువు వశమా? లేక మనోవేగ సిద్ధియా? ఇంతవేగంగా నడవగలుగుతున్నావు?" దానికి సిద్ధుడు, "ఎవరైతే ఏకాగ్రమైన మనస్సుతో

అనిలదేవోపాసన చేస్తారో, వారికి ఈతీవ్ర గమనం సిద్ధిస్తుంది. ఇక మనోవేగం సిద్ధించాలంటే విరాట్టు రూపమునందు మనస్సును పూర్తిగా నిమగ్నంచేసి, ఉపాసన చేయవలెను" అని చెప్పాడు. అతడు సిద్ధుని మాటలు విని, "ఇది నీ ఒక్కనికే సాధ్యంగానీ, మావంటి వారికి సాధ్యమా? భూమిమీది అవతరించిన పరమశివునివి నీవు" అని భోజన సమయానికి సిద్ధుని అక్కడికి తీసుకువచ్చాడు. సిద్ధునికి కూడా విస్తరివేసి భోజనానికి కూర్చోబెట్టారు. భోజనానంతరం అందరూ తోటలో వుండే ఫలాలను కోసుకుంటూ ఉత్సాహంగా వనమంతా తిరుగసాగారు.

సిద్ధుడు వారి మోహభ్రాంతిని తొలగించడానికి ఒక మహిమ చూపించవలెను అనుకొని, శివుని స్మరించి తన ఎదురుగా వున్న ఒక నేరేడు చెట్టును ముట్టుకోగానే పండ్లన్నీ అక్షయమైన రాశిగా క్రింద చేరాయి. అక్కడ పండ్లు ఏరుకొంటున్న జనమంతా సిద్ధుని దగ్గర మంచి నేరేడు పండ్ల రాశిని చూసి, పరుగెత్తుకొంటూ వచ్చారు. సిద్ధుడు వారితో, "మీ పొట్టనిండా తినండి". అని చెప్పాడు. తాము పొట్టనిండా తినడమే గాకుండా కొందరు ఆశతో మూటకట్టుకోవడం చూసిన సిద్ధుడు వారితో ఇట్లా చెప్పాడు - "ఆశ అనేది కామమయము. ఆశ అనేది క్రోధమయము. ఆశ అనేది లోభమయము. ఆశ అనేది మోహమయము. ఆశ అనేది మదమయము. ఆశ అనేది మత్సరము. పేరాశ పెనుభూతమై మోసము చేస్తుంది." ఈ విధంగా ఆశను గురించి సిద్ధుడు చేసిన బోధను విని భయభ్రాంతులై తాము గుడ్డలో మూటకట్టుకొన్న పండ్లన్నీ విసిరి పారేశారు. అది చూసిన సిద్ధుడు "మీరు బాహ్యఫలాలను విడిచి పెట్టినందు వల్ల ఏమి ఉపయోగము? మీ మనస్సునందున్న ఆశను విడిచి పెడితే మీకు శాంతి లభిస్తుంది" అని చెప్పాడు.

సిద్ధుని ఈ నీతి వాక్యాలు విని, ఒక ధనికుడు ఆశ్చర్యచకితుడై, "బాబూ! నీవు ఎవరి పిల్లవాడివి?" అని అడిగాడు. దానికి సిద్ధుడు, "నేను నా కొడుకునే" అని జవాబిచ్చాడు. ఆ షావుకారు "నీవు నీ కొడుకువు ఎట్లా అవుతావు?" అని అడిగాడు. దానికి సిద్ధుడు, "అయితే ఇందులోని మర్మాన్ని చెప్తాను సావధానంగా వినండి. ఈ ప్రపంచమనే యాత్రలో గగనాది క్షేత్రాలలో తిరుగాడుతూ సత్పాత్రనరదేహమనే ఈ క్షేత్రానికి వచ్చిన యాత్రికుడను నేను. ఈ భూమిమీద నేను ఎవరి కొడుకునని చెప్పేది? ఎందుకంటే ' ఈ బిడ్డను నేను కన్నాను. ఇతడు నా కొడుకు' అంటుంది తల్లి. 'నా

వీర్యమునుండి పుట్టాడు కనుక ఇతడునా కొడుకు' అంటాడు తండ్రి. 'నన్నుసేవించి నీయందు వీర్యరూపంలో వుండుటచేత ఇతడు నా కొడుకు' అంటుంది అన్న పూర్ణేశ్వరి. 'నాయందు పుట్టి, పెరిగి నీవు ఆహారముగా అగుటచేత ఇతడు నాకొడుకు' అంటుంది భూమాత. 'నా ఉష్ణము వలన నీవు జన్మించి వర్షరూపంలో కురియుటవలన పుట్టి పెరిగి ఆహార రూపం తాల్చుటవలన ఇతడు నాకొడుకు' అంటాడు అగ్నిదేవుడు. 'నా ఘర్షణ వలన నీవు జన్మించుట వలన నా కొడుకు' అంటాడు వాయుదేవుడు. 'నా శరీరమునందు నీవు జన్మించుటచేత నా కొడుకువు' అంటుంది ఆకాశము. 'నా యందు పుట్టి గగనాదుల యందు సంచరించుట చేత నా కొడుకువు' అంటుంది స్వర్గము. 'ఇతడు ఇంతకు ముందు ఎందరి గర్భములయందో జన్మించెను. ఆ కారణమున ఇతడు నా కొడుకు' అంటుంది కాలము. 'శరీరము కర్మ జన్యమని శ్రుతులు చెప్తూ వుంటే మీ అందరూ ఈ విధంగా అనడం న్యాయమేనా? వారి వారి కర్మలననుసరించి వారివారికి ఆయా శరీరాలు లభిస్తాయి కనుక ఇతడు నా కొడుకు' అంటుంది కర్మ దేవత. నేను మొదట వీరందరి యందు కొంత కొంత కాలము నివసించుటచేత వీరందరూ ఆ అభిమానముతో నా కొడుకు నా కొడుకు అని వాదించడము సరైనదేనా? ఆలోచించి చూస్తే నా కర్మ నుంచి నేను పుట్టాను. నా కర్మకు నేనే కర్తను. నేను అనే కర్తయే ఈ జీవ రూపాన్ని మళ్ళీ నా జీవము అని అంటాడు. ఆత్మరూపుడైన పరమాత్మయందు కన్పించే సర్వజీవులూ పరమాత్ముని బిడ్డలు. నేను ఆత్మ స్వరూపాన్ని. అందువలన నేను నా కొడుకును అని చెప్పడంలో ఏ సందేహమూలేదు" అన్నాడు.

సిద్ధుని ఈ అనుభవ వాక్యాలు విని, ఊరిలోని జనమంతా, "ఈ కలియుగంలో దుఃఖాగ్నిలో పరితపిస్తున్న జనాన్ని కాపాడటానికి పరమశివుడే ఈ నరరూపంలో అవతరించాడు" అని స్తుతించి, నమస్కరించారు.

అందరూ తిరిగి ఊరికి వస్తూ దారిలో చనిపోయిన ఒక పామును చూచి, బెదరిపోయి పరుగెత్తసాగారు. అది చూచి సిద్ధుడు, "ఎందుకు పరుగెత్తుతారయ్యా? చాలు. ఆగండి పామును చూసి భయపడే మీ శూరత్వానికి ధీరులు నవ్వరా? లోకపితకు ఆభరణమైన ఈ శేషుడు మీ భక్తిని పరీక్షించడానికి భూలోకానికి వచ్చాడు. మీ భయాన్ని పోగొట్టుకోవడానికి సులువైన ఒక శివ మంత్ర మున్నది. దానిని మీరు స్మరిస్తూ ఈ

భయాన్ని పోగొట్టుకోండి" అంటూ ఆ పామును పట్టుకొని వాళ్ళవద్దకు తెచ్చి నిలబడ్డారు. అది చూసిన జనమంతా, "అయ్యో! ఇది సజీవ సర్పమని భావించి మేమంతా పారిపోయాము. ఇదేమి ఆశ్చర్యము! ఈ చిన్న పిల్లవానికి ఎంత ధైర్యము!" అనసాగారు. వారి మాటలకు సిద్ధుడు, "ఈ భూమికి సుఖాన్ని ప్రసాదించే శివపంచాక్షరీ మంత్రాన్ని లక్ష్యపూర్వకంగా ఉచ్చరించండి. ఆ నందీశ్వరుని దయ వలన ఆదిశేషుడు బ్రతికి వస్తాడు" అని చెప్పాడు. అందరూ శివపంచాక్షరీ మంత్రాన్ని భజించి నమస్కరించారు. వెంటనే పాము సజీవమై, ప్రాకుతూ వెళ్ళిపోయింది. వారందరూ ఈ మహిమను కళ్ళారా చూసి ఆశ్చర్యచకితులై సిద్ధుని పాదాలంటి నమస్కరించారు.

సిద్ధుని తల్లిదండ్రులు తమ కులగురువైన వీరభద్రస్వామి వారిని గంధ, భస్మ, అక్షత, పత్రపుష్పాదులతో పూజించి అత్యంత భక్తితో సంగమేశ్వర వచనాలను సాంప్రదాయానుసారం నిత్యశ్రవణం చేస్తుండే వారు. ఆ సమయంలో గురువుగారు భక్తులతో ఈ విధంగా చెప్పారు: "భక్తులారా! వినండి. మనకు గోచరించే ఈ ధన, కనక, వస్తు, వాహనాదులు, స్త్రీ పుత్రులు, సంపదలు, ఈ భూమి, జల, అగ్ని, వాయు, నభ, నాక, రవి, శశి మొదలైనవన్నీ మనస్సు యొక్క కల్పనలో పుట్టి, గోచరిస్తున్నవి. ఇవి అన్నీ కలలోని వస్తువులవలె చివరకు నాశనమైపోవునవి గావున మిథ్య అని తెలుసుకొనండి" అని బోధించారు.

తల్లిప్రక్కన కూర్చుని ఇదంతా వింటున్న సిద్ధుడు వెంటనే లేచి, గురువుపాదాల వద్ద చేరి, "గురుదేవా! ఆకాశము వ్యాపించివున్నది. అది మనస్సులో ఎట్లా ఇమిడి లయించింది? ఇది మీరు తెలుపవలసింది" అని చేతులు జోడించి వినయంగా అడిగాడు. చిన్నపిల్లవాని నోటినుంచి వచ్చిన ఇంతటి ప్రశ్నను విని గురువు చకితులై "ఓ ముద్దు బాలకా! యోగ్యమైన ఈ నీ ప్రశ్నను న్యాయశాస్త్రపారంగతులైన సద్గురువు వద్దకు వెళ్ళి అడిగినట్లయితే వారు నీకు సరైన అర్థాన్ని చెప్పగలరు" అన్నారు.

గురువుగారు చెప్పినది విని సిద్ధుడు మనస్సులో "ఇప్పుడు నేను గురువును వెదకడానికి వెళ్లినట్లయితే నా తల్లిదండ్రులు ఒప్పుకోరు. దీనికి ఏదైనా ఒక ఉపాయం ఆలోచించాలి" అని ఆలోచించి "పరమశివా! నీవే దీనిని నెరవేర్చవలెను" అనుకొంటుండగా అతని కుడిభుజం అదిరింది.

ఒక గురువారం నాడు సిద్ధుడు ఊరివెలుపల వున్న ఒక శివాలయంలోకి వెళ్ళి కూచుని ఏకాగ్రమైన మనస్సులో ఆదిశేషుని ధ్యానింపసాగాడు. వెంటనే ఒక బిలద్వారం నుంచి పరమశివుడే సర్పరూపంలో వచ్చాడు. అది చూసిన సిద్ధుడు ఊరి

జనాన్ని రప్పించడానికై పెద్దగా పొలికేక పెట్టాడు. పిల్లవాని ఆర్తస్వరాన్ని విని పురజనులు, తల్లిదండ్రులు అందరూ పరుగెత్తుకుంటూ అక్కడికి వచ్చి చేరారు. వారందరి సమక్షంలో సిద్ధుని మోకాలి వద్ద కరచి ఆ పాము అదృశ్యమైపోయింది. సిద్ధుని శరీరమంతా విషం వ్యాపించింది. నోటి నుండి నురగ కారుస్తూ, సిద్ధుడు నేలకొరిగాడు.

అక్కడ చేరిన జనమంతా దుఃఖంతో హాహాకారాలు చేయసాగారు. సిద్ధుని తల్లిదండ్రులు గోడుగోడుగా విలపిస్తూ, "పరమశివా! మహాజ్ఞాన సంపన్నుడైన పుత్రుని మాకు ప్రసాదించినది ఏడు సంవత్సరాలకే మృత్యుదేవత నోట బెట్టడానికా? నీవు ఇచ్చిన పిల్లవాని గొంతు నీవే కోస్తావా? నీకు కరుణ జాలి ఏ మాత్రంలేవా? కఠినాత్ముడా!" అని రోదిస్తూ పిల్లవాని నెత్తుకొని వెళ్ళి శివుని ముందు వుంచారు. దేవమల్లమ్మ "నాయనా! పాఠశాలలోని బుద్ధి కుశలుడైన గురువుకే నీవు ప్రణవార్థాన్ని వివరించి చెప్పావు. చనిపోయిన గేదెను, పామును, పిల్లవాడిని మళ్ళీప్రాణమిచ్చి బ్రతికించావు. ఇంతటి మహామహిమాన్వితుడైన పిల్లవాడిని నేనెట్లా మరచిపోయేది? భూమి మీద ఇంక నేను ఎట్లా బ్రతకాలి? అయ్యో భగవంతుడా!" అని తీవ్రమైన దుఃఖంతో ఏడుస్తూ నేల మీద కూలబడింది.

అదే సమయానికి శివుడు జంగమవేషంలో "పాము కాటుతో చనిపోయిన వాళ్ళని బ్రతికిస్తాను" అని అరచుకొంటూ అటువైపు వచ్చారు. జనమంతా "మా పిల్లవాణ్ణి బ్రతికించండి" అని ఆ మహాత్ముని పాదాలకు మొక్కి వేడుకొన్నారు.

ఆ జంగముడు సిద్ధుడున్న చోటికి వచ్చి అతని సర్వాంగాలూ ముట్టుకొంటూ ప్రాణం వున్నలక్షణాలేమైనా వున్నాయేమోనని పరీక్షించసాగాడు. నడినెత్తిమీద కదులుతున్న ఒక సుడిని గమనించి, తల్లిదండ్రులతో ఇట్లా చెప్పాడు "ఇతడు జగత్తునకు గురువు అవుతాడు. ఇల్లు విడిచి, గురువును వెదుక్కొని గురువు వద్ద విద్యాభ్యాసం చేయడానికి మీరు ఇతనికి సంతోషంగా అనుజ్ఞ ఇస్తామని నాకు మాట ఇస్తే ఇతనిని బ్రతికించే మార్గం చూస్తాము. లేనట్లయితే వచ్చిన దారినే తిరిగి వెళ్ళిపోతాను."

అప్పుడు సిద్ధుని తల్లిదండ్రులు, "మా బిడ్డ భూమి మీద ఎక్కడైనా సరే జీవించి వుంటే అదే చాలు! మొదట వాడిని బ్రతికించండి. గురువుని వెతుక్కుంటూ వెళ్ళడానికి మేము అనుజ్ఞ ఇస్తాము. మీకు ప్రమాణంచేసి చెప్తున్నాము" అని నమస్కరించి చెప్పారు.

వెంటనే ఆ జంగం దేవర మంత్రం వేయడంతోనే అదృశ్యమైన చోటునుంచి ఆ పాము తక్షణమే వచ్చి, సిద్ధుని గాయం మీద మళ్ళీ కరిచి విషమంతా లాగివేసింది. వెంటనే సిద్ధుడు మూర్ఛ నుంచి లేచి "శివా శివా" అంటూ కళ్ళు తెరిచాడు. అందరు ఆనందసాగరంలో మునిగిపోయారు.

పిదప ఆ జంగముడు అదే గుడి వద్ద సిద్ధునికి శాస్త్రోక్తంగా స్నానమాచరింపజేసి, భస్మలేపనము చేసి, ప్రీతిపూర్వకంగా పూజావిధి నెరవేర్చి, దీక్షనిచ్చారు. తర్వాత జంగముడు, "జగదోద్ధారకుడవూ, మహానుభావుడూ, శివాంశసంభూతుడవూ అయిన నీవు ఈ హీనసంసార బంధంలో చిక్కుకొనవద్దు. దివ్యమైన సద్గురువును సేవించి, వారి కరుణ పొంది సుజ్ఞానివై దిగ్విజయంగా ముముక్షువులను ఉద్ధరించ వలసింది" అని ఆశీర్వదించారు. సిద్ధుడు దానిని శిరసావహించాడు. అంతట అందరూ సిద్ధుని పల్లకీలో కూర్చుండబెట్టి మహదానందంతో గ్రామంలోని నాలుగు వీధుల్లో ఊరేగిస్తూ విరక్త మఠానికి తీసుకువచ్చి విడిచి, అతి సంభ్రమంతో పూజించి అన్న సంతర్పణ చేశారు.

తర్వాత ఒక రోజు సిద్ధుడు "నేను గురుశోధనకు వెళ్ళడం మాని, మీ సత్కారానికి మోహపడి ఇక్కడ వుండి పోవడం యోగ్యంకాదు. నాకు ప్రయాణానికి అనుమతి ఇవ్వవలసింది" అని వారందరి అనుమతినీ పొంది, అందరకూ నమస్కరించి, బయలుదేరటానికి ఉద్యుక్తుడైనాడు. అది చూచి తల్లిదండ్రులు దుఃఖంతో కళ్ళనీళ్ళు పెట్టుకొంటూ సిద్ధునితో "బిడ్డా! మాగతి ఏమిటి?" అంటూ విలపించసాగారు. సిద్ధుడు వారితో, "వీడు నా కొడుకు అనే మమత మోక్షాన్నిచ్చే శివనామాన్నే మరచేలా చేస్తుంది. మమకారాన్ని మించిన బంధం లేదని జ్ఞానులు చెప్పినట్లుగా మమకారము మానవులను దుఃఖసాగరంలో పడవేస్తున్నది. మీరు నిజస్థితిని ఉల్లంఘించుట వలన ఫలితమేమిటి? సంతోషంతో నన్ను పంపించండి'

అని చెప్పారు. సిద్ధుని ఈ హితోపదేశం విని గురుశాంతప్ప, "బిడ్డా! రేపు ఒక్కరోజు వుండి ఇక్కడ భోజనం చేసి వెళ్ళయ్యా!" అని అన్నాడు. సిద్ధుడు సమ్మతించాడు.

మర్నాడు తెల్లవారుఝామునే తల్లిదండ్రులు జన సమూహంతో కలిసి సిద్ధుని విరక్తమఠానికి తీసుకువచ్చారు. మంగళ స్నానం చేయించారు. బాల సిద్ధునితో కలిసి అందరూ ఉల్లాసంగా పక్వాన్న భోజనంతో తృప్తులై కూర్చున్నారు. సిద్ధుని తల్లిదండ్రులు పిల్లవాడిని ప్రేమతో ముద్దుపెట్టుకొని "సిద్ధా! మమ్మల్ని విడిచి పోతున్నావా? మాగతి ఏమిటి?" అని మళ్లీ విలపించసాగారు. సిద్ధుడు వారితో, "నేను గాక ఇంకా ఇద్దరు పిల్లలున్నారు మీకు. నేనే వారని తెలుసుకొని సుఖంగా వుండండి" అని సమాధాన పరిచాడు. "కొడుకు మీద అతి మమకారాన్ని విడిచి పెట్టండి. ఇదే అనురాగాన్ని సద్గురువునందు వుంచండి. నా కర్మయే నన్ను పుట్టించింది. నా కర్మయే మహిమలు చూపించింది. నా కర్మయే సర్పరూపంలో నన్ను కరిచింది. నా కర్మయే మరలా రక్షించింది. ప్రారబ్ధకర్మాన్ని తప్పించుకోవడం ఎవ్వరికీ సాధ్యం కాదు" అని బోధించాడు. అంతట పురజనులందరూ వస్త్ర దక్షిణాదులు, గంధ పుష్పాదులూ తెచ్చి సిద్ధుని పాదాల వద్దవుంచి పూజించారు. తల్లిదండ్రులు ఆనందంతో హారతి ఇచ్చారు. సిద్ధుడు వచ్చిన దక్షిణంతా ఊరిదేవాలయానికిచ్చి, జీర్ణ దేవాలయ పునరుద్ధరణకు వెచ్చించమని చెప్పాడు. వచ్చిన వస్త్రాలనన్నిటినీ పేదలకిచ్చి, అందరకూ పండ్లు, ఫలాలు ఇచ్చి ఆశీర్వదించాడు పిల్లలు, పెద్దలు అందరికీ నమస్కరించి బయలుదేరటానికి ఉద్యుక్తుడయ్యాడు.

సిద్ధుని విడిచి వుండలేని సోముడు, భీముడు అనే ఇద్దరు తామూ అతనితోపాటు వస్తామని బయలుదేరారు. అందరూ కలిసి సిద్ధుని ఊరి వెలుపలి వరకు తోడ్కొని వచ్చారు. సిద్ధుని కాపాడుతూ వుండమని దేవతలందరినీ ప్రార్థిస్తూ, సిద్ధునికి వీడ్కోలిచ్చారు.



# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 2

సిద్ధుడు తన స్నేహితులైన సోమప్ప, భీమప్పలతో కలిసి ముందుకు సాగాడు. దారిలో సోమప్ప, భీమప్పలు, "సిద్ధా! నీవు ఊరు విడిచి ఎక్కడికి వెళ్లావు? ఎందుకోసం?" అని అడిగారు.

"స్నేహితులారా వినండి. బాల్యంలోనే సద్గురువును వెదుక్కోవాలి.వారి కృపకు పాత్రుడు కావాలి. ఈ విధంగా వారి కృపకు పాత్రుడై బ్రహ్మజ్ఞానాన్ని పొందటమే మానవుని ముఖ్య కర్తవ్యము. దానిని ఈ బాల్యంలోనే సాధించుకోవాలి. ఎందుకంటే ఈ బాల్యావస్థ దాటి యౌవనావస్థ వచ్చిందంటే మనస్సు విషయాలయందు వ్యామోహపడి, ఆ విషయాలలోనే చిక్కుకుపోతుంది. ఇక దానికి మోక్షాపేక్షయే కలుగదు. ఇక ముసలితనంలో తాను అనుభవించినసంస్కారాల వాసనలు విడువక అలల వలె మరల మరల లేస్తూమనస్సును ధ్వంసం చేస్తాయి. దానితో సవతిపోరు పడలేక మగని ఇంటినుంచి పుట్టింటికి వెళ్లిపోయిన భార్యలాగా జ్ఞాపకశక్తి కూడా నిలువలేక బయటికి పోతుంది. అంతటి హీనమైన బుద్ధితో సద్గతి పొందుట ఎట్లు? ఈ హీన జడదేహము గాలిలోని దీపంలా, నీటి మీద బుడగలా అనిత్యం. అందువలన చిన్న వయస్సులోనే మనస్సును విషయాలలో చిక్కుపడనివ్వక బ్రహ్మమునందు లయించునట్లు చేయగల సద్గురువును వెదకుటకై నేనిలా బయలుదేరాను" అని చెప్పాడు.

సోమప్ప, భీమప్పలు సిద్ధునిబోధ విని, "అలా అయితే పరమగురువు శోధనకు మేమూ సిద్ధమే. నడువు" అన్నారు. వారితో కలిసి సిద్ధుడు పైగ్రామానికి చేరుకున్నాడు. సోమప్ప, భీమప్పలు ఆకలితో అలమటించిపోతూ,"సిద్ధా! ఈ ఊరిలో మనల్ని భోజనానికి ఎవరు పిలుస్తారు?" అని అడిగారు. వారితో సిద్ధుడిట్లా చెప్పాడు "మీరువచ్చింది గురువును వెదకడానికి? లేక అన్నం వెదుక్కోవడానికి? అన్నం కంటే ఎక్కువ తృప్తి శివసాన్నిధ్యం వల్ల లభిస్తుంది. ఇది తెలుసుకోకుండా మీరు ఆకలినే లక్ష్యపెడుతూ వుంటే బాధ ఎక్కువౌతుంది. అందువలన శివధ్యానం చేయండి".

దానికి భీమప్ప, సోమప్పలు "పూర్వం ఇంద్రియాలకు వివాదం వచ్చినప్పుడుప్రజాపతి కూడా ప్రాణానికే ప్రాముఖ్యం ఇచ్చాడు. అన్నగతప్రాణం అనే

శృతి వుండనేఉన్నది. కాబట్టిప్రాణానికి అన్నం పడవేస్తే మనస్సు తృప్తి చెంది ధాన్యం కుదురుతుంది. అందువలన ప్రాణానికి ముందు అన్నం కావాలి" అన్నారు.

దానికి సిద్ధుడు ఇలా అన్నాడు "ఆకలి గురించి చింతించడం అనుచితము. శాంతిలేని మీ మనస్సు జఠరాగ్ని దిక్కున నిలవడం వలన ఆకలి అనిపిస్తున్నది. ఆకలి వేయడం ఆకలి తీరడం ప్రాణం యొక్కస్వభావమే కాని ఆత్మగుణం కాదు. అన్న శాంతి అనేది ఏడు ఘడియల వరకు మాత్రమే ఉండి నశిస్తుంది. మళ్ళీ ఆకలి పుడుతుంది. కాబట్టి అది నిజమైన సుఖం కాదు. కాని ధ్యాన యోగమువలన తాపత్రయం అణగిశాశ్వతమైన సుఖం లభిస్తుంది. సిద్ధాసనంలో కూర్చొని మనస్సును, దృష్టిని ధ్యానంలో పూర్తిగా నిలపాలి. బాహ్యంగా చలించే ప్రాణాన్ని ఆపి సుషుమ్న నాడి యందు గట్టిగా చెర్చాలి. అప్పుడు అన్నం లేకుండానే క్షుత్తాపము అణగి చిత్తము స్థిరంగా నిలుస్తుంది. దానితో తృప్తి శాంతులు తను,మనస్సులకు లభిస్తాయి.

భీమప్ప, సోమప్ప లిద్దరూ సిద్ధుని బోధవిని, "సరే నీవు చెప్పినట్లే కానివ్వు, పద" అన్నారు. సిద్ధుడు, "ఇప్పుడు మనం చేరేది నలదుర్గమునకా? సదాశివ పేటకా" అని అడిగాడు. భీమప్ప, "ఆ నలదుర్గము చాలా దూరము. ఈ సదాశివపేటకు చేరడం ఉత్తమం" అని అన్నాడు. దానికి ముగ్గురూ ఒప్పుకొని వేసవి ఎండను సహిస్తూ, అరక్రోసు దూరం నడచి ఆ ఊరి బయట ఉన్న బసవేశ్వర దేవాలయానికి చేరారు. అక్కడ విశ్రాంతి తీసుకోవడానికి గుడి మధ్యలోని రంగమంటపంలో పడుకొన్నారు. గుడిలోపల ఉన్న నందీశ్వరుని చూడడం తోనే సిద్ధుడు ఆనందోల్లాసిత వదనుడై పరవశించిపోతూ, అ నందీశ్వరునిపైన ఎక్కి కూర్చున్నాడు. ఇంతలో దేవాలయ అర్చకుడు వచ్చాడు. నందీశ్వరుని మీద కూర్చున్న సిద్ధుని చూసికోపంతో గర్జిస్తూ, "ఒరేయ్ గాడిదా! ఎవడ్రా నీవు? ఛండాలుడవా? నాస్తికుడవా? తురకవా? ఎవరు నువ్వు? నీవు శైవుడవే అయితే నీ పుణ్యాన్నీ, నీభక్తి భావాన్నీ, శ్రేష్ఠ ధర్మాన్నీ మట్టిలో కలిపేశావా"? అని నిందించాడు. ధీరుడైన సిద్ధుడు అతని మాటలకు జంకక, "నేను నిజమైన వీరశైవుడను. నేను శిలను పూజిస్తున్నానే అశుద్ధ భావనను నిర్మూలించాను. అది వృద్ధియై మీ వంటి మందమతుల హృదయాల్లో చేరుకొన్నది. నేను నా పుణ్యానంతా పరహితానికై ధారపోశాను." దానితో పూజారి మరీ కోపించి ఊరిలోకి వెళ్ళి పుర ప్రముఖులందరికీ ఈ విషయమంతా చెప్పి వారిని గుడివద్దకు పిలుచుకువచ్చాడు. వారిలో ఒకడు. "పాపీ! బసవుని మీద ఎక్కడానికి అది దేవుడని నీకుతెలియదా?

మూర్ఖుడా!" అని తీవ్రంగా తిడుతూ, చెయ్యెత్తి సిద్ధుని కొట్టబోయాడు. ఆ చెయ్యి వెనుక వున్న వాకిలికి తగిలి రక్తం ధారకట్టింది. అతడు 'కటకటా' అని అరుస్తూ క్రిందపడిపోయాడు. జనం అతన్ని బయటకు మోసుకుపోయారు. మిగిలిన వారిలో ఒకడు నెమ్మదిగా ఇలా అడిగాడు. "తమ్ముడా! నీవు దేవుడి మీద ఏ కారణంగా ఎక్కి కూర్చున్నావు? భయపడకు దాచకుండా చెప్పు" అని అడిగాడు.

దానికి సిద్ధుడు, "ఏమీ తెలియని పామరులైన మానవులు హీనమనస్సుతో నమస్కరించి, నమస్కరించి ఈ నందీశ్వరుని పుణ్యాన్నంతా హరించి వేశారు. ఇప్పుడది శిలా మాత్రంగా మిగిలింది. దానిని నేను గమనించి మీ శ్రేయస్సుకోసం ఈ బసవునికి ప్రాణప్రతిష్ఠచేయవలెనని ఎక్కి కూర్చున్నాను. కానీ, హితము చెప్పబోయిన శ్రీ కృష్ణుని అహంకారంతో అవమానించిన కౌరవులు తామే పోయినట్లు అనాయాసంగా మీకు ఆశీర్వాదం లభిస్తుంటే, అది తెలుసుకోక మీరు చేసుకొన్నదానితో మీరే మోసపోతున్నారు" అని చెప్పాడు.

అప్పుడు జనులందరూ తమ అహంకారాన్ని విడిచి, "ఇతడుబాలుడు కాదు. మన పుణ్యమూర్తి. మనము తెలియక నిందించాము" అని పశ్చాత్తాపపడ్డారు. అందరూ సిద్ధుని పాదాలంటి నమస్కరించి, ఊరిలోనికి తీసుక వెళ్లి మంచి భోజనము పెట్టి తృప్తి పరిచారు.

పిమ్మట వారిలో ఒకరు సిద్ధుని ఇట్లా ప్రశ్నించారు "కాశీలోనూ, పురపట్టణాలలోనూ వున్న దేవాలయాలన్నిటిలోనూ శిలామూర్తులున్నాయి. వాటి యొక్క పూజామహిమ వల్ల కళ ఉట్టిపడుతూ వుంటాయి. దానికి కారణమేమిటి?" అని అడిగాడు. దానికి సిద్ధుడు, "పూర్వపు ఋషి పుంగవులుతమ తపస్సు, యజ్ఞాల పుణ్యఫలాన్ని ఆ శిలా మూర్తులకు ప్రేమతో ఇచ్చి ప్రాణప్రతిష్ఠగావించారు. అచటికి అనేక మంది జనులు భక్తితో వెళ్ళి తమ ధన, ధాన్య, వస్త్ర, వాహనాదులను, తను, మనస్సులతో దానం చేస్తూ ఆ మూర్తులకు భక్తి భావంతో నమస్కరిస్తూ పుణ్యము పొందుతున్నారు. భయభక్తులతో ఇటివంటికార్యము జరుగుతూ ఉంటే వాటి పుణ్యము వర్ధమాన మౌతుంది. ఆ మూర్తులకు శాంతి, పూజా, వైభావ, ఉత్సవ కార్యాలు విడువకుండా నడుస్తూ వుంటే వాటికి నాశమెలా కలుగుతుంది? ఇంకా కొన్ని పల్లె, పట్టణాల్లో భ్రాంతిలో పడ్డ జనులు తామస, అహంకారములతో, లేదా పక్షపాతబుద్ధితో మూర్తులను స్థాపించుతారు. అక్కడకు అజ్ఞులు ఊరికినే వెళ్లి

నమస్కరించడం వలన ఆ మూర్ఖుల పుణ్యము నశిస్తుంది. అందువలన అది శవము వలె వట్టి రాయియై మిగులుతుంది. పుణ్యము క్షయము కలుగకుండా వుండాలంటే దాన, ధర్మ, పరోపకార, పూజ, జప, తప, వందనాదులు అత్యావశ్యకము. పుణ్యము వల్లనే త్రిలోకములందుసుఖసంపత్తుల వ్యవహారము జరుగుతున్నది. పుణ్యము వలన ధనికుడవుతాడు. పుణ్యము వల్లనే రాజుగానీ, నర, గంధర్వుడు గానీ అవుతాడు. పుణ్యము వల్లనే మోక్షము లభిస్తుంది. ఇది సత్యమని తైత్తరీయోపనిషత్తు చెప్తుంది. తల్లి తానుఅన్నము తిని బిడ్డకు ప్రేమతో పాలిచ్చునట్లు బ్రహ్మజ్ఞాని కూడ అన్నము ఆ అన్నరూప పుణ్యాన్ని ఈ బసవుని యందుంచి, మీ అందరికీ సుఖ సంపత్తులనిచ్చి కాపాడుతాడు" అని సిద్ధుడు చెప్పాడు.

అంతట జనమంతా, "మన పూర్వపుణ్యము వలన ఆ నందీశుడే ఈ బాలుని రూపంలో వచ్చాడు" అని పరమ భక్తితో సిద్ధుని పూజించి, పరమానందంతో జయజయధ్వానాలు చేశారు.

సిద్ధుడు సోమప్ప, భీమప్పలతో కలిసి ముందుకు సాగాడు. దారిలో తీవ్రంగా వీచే పెనుగాలికి పెద్ద పెద్ద చెట్లు ఊగి పడిపోసాగాయి. ఉరుములు, మెరుపుల ఆర్భాటానికి గుండెల్లో అలజడి కలుగసాగింది. ముగ్గురు వర్షంలో వణుకుతూ ఒక చెట్టు క్రిందకొచ్చి చేరారు. అంతలో గాలివాన తగ్గి, వెలుతురు వచ్చింది. వేటగాళ్ళు జంతువులను వేటాడుతున్నారు. పులులు సింహాలు గర్జించసాగాయి. ఆ భయానక దృశ్యాలనుచూసి సోమప్ప, భీమప్పలు భయపడి, "సిద్ధా! మనం ఇల్లు విడిచిపెట్టి వచ్చింది చావును వెదుక్కోవడానికి గానీ, సద్గురువును వెదకడానికి కాదు" అని విలపించ నారంభించారు. అప్పుడు సిద్ధుడిలా చెప్పాడు - "మహాదేవుని మరచి ఇంటిని తలచుకొంటున్నారు. పరమపదమునిచ్చే ఆ శివుడు ఎక్కడకు తీసుకువెళ్తే, అక్కడకే పోదాము. అతడు మనల్ని విడువక కరుణతో కాపాడుతాడు. నడవండి." భీమప్ప బురదలో కాలుజారి పడగా మోకాలకు దెబ్బ తగిలి ఏడ్వసాగాడు

అప్పుడు సిద్ధుడు వారిని సమాధాన పరుస్తూ, "తల్లి తండ్రి అని చెప్పబడే పరమ శివుని తలచుట మాని, మీరు శరీరం గురించి చింతించడం వలన మీకీ దుస్థితి వచ్చింది. మన అర్హతను పరీక్షించడానికి గురువే మనకి కష్టాల్ని కల్పించారు. ఈ జడదేహమే నేను అనే భావము మీ మనస్సులో ఎప్పటివరకు ఉంటుందో

అప్పటివరకు చావు పుట్టుకల బాధ తప్పదు. గాడిద బరువు వేసుకొని ఇంటికీ అడవికీ తిరుగునట్లే జడమైన అసంఖ్యాకమైన ఈ శరీరాలను మోసుకుంటూ ఇహపరాలకి తిరిగి తిరిగి కష్టపడవలసి వస్తుంది. ఈ దేహాభిమానమే పూర్వజన్మలో చేసినటువంటి కర్మ సంస్కారాలకు కారణ భూతము. దుఃఖాన్ని సుఖంగా చూడగలగడం కష్టమే. ఈ కష్ట విమోచనానికి వివేకాది సాధన చతుష్టయాలు ముఖ్యసాధకాలు, మనము ముక్తి చింతనతో ఏ గురువునైతే వెదుకుతుంటామో, ఆ గురుదేవుడే కరుణించి మన హృదయంలో అంతర్యామియైమనకు నిజమైన వైరాగ్యాన్ని ప్రసాదిస్తాడు. అందువలన ఇప్పుడు లోపల దాగివున్న భయాలన్నింటినీ వదలి ముందుకు వెళ్ళడం శ్రేయస్కరం" అని సిద్ధుడు ఉపదేశించాడు.

అప్పుడు సోమప్ప, భీమప్పలిద్దరూ, "అయినదేదో అయిపోయింది. ముందు మాకు ఇంటికి దారి చూపించు. గురువు సంగతి తరువాత చూసుకోవచ్చు" అని అన్నారు. మళ్ళీ సిద్ధుడు, "ఏ కష్టము లేకుండా గురుప్రాప్తి కాదు. తల్లి తండ్రులను పొందవచ్చు - భార్యా బిడ్డలను పొందవచ్చు. కానీ గురు చింతన చాల కష్టం. గురు దర్శనం ఇంకా కష్టం. గురు సేవ దుర్లభం. గురువు లభించడం చాలకష్టం. ఆత్మబోధ చేసే గురువు లభించడం పరమ దుర్లభం. రోగి, మందు చేదుగా వుందని విడిచి పెట్టతగునా? ఊరే సౌఖ్యమనుకొంటే అదుగో చూడండి ఊరు!" అని సిద్ధుడు ఊరు చూపించాడు.

కొంచెం దూరంలో పాడుబడిన దేవాలయాన్ని చూశారు. అక్కడికి వెళ్లి విశ్రాంతి తీసుకోబోయే లోపల వర్షానికి నానిన గోడ ఒకటి పెద్ద శబ్దంతో పడిపోయింది. దానితో సోమప్ప, భీమప్పలకు గుండె అదిరిపోయింది. "అయ్యో సిద్ధా! మాకు ఉత్తమ గురువు దొరికేది చచ్చిపోయాకనా? నీ బోధచాలు! ముందు మా ఆకలి సంగతి చూడు" అని మొదలు పెట్టారు.

"మిత్రులారా! మీ మనస్సుకు తృప్తిలేదు. ముందు ఊరు చూపించమన్నారు. ఊరు చూసిన తర్వాత ఇప్పుడు భోజనాన్ని ఆశిస్తున్నారు. కోరికలకు అంతులేదు. కోరికలను జయించే సాధనని విడిచిపెట్టి మీరు ఇప్పుడు భోజనం కోసం ప్రయత్నిస్తే మీకు కీడు తప్పదు" అని సిద్ధుడు నిద్రకు ఉపక్రమించాడు.

సోమప్ప, భీమప్పలు, క్షుద్బాధకు తట్టుకోలేక భిక్షాటనకై ఒక వీధికి వెళ్లారు. వాళ్లని కుక్కలు వెంబడించాయి. వాళ్లిద్దరూ భయపడి ఒక గోడ చాటున దాక్కున్నారు. కుక్కల అరుపులకి ఆ ఇంటి యజమాని తలుపు తీసి బయటకొచ్చి, వాళ్లను చూసి కోపంతో, "వెధవల్లారా! మొన్న మా గేదెలను దొంగిలించింది మీరేగదా! ఇప్పుడు మళ్లీ ఎవరి ఇంట్లో దోచుకోవాలని వచ్చారు?" అని అరిచాడు. "అయ్యా మేము దొంగలము కాము. భిక్షాటనకై వచ్చిన వాళ్లం. ఆకలి ఇంత అన్నంవుంటే పెట్టించండి" అన్నారు సోమప్ప భీమప్పలు. "వెధవల్లారా! మీకు బిచ్చం కావాలా? వుండండి మీకు వేసే బిచ్చం తీసుకొస్తాను అంటూ లోపలికి వెళ్లి కొరడా తీసుకవచ్చాడు. దాంతో ఇద్దరూ భయపడి వీధి పట్టుకు పరుగెత్తారు. నడి వీధికి వచ్చేటప్పటికి గస్తీ వాళ్ళచేతుల్లో పడ్డారు. వాళ్ళు, "గాడిద కొడుకుల్లారా! మీవాళ్లెక్కడ దాక్కున్నారు? ఇప్పుడు మీరు ఏ ఇంటికి కన్నం వేయడానికి వచ్చారు?" అని గదిమారు. దానికి సోమప్ప, భీమప్పలు, "మేము నిజంగా భిక్షాటనకే బయలుదేరాము. దొంగలంకాదు" అని దీనంగా వాళ్లని వేడుకొన్నారు. "మీకు ఇంత రాత్రివేళ ఎవరు భిక్ష వేస్తారు? మీరు ఎవరింటికీ వెళ్లకుండా దేవాలయానికి వెళ్లి పడుకోండి. చీకటితోనే లేచి భిక్షకు వెళ్లవచ్చు" అని పంపించారు. ఆ కావలి వాళ్ళు సోమప్ప భీమప్పలను విడిచి పెట్టిందే తడవుగా పరుగెత్తుకొంటూ గుడికి వచ్చి సిద్ధునికి తమ కష్టాలన్నీ చెప్పుకొన్నారు.

అప్పుడు సిద్ధుడు, "ఎంత చెప్పినా వినిపించుకోకుండా వెళ్లారు. దీనివల్ల అవగింజంతైనా ఫలప్రాప్తి లేకపోగా కష్టాలు ఎదురయ్యాయి. చూడండి. నేనునిశ్చల చిత్తంతో శివధ్యాన తత్పరుడనై కూర్చుని వున్నాను. అంతలో అర్చకుడు వచ్చి నైవేద్యం పెట్టి, నీళ్లు కూడ ఇచ్చివెళ్లాడు. కాళ్లు, చేతులు లేకుండా తల్లిడిల్లుతున్న జీవులకి అన్నం పెట్టే దేవుడు మనకి అన్నం పెట్టడా? ఎవరైతే వేదాలను సృష్టించి కాపాడుతున్నాడో, ఎవరైతే సకల దేవతలను కాపాడుతున్నాడో, ఎవరైతే మార్కండేయుణ్ణి కాపాడాడో, ఎవరైతే, ఈ నిఖిల జగత్తును సృష్టించి, ఆ సృష్టిలో తానే అంతర్యామియే తిరుగుతుంటాడో, అతడే మన అందరిని కాపాడుతాడు." అని చెప్పాడు. వాళ్లిద్దరు, "నువ్వు ఎంతచెప్పినా వినకుండా వెళ్లినందుకు మాకిలాంటి కష్టాలు ప్రాప్తించాయి. మాదే తప్పు" అని అన్నారు.

తరువాత సిద్ధుడు ఆ నైవేద్యపు విస్తరు వాళ్ల ముందుంచాడు. ముగ్గురు కలిసి ఆ నైవేద్యాన్నిఆరగించారు. ఆ మరుసటి రోజు ఉదయం సోమప్ప భీమప్పలు, "సిద్ధా! మాకు గురువూ వద్దు!ముక్తీవద్దు! మాకు మా తల్లి దండ్రుల మీద బెంగగా వున్నది

మాకిక ఇంటికివెళ్లటానికి సెలవిప్పించు" అని అన్నారు. దానికి సిద్ధుడు, "కోమలాంగులారా! మీరు ఇంట్లోనే వుండి సోమధరుడ్ని విడిచి పెట్టక ధ్యానించండి. శ్రీ గురువు మీ కోర్కెలను తీర్చి కాపాడుతాడు" అని చెప్పి వాళ్లను మన్నించి ఇంటికి పంపించేశాడు.

సిద్ధుడు ఒక్కడే సంచరిస్తూ హైదరాబాద్‌కి చేరాడు. అక్కడ గోల్కొండ వద్ద ఒక చిన్న గుహలో ధ్యానస్థుడై కూర్చున్నాడు. అక్కడినుంచి దక్షిణ దిక్కుగా పయనిస్తే, సద్గురు దర్శనమౌతుందని అతనికి ధ్యానంలో గోచరించింది. వెంటనే దక్షిణానికి బయలుదేరి, శ్రీ శైలంచేరాడు. అక్కడి సూర్య సింహాసన మఠంలోని స్వామి వారి దర్శనం చేసుకొన్నాడు. ఆ స్వాములవారు సిద్ధునిచూసి,"బిడ్డా! నీవెవరు? ఇంత చిన్న వయస్సులో ఇల్లు విడిచి దేనికి వచ్చావు?" అని అడిగారు. సిద్ధుడు తానుసద్గురువును వెతుక్కుంటూ వచ్చానని చెప్పగా, స్వాములవారు ఇట్లా అన్నారు. - "అయితే, సద్గురు కృప పొందటానికి సాధనాలు ఏవి?" దానికి సిద్ధుడిలా బదులు చెప్పాడు "స్వామీ! వివేకాది నాలుగు సాధనలతో ఈ సంసారము దుఃఖమయమని తెలుసుకొని,వేశ్య తన విటుని మీదనే మనస్సును లగ్నం చేసినట్లుగా మోక్షాపేక్షగలవాడు పరమ సుఖమునందే మనస్సును లగ్నం చేస్తాడు. ఇక అహంకారమనగా సర్వాన్నీ నేనే తెలుసుకొంటున్నాను అనే భ్రమ. మమకారమనగా తనకు ఎదురుగా కనిపించే సకల వస్తువుల తనవేయను భావము. ఈ విధమైన ఆలోచనతో జడ, చేతనాలను వేరుపరచి తెలుసు కోవడమే ఆత్మానాత్మ వివేకము. ఇటువంటి ఆలోచనతో తనకు అన్యమయిన ఇహపర లోకాల్లోని భోగభాగ్యాలన్నీ దుఃఖమయమని తెలుసుకొని, వాటిని కోరక, తృణప్రాయంగా తిరస్కరించి విడుచుటయే శ్రేష్ఠమైన వైరాగ్యము. ఇక, కోతివలె విషయాల మీదకు పరుగెత్తే మనస్సును అరికట్టుటయే శమము. బాహ్య విషయాలలో కొట్టుమిట్టాడే జ్ఞానేంద్రియాలనుపట్టుకోవడమే దమము. గురువులయందు, వేద శాస్త్రముల యందూ నడలని విశ్వాసము కలిగి వుండుటే నిజమై శ్రద్ధ. అటువంటి శ్రద్ధతో, నిత్య కర్మలను, ఉపాసనలనూ చేస్తూ, మనస్సులో కలిగే రకరకాల సంకల్ప వికల్పాలను దూరం చేసుకొంటూ చిత్తమును స్థైర్యం వుంచడమే సమాధానము ఈప్రకారంగా వైరాగ్యము నందు స్థిరమైయున్న మనస్సును మరలవిషయముల మీదకు పోకుండా చేయుటయే ఉపరతి. ఈ సాధనలను చేసే కాలంలో శరీరాన్ని విడువకుండా పీడించే శీతోష్ణాది ద్వంద్వాలను సహించుటయే తితీక్ష. ఇలా శమ, దమ, ఉపరతి, తితీక్ష, శ్రద్ధా, సమాధానాలనే ఆరింటినీ శమాది షట్సంపత్తి అంటారు

చిన్న పిల్లవాని నోటినుండి ముత్యాల్లా వెలువడిన ఈ తత్వవచనాలు విని స్వామి వారు ఆనంద పరవశులై, సిద్ధుని కౌగిలించుకొనిముద్దాడుతూ తనలో తాను ఇలా ఆలోచిస్తున్నారు - "ఇతడు గతజన్మలో అనంతమైన తపస్సుచేసిన తపోభ్రష్టుడా? లేక జనులను సంసార సాగరాన్నుంచి దరిచేర్చడానికి దిగి వచ్చిన శంకరుడా?" ఇతడు సాక్షాత్తూ శంకరుడేనని నిశ్చయించుకొని, సిద్ధునితో, "బాలకా! నీకు త్వరలో సద్గురువు లభిస్తారు. వారినుండి జ్ఞానాన్ని పొంది జగద్గురువై సర్వజనులలో జ్ఞానజ్యోతిని వెలిగించు! నీ కీర్తి నలుదిక్కులా వ్యాపించుగాక!" అని ఆశీర్వదించి పంపారు.

అక్కడనుండి సిద్ధుడు రాయచోటి, నవనంది మొదలైన క్షేత్రాలు దర్శిస్తూ, చివరకు సురపురమనే ఊరికి చేరారు. అక్కడ శివాలయంలో కొందరు సాధువులు కనిపించగా వారిని, "పరమార్థానికి దారిచూపే సద్గురువులు ఇక్కడ ఎవరైనా వున్నారా?" అని అడిగారు. వారు అక్కడకు సమీపంలో గుడగుంటి అనే పట్టణంలో ప్రఖ్యాతిగాంచిన శ్రీగజదండ మహాస్వామి వారున్నారని చెప్పారు. అది వినిసిద్ధుడు నిద్రాహారాలుమాని, ఏకాగ్రమైన మనస్సుతో గురుస్మరణ గావిస్తూ, మూడురోజులు ప్రయాణం చేసి చివరకు గుడగుంటికి చేరుకొన్నాడు.

సిద్ధుడు ఊరివెలుపల వున్న మల్లికార్జున దేవాలయంలో దర్శనం చేసుకొని, మఠానికి వచ్చాడు. అక్కడ నక్షత్రాల మధ్య నిండు చంద్రునిలా వెలిగి పోతున్న గజదండ మహాస్వాములవారి దర్శనం చేసుకొన్నాడు. వారి దర్శనంతోనే హృదయం ఆనందంతో నిండిపోగా, "శ్రీ సద్గురు గజదండ మహారాజ్ కీ జై" అంటూ జయజయధ్వానాలు చేస్తూ స్వామివారికి సాష్టాంగదండ ప్రణామం ఆచరించి, "నన్ను కాపాడు తండ్రీ" అంటూ చేతులు జోడించి నిలబడ్డాడు. గజదండ మహాస్వామి సిద్ధుని పరిశీలనగా చూస్తూ, "బాలకా! నీవు ఎవరి పిల్లవాడివి? ఎక్కడనుంచి వచ్చావు? ఇక్కడికి రావడానికి కారణమేమిటి?" అని అడిగారు. సిద్ధుడు "గురుదేవా! నేను బీదరికోట నుంచి వచ్చాను. నా తండ్రి గురు శాంతప్ప. దుఃఖ నివృత్తి పరమానంద ప్రాప్తి కోసమై ఇక్కడకు వచ్చాను. గురువుగారు అతని అర్హతను పరీక్షించాలనే ఉద్దేశ్యంతో, "అయితే, నీవు ఇక్కడే సేవ చేసుకొంటూ వుండు" అని చెప్పి, చాలా రోజులు సిద్ధుని హీనసేవలో నియోగించారు.

సిద్ధుడు మాత్రం రాత్రనక పగలనక సద్గురు సేవలోమునిగి పోయాడు. మఠ ప్రాంగణమంతా కసవు ఊడవడం, పేడ ఎత్తడం, అంట్లు తోమడం వంటి సేవలన్నీ

ఉచ్ఛ నీచ భావం లేకుండా సంతోషంతో చేసేవాడు. ఇలా పన్నెండు సంవత్సరాలపాటు అహోరాత్రాలు గురుసేవలో నిమగ్నమైపోయాడు. గురువుగారు సిద్ధుని సేవా నిరతిని గమనించి, అతడు అర్హుడేనని నిర్ణయించుకొని ఒకరోజు, "ఈ సేవలను విడిచి శాస్త్రాధ్యయనంలో నిమగ్నుడవు కమ్ము" అని ఆజ్ఞాపించారు. గుర్వాజ్ఞ పొందినపిమ్మట సిద్ధుడు శాస్త్రాధ్యయనం చేయసాగాడు. ఒకరోజు సురపురపు ఆస్థాన పండితుడైన సబ్బయ్య శాస్త్రి గజదండ గురువులను అవహేళన చేసే ఉద్దేశ్యంతో వచ్చికూర్చున్నాడు అప్పుడు గురువుగారు శిష్యులకు శాస్త్ర ప్రవచనం చేస్తూవున్నారు. శాస్త్రిగారు, "మీ శిష్యులకు ఏ శాస్త్రం బోధిస్తున్నారండీ?" అని అడిగాడు. "ఉపనిషత్తుల అర్థాన్ని బోధిస్తున్నా" నన్నారు గురువుగారు. అదివిని సుబ్బయ్య శాస్త్రి హేలనగా నవ్వుతూ, "స్వామీ! ఉపనిషత్తులను శ్రవణంచేయడానికి గానీ, బోధించడానిక్కానీ, బ్రాహ్మణులకు తప్ప వేరొకరికి అర్హత లేదు. ఉపనిషత్తు యొక్క మూలశబ్దార్థమే మీకు తెలియదు. తగుదునమ్మా అని శిష్యులకు బోధించడం కూడానా!" అన్నాడు.

శాస్త్రి ఇలా అనీ అనగానే సిద్ధుడు దిగ్గునలేచి గురువు గారి పాదాలకు నమస్కారంచేసి, "తండ్రీ మీరు అనుజ్ఞ ఇస్తే ఇతనికి నేను సమాధానం చెప్తాను" అని విన్నవించుకొన్నాడు. గురువుగారి అనుమతితో సిద్ధుడిలాచెప్పాడు. "శాస్త్రిగారూ, వినండి. నిత్య బ్రహ్మాత్మైక్య బోధక బ్రహ్మవిద్యమే ఉపనిషత్తు యొక్క నిజమైన అర్థమని తెలిసికొనండి". దానికి శాస్త్రి, "దీనికి విద్య అనే అర్థాన్ని ఎందుకు చెప్తున్నావు?" అని అడిగాడు. సిద్ధుడు, "శాస్త్రిగారు! మొదట తాను రాధాపుత్రుడననేది కర్ణునికి దృఢంగా తెలిసిన విషయం. కానీ శ్రీ కృష్ణపరమాత్మ "నీవు రాధేయుడవుకావు, కుంతీపుత్రుడవు" అని చెప్పినప్పుడు కర్ణునికి ముందున్న భ్రమ తొలగి సత్య జ్ఞానోదయమైంది. అలానే ఈ బ్రహ్మ విద్యకూడ శిష్యుని హృదయంలోని అజ్ఞానాన్ని తొలగిస్తుంది. ఉపనిషత్ శబ్దానికి రెండర్థాలున్నాయి. వినండి. మందజిజ్ఞాసువులను దుఃఖంలో పడవేసే జరామరణములను "ఉపనిషాదయతి" అనగా నశింపజేయనది అని ఒక అర్థము. ముముక్షువులను "ఉప" అనగా బ్రహ్మము యొక్క సమీపానికి తీసుకొని వెళ్లునది అని రెండవ అర్థము. మరింత గంభీరమైన మూడవ అర్థమేమంటే దుఃఖానికి కారణభూతమైన అవిద్యను దూరం చేసే సాధనం అని ఉపనిషత్తు అంటే భేదరహిత జ్ఞానమని తెలుసుకో.ఉపనిషత్తుల అర్థము వేదాలను శోధించిన శివయోగికి మాత్రమే తెలుస్తుంది. జగత్తులో ఇంతటి జ్ఞానానికై సాధన చేసే వారు అసంఖ్యాకంగా వున్నారు. ఇవే మీ తెలియకుండా ఏదో తెలిసినట్లుగా మాట్లాడడం మీకు ఉచితంకాదు.

ఇక మీరు బ్రహ్మణులు మాత్రమే బ్రహ్మవిద్యకు అర్హులనీ, తక్కిన వారు కారనీ అన్నారు. సరే! మొదట నీ గోత్రం విచారించి చూస్తే, నీవే బ్రాహ్మణుడవు గావు. వజ్ర సూచి గ్రంథంలోచెప్పబడిన ఆరు ప్రశ్నలను విచారించి చూస్తే, మొదట నీకే బ్రాహ్మణత్వం లేదని తెలిపోతుంది.

బ్రాహ్మణుడు అనేది కనిపించే ఈ శరీరమా? జీవమా? జాతియా? కర్మమా? దానమా? లేక జ్ఞానమా? ఈ ఆరింటిలో దేనిని బ్రాహ్మణుడంటారు? జీవుడిని బ్రాహ్మణుడు అన్నట్టయితే జన్మజన్మాంతంరాలలో చేసిన కర్మల ఫలాన్ని అనుభవించడానికై దేవతల నుండి క్రిమి కీటకాదుల వరకు జన్మలెత్తుతూ అనేక శరీరాలలో అనేక పేర్లతో వ్యవహరించబడే జీవుడు బ్రాహ్మణుడు కాలేడు. ఇక నీవు శరీరాన్ని బ్రాహ్మణుడు అంటావనుకో - అనంతకోటి శరీరాలు పుడుతున్నాయి. ప్రాణం పోయిన తర్వాత ఆ శరీరాలను దహనం చేస్తాం. మరి, శరీరమే బ్రాహ్మణుడైతే , నీకు బ్రహ్మహత్యా దోషం చుట్టుకోదా? పోనీ జాతిని బ్రాహ్మణుడంటావా? విను. మానవ, పశుపక్షులయందు కొందరు ఋషులు నీతివంతులై జన్మించారు. ఊర్వశి గర్భాన వశిష్ఠుడు, కైవర్తకి కడుపున వ్యాసుడు పుట్టలేదా? జంబుకము కడుపున జాంబుక ఋషి, అంబి అనే లేడి గర్భాన శృంగుడు, పుట్టలోనుంచి వాల్మీకి ఋషి, కుంభము నుంచి అగస్త్యముని జన్మించలేదా? జటాజూటమునుంచి కౌశికుడు, దర్భనుంచి బుధుడు, స్తనము నుంచి గౌతముడు జన్మించారు. ఈ విధముగా ఋషులు వేర్వేరు జాతులలో జన్మలెత్తికూడ ఆత్మజ్ఞాన సంపన్నులు కాలేదా? లోకపూజ్యులు కాలేదా?

ఇకమీరు జ్ఞానాన్ని బ్రాహ్మణుడనేటట్లయితే జ్ఞానం అనేది అన్ని ప్రాణులలోను ఒకే విధంగా వుంటుంది. ఇక పారమార్థిక జ్ఞానానికి వస్తే, బ్రాహ్మణులేకాదు, అన్ని వర్ణాలలోను బ్రహ్మజ్ఞానులు ఉన్నారు. కాబట్టి జ్ఞానము కూడా బ్రాహ్మణుడు కాజాలదు. ఇకకర్మని బ్రాహ్మణుడు అనేటట్లయితే ప్రారబ్ధము, సంచితము అనే కర్మలు అందరికీ వుండగా వీరిలో బ్రాహ్మణుడెవరు? మీరు ఒకవేళ షట్కర్మలే బ్రాహ్మణుడనేటట్లయితే మునీశ్వరులు ఆ కర్మలన్నీ విడిచిపెట్టి నిర్మలురైనారు. కర్మను విడచి పెట్టినప్పటికీ వారి బ్రాహ్మణత్వం పోకపోవుట చేతనే వారు ఈ జగత్తులో పరమ పూజ్యులైనారు. పోతే దానాన్ని బట్టి బ్రాహ్మణుడంటావా? లోకంలో ఎందరో క్షత్రియులు, వైశ్యులు వెండి, బంగారు, రత్న మాణిక్యాలుదానంచేసే వారున్నారు వారంతా బ్రాహ్మణులేనా? అటువంటప్పుడు అసలు బ్రాహ్మణుడు అంటే ఎవరు? జాతి రహితుడు, నిర్గుణుడు,

క్రియాతీతుడు. షడూర్మి షడ్భావ రహితుడు మరియు చైతన్య స్వరూపుడునన్న సంపూర్ణ జ్ఞానంతో కూడిన పరమహంసయే బ్రాహ్మణుడు. "బ్రహ్మజ్ఞానాతీతి" అనగా బ్రహ్మాన్ని తెలుసుకొన్నవాడే బ్రాహ్మణుడు అని వేదము. జాతిని కాదని బ్రహ్మజ్ఞానానికే పట్టం కడుతుంటే ఇక నువ్వెంతటబ్రాహ్మణుడవయ్యా" అంటూ సిద్ధుడు పలికిన మాటలకు సుబ్బయ్య శాస్త్రి తలెత్తలేక పోయాడు. సిద్ధుని స్తుతిస్తూ గజదండ గురువులకు నమస్కరించి అక్కడినుంచి లేచి వెళ్లిపోయాడు.

సుబ్బయ్య శాస్త్రితో చేసిన ఈ తర్కవాదానికి ఆశ్చర్యపరవశులైన గురువుగారు, సిద్ధుని తనప్రక్కన కూర్చుండబెట్టుకొని, అతని శిరస్సున తమ అభయ హస్తముంచి ఆశీర్వదించారు. ఈ చర్చతో సిద్ధుడు బ్రహ్మజ్ఞానానికి అర్హుడని గ్రహించి తారకమంత్రోపదేశము చేసి, "నీవు నరుడవుగావు - ఆ పరబ్రహ్మమే నీవు" అని తెలిపారు. సిద్ధుడు ఆనందాశ్రువులతో సద్గురుపాదకమలములను ప్రోక్షించి నమస్కరించాడు. వినమ్రుడై నించుని ఇలా అడిగాడు. "గురుదేవా! శాస్త్రాల మర్మం ఫలించినట్లు గుర్తు ఏమిటి?" దానికి గురువుగారు "సంశయము, అసంభావన మొదలైన విపరీతభావాలు అణగి పరమాత్మయే నేనన్న భావం దృఢంగా నిలవడమే శాస్త్రంద్వారా జ్ఞానం ఫలించిందనడానికి గుర్తు" అన్నారు. మళ్లీ సిద్ధుడు "తండ్రీ! జీవుడు బ్రహ్మమునందు ఎలాఐక్యమౌతాడు?" అని అడిగాడు. గురువుగారు, "బిడ్డా! కుండలోపల మొదటనే వున్నఆకాశము కుండను పగులగొట్టడంతోనే బయటవున్న పూర్ణాకాశంతో ఎలా ఐక్యమౌతుందో అలానే జీవుడు పరబ్రహ్మమునందు ఐక్యమౌతాడు" అన్నారు. ఈ విధంగా సిద్ధుడు జీవబ్రహ్మైక్యాన్ని గూర్చి గురువుగారితో సవివరంగా చర్చించాడు.

అప్పటికి సిద్ధుని వయస్సు షుమారు ఇరవైసంవత్సరములు వుంటుంది. ఆ వయస్సుకు మీరిన విద్వత్తు, విద్వత్తుకు మీరిన అనుభవము గురువుగారిని కూడ ఆశ్చర్య చకితులను చేసింది. నిజానికి సిద్ధుడు గురువు వద్ద విద్యనభ్యసించిందిలేదు. జన్మతఃజ్ఞానసంపన్నుడాయన. అవతారమూర్తులైనప్పటికీ శ్రీ రాముడువశిష్ఠులవారినీ, శ్రీ కృష్ణుడు సాందీపనీ మహర్షినీ సేవించి, లోకానికి గురువును సేవించడమనే ఆదర్శాన్ని చూపించారు. అలాగే సిద్ధుడు పూర్ణజ్ఞాన స్వరూపుడై యుండికూడ గజదండ గురువులను ఆశ్రయించాడు.

చర్చానంతరం సిద్ధుడు గురువుగారితో, "గురువర్యా! బాల్యంలోని రూపం యౌవనం రావడంతో నశిస్తుంది. అలానే యౌవనంలోని రూపాన్ని నశింపజేస్తుంది వార్ధక్యం. పూర్వపు రూపాన్ని ఉత్తరరూపం ఎలా నశింపజేస్తుందో అలానే

స్వస్వరూపజ్ఞానమనేది పూర్వరూపమైన కర్మరూపలింగధారణను నశింపజేస్తుంది. అందువలన గురుదేవా! మీరిచ్చిన పూర్వలింగాన్ని మీరే తీసుకొనవలసినది" అంటూ తన మెడలోని లింగాన్ని తెంపి గురువుగారి పాదములవద్ద వుంచాడు. గురువుగారు "సిద్ధా! లింగాన్ని త్యజించడం ధర్మవిరుద్ధం. లింగాన్ని విడువవద్దు" అన్నారు. దానికి సిద్ధుడు "గురుదేవా! పరమ చిత్స్వరూపాన్ని నేననే జ్ఞానంవాలో దృఢంగా నాటుకొన్నాక, ఈ లింగంతో పనియేమి? జ్ఞానికి జాతి, మత, కుల, గోత్రాదులు లేవు. ఐతరీయోపనిషత్తులో భాష్యకారుడు జ్ఞానికి కర్మలను ఖండించియున్నాడు. బ్రహ్మజ్ఞానము పొందిన పిమ్మట చేసే కర్మ వంధ్యాసతి భోగమువలె ఫలకారికాదు. కావున నిరంతర ఆత్మభావంలో వుండే బ్రహ్మజ్ఞానికి కర్మతో పనిలేదు" అని వివరించాడు.

సిద్ధుని ఈ తత్వగర్భిత వాక్యాలువిని గురువుగారు ఆశ్చర్యచకితులై "ఇతడు సరస్వతీ అంశతో అవతరించినవాడు. మూలబ్రహ్మమునందు ఈతని వృత్తి మొదటినుంచీ ఆరూఢమైయున్నందున ఈతనికి 'ఆరూఢ' నామమే సరియైన నామము. విద్యాభ్యాసం చేయకనే వేదవేదాంగాలన్నీ ఎరిగిన విద్యామూర్తి యగుటచేత 'భారతి' అనే పేరు కూడ ఇతనికి తగినది" అని తలచి సిద్ధునికి మంగళస్నానము గావించి, శాస్త్రోక్త విధిపూర్వకముగా అవధూతాశ్రమాన్నిచ్చి "సిద్ధారూఢ భారతి" అనే ఆశ్రమ నామాన్ని ప్రసాదించారు. "ఈ నామము నీకు జగత్తునందు యోగ్యమైన నామమగుగాక! నీవు పరమపావన దివ్యమూర్తివై ప్రకాశింతువుగాక! ఈ కలియుగమునందు అధర్మము పెచ్చుపెరిగి జనులు భక్తి, ధర్మాలను మరచి ఇచ్చవచ్చినట్లు సంచరిస్తున్నారు. నీవు మొదట ఈ భూమిమీద పుణ్యక్షేత్రాలలో సంచరిస్తూ ప్రజలలో భక్తిభావం కలిగిస్తూ, అధికారులైన వారికి తత్వబోధ గావిస్తూ లోకాన్ని ఉద్ధరించు! ప్రారబ్ధరూపమైన సుఖదుఃఖాలను సమభావంతో స్వీకరిస్తూ పరమయోగివై జీవించు" అని ఆశీర్వదించారు.

సిద్ధులు ఆనందాశ్రువులతో గురువును కొనియాడుతూ గజదండగురువులకు ప్రదక్షిణము గావించి, వారి పాదాలకు సాష్టాంగ నమస్కారము చేసి గుర్వాజ్ఞను శిరసావహిస్తూ అక్కడనుండి దేశసంచారానికి బయలుదేరారు.

✪ ☆ ✪ ☆ ✪

# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 3

శ్రీ సిద్ధారూఢభారతి మఠము నుంచి బయలుదేరి, దేశ, కోశ, క్షేత్రాలలో సంచరిస్తూ ఎక్కడెక్కడ ఋషిపుంగవులున్నారో అక్కడక్కడి కల్లా వెళ్ళి వారి దర్శనము చేసుకుంటూ, జిజ్ఞాసువులు కన్పిస్తే చర్చలు జరుపుతూ కిష్కింధ అనే పాత హంపీ పట్టణాన్ని చేరుకొన్నారు. అక్కడి విరూపాక్షలింగమును దర్శించి, హేమకూట పర్వతము మీద నాగలింగ గుహలో మూడు నెలలు సవికల్ప సమాధిని సప్తాంగ సహితమూ సాధించి, చివరకు నిర్వికల్ప సమాధిని పొందిన ఒక యోగీశ్వరుని దర్శనం చేసుకొని, వశిష్ఠాశ్రమానికి చేరారు. అక్కడ మూడు రోజులు అఖండ బ్రహ్మానందంలో వుండి, అక్కడి నుండి గంధమాధవ పర్వతం మీది మాతంగాశ్రమానికి వచ్చారు. అక్కడస్ఫటిక శిలలతో ప్రకాశిస్తున్న ఆ భూమి తపోభూమియేనా అని పరీక్షించదలచి, పందొమ్మిది రోజులు అన్నపానాలు లేకుండా ఉపవాసం చేశారు. అయినప్పటికీ ఆకలి దప్పుల బాధ కొంచెం కూడ లేక, మనస్సులో విపరీత భావాలు గానీ, యోగానికి విఘ్నాలైన విక్షేపాదులు గానీ కలుగక అఖండ బ్రహ్మాకార వృత్తి సహజమై నిలిచింది. అప్పుడది తపో భూమియేనని నిర్ధారణ చేసుకొన్నారు. అక్కడి నుండి పంపా సరోవరానికి వెళ్ళి, అక్కడ స్నానంచేసి, రాముని దర్శించి, చక్రతీర్థం చుట్టు తిరిగి, వాలీభండారాన్ని చూచి, అటునుండి ఆనెగొంది పట్టణాన్ని చేరారు.

ఆ పట్టణంలో అతి వైభవంగా పూజలు జరుగుతున్న ఈశ్వర దేవాలయాన్ని చూచి, సంతోషంతో లోపలకు వెళ్ళబోయారు. పూజారి సిద్ధులను అడ్డగించి, "ఎవరు నువ్వు? అంత్యజుడివా? ముసల్మానువా? చెప్పాపెట్టకుండా గుడిలోపలికి వెళ్ళి పోతున్నావే! హీనుడా! నడుబయటకు!" అని గద్దించాడు.

దానికి సిద్ధభారతి "ఓ పూజారీ! హీనమైనది ఈ స్థూలశరీరమా, సూక్ష్మశరీరమా, లేక కారణశరీరమా? లేక ఆత్మా? దేనిని నీవు హీనమంటున్నావు? నీవు ప్రథమ పక్షానికి ఒప్పుకొనేటట్లయితే అందరి స్థూల శరీరాలూ హీనస్థానము నుంచే జనించాయి. అందరూ హీనమైన చనుబాలు, అన్నసారాలతోనే పెరుగుతారు. ఇక నీవు రెండవ

పక్షానికి ఒప్పుకొనేటట్లయితే లింగ తనువు భంగమై అనంత శరీరాలనూ హీనకరమైన అమంగళ స్వప్నాలనూ అందరిశరీరాలు కల్పిస్తూవుంటాయి. ఇందులో హీనులెవరు? శ్రేష్ఠులెవరు? ఇక కారణ శరీరాన్ని నీవు హీనమంటే, అది సరికాదు. నిద్రలోని సుఖము సర్వులకూ ఒకే విధంగా వుంటుంది. ఇదిగాక నీవు ఆత్మకు హీన శ్రేష్ఠతలు అంటగట్టేట్లయితే అందరిలోని ఆత్మ మూడుకాలాలలోను, మూడు అవస్థలలోనూ సాక్షిగా చైతన్యరూపంగా వుంటుంది. అటువంటప్పుడు హీనులెవరు? శ్రేష్ఠులెవరు? చెప్పు. కులాభిమానంతో, మాత్సర్యంతో అందరను నిందిస్తూమేమే శ్రేష్ఠులమనుకొనే వారెంతటి శ్రేష్ఠులు? సర్వులయందు సమభావంతో వుండే బ్రహ్మజ్ఞానియే అసలైన బ్రాహ్మణుడు. ఇతరులను నిందించే వారే అంత్యజులు" అని చెప్పారు.

అదివిన్న పూజారి సిద్ధులు సామాన్యులు కారని గ్రహించి పరుగెత్తుకుంటూ వెళ్ళి గుడిలో జరిగిందంతా రాజుగారికి విన్నవించాడు. వెంటనేరాజుగారు సకల రాజమర్యాదలతో సిద్ధులను అంతఃపురానికి తీసుకువెళ్ళి, సకలోపచారాలూ కావించి, అక్కడి నుండి చింతామణి ఆశ్రమంలో జరిగే సకల మతచర్చకు సిద్ధులను తీసుకొని వెళ్లారు.

చింతామణి ఆశ్రమస్వాములవారు వాదనకు వచ్చిన షణ్మతవాదులను పిలిచి వారివారి అభిప్రాయాలను తెల్పమన్నారు. చార్వాక పండితుడు శరీరమే ఆత్మయనీ, శరీరాన్ని సుఖపెట్టడమే పరమ పురుషార్థమనీ చెప్పాడు. నైయాయిక మతవాది ఇంద్రియాలే ఆత్మయనీ, ఇంకొకడు మనస్సే ఆత్మయనీ, వేరొకడు బుద్ధియే ఆత్మయనీ వాదించారు. ఇదివిని వార్తికకారభట్టు అనే వాడు ఆత్మ జడ - చేతనములతో వుండేదని ప్రతిపాదించాడు. పిమ్మట శూన్యవాది లేచి శూన్యమే ఆత్మయని చెప్పాడు. దాని మీదట నైయాయికులలో ప్రభాకరుడనే వాడు లేచి శూన్యము ఆత్మ కాదనీ, ఆత్మ గుణమయము, ఆనందమయమూ అని వాదించాడు.

సిద్ధ భారతి అందరి వాదనలను విని రాజుగారితో, "రాజా! గ్రుడ్డివారు ఏనుగు స్తంభమువలె వున్నదని ఒకరూ, చేట వలె వున్నదని ఒకరూ - ఇట్లా వర్ణించినట్లున్నవి వీరి వాదనలు. ఆత్మ నిత్యమూ తమలోనే వ్యాపించి యున్నప్పటికీ, దానిని గుర్తించక అన్నమయ పంచకోశాలలో ఒక్కొక్కదానిని ఒక్కొక్కరు ఆత్మ అంటున్నారు" అని

వారి వాదనను ఖండించి, అసలైన ఆత్మ స్వరూపాన్ని వివరించారు. పిమ్మట ఆరాజు సిద్ధులను తమ అంతఃపురానికి తీసుకొని వెళ్లి, షోడశోపచార పూజచేసి, సాష్టాంగపడి "పరమ గురుదేవా! నేను ఎవరు అనే దానిని బోధించి నన్ను కృతార్థుడను చేయవలసినదని" ప్రార్థించాడు. సిద్ధులు ఆ రాజు యొక్క తీవ్ర ముముక్షుత్వానికి ప్రసన్నులై వేదశ్రుతి ఆధారాలతో జ్ఞానబోధ గావించారు. తాను బోధించిన విషయాలన్నీ రాజుకు బాగా మననమయ్యేవరకూ కొన్ని రోజులు అక్కడనే వుండి, అతనిని ఆశీర్వదించి, పిమ్మట చింతామణి ఆశ్రమానికి వచ్చారు.

చింతామణి ఆశ్రమంలో బ్రహ్మానందుడనే శిష్యుని విద్యాగర్వాన్ని రసాయన శాస్త్ర వాక్యాలతో భంగపరచి, శ్రీ శైలానికి వెళ్తున్న కొందరు భక్తుల ప్రార్థనపై వారితో కలిసి బయలుదేరారు. నాగలూటి, భీమ సరోవరం మీదుగా కైలాస మహాద్వారము గుండా శ్రీ శైల మల్లికార్జునస్వామి ఆలయాన్ని చేరారు. మల్లికార్జునుని దర్శనము చేసుకొని అక్కడున్న ఒక మంటపంలో విడిదిచేశారు. అక్కడకొందరు జంగములు డాంభికంగా మడి, మడి అంటూ వంటలు చేస్తూండటం గమనించి, వారి అహంకారాన్ని అణచాలనే ఉద్దేశ్యంతో వాళ్లు వంటచేస్తున్న చోటికి వెళ్ళినిలుచున్నారు. "లింగము లేనిహీనుడా! నిన్ను మేము కంటితో కూడ చూడకూడదు." అని నానా దుర్భాషలాడి, బయటకు గెంట బోయారు. సిద్ధులు వారితో, "నాకు జ్ఞానరూపమైన ఆత్మ లింగముండగా నేను హీనుడనెట్లా అవుతాను? మీ మెడలోని లింగమే మీకు కర్మాన్ని కల్గించడానికి కారణమైంది. నిజలింగాంగ సమరసము తెలియక బావిలో కప్పలవలె వున్న మీరెంతటి జంగములు?" అని వెళ్లిపోయారు.

కొంతసేపటికి జంగములందరూ స్నానాలు చేసి, మడితో లింగార్చనకు కుర్చున్నారు. "శివా శివా" అంటూ తమ పైవస్త్రము ఎత్తి లింగముల కోసంచేయి చాపగా అక్కడ లింగాలులేవు. అప్పుడు వారంతా తమ తప్పు తెలుసుకొని, అంతటి మహాత్ముని దూషించినందుకు పశ్చాత్తాప పడుతూ, సిద్ధుల కోసం అరణ్యమంతా వెదకసాగారు. చివరకు నవగ్రహమఠం వద్ద ఒక పెద్దపులి మీద ఎక్కి కూర్చుని వున్న సిద్ధులను చూచి, భయపడి తమను కరుణించమని వేడుకొన్నారు. వారు పశ్చాత్తప్తులై వచ్చారని తెలుసుకొన్న తర్వాత సిద్ధులు వారి వద్దకు వచ్చి "శివ పంచాక్షరీ మంత్రాన్ని ఉచ్ఛరించండి. మీ లింగాలు మీకు లభిస్తాయి" అన్నారు. "శివ పంచాక్షరీ మంత్రాన్ని

వెలుపలికి బహిరంగముగా ఉచ్ఛరింపరాదు" అన్నారు జంగములు. అదివిన్న సిద్ధభారతి, "శివ మంత్రాన్ని నోటితో పలికితే ఆ పలికేవాళ్ళు చెడిపోతారా? లేక మంత్రము చెడి పోతుందా? లేక వినేవాళ్ళు చెడిపోతారా? దేహాన్ని ధరించి వచ్చిన సర్వజీవకోటికీ సాయుజ్యాన్నిచ్చే మంత్రాలలో పంచాక్షరి శ్రేష్ఠమైనది. ఈ మంత్రాన్ని ఎవరైనాసరే ఏ కులమువారైనా, ఏ మతమువారైనాసరే ఒక్కసారి ఉచ్ఛరిస్తే నిప్పును తెలిసిముట్టుకొన్నా, తెలియక ముట్టుకున్నా కాలునట్లే జన్మజన్మాంతరాల్లోని పాపాలన్నీ నశిస్తాయని శృతి వాక్యము. వశిష్ట, వామదేవ, గౌతమ, నారద, సనక, శ్వేత, జనకాది మునీశ్వరులూ, ఋషులూ ఈ శివ మంత్రాన్ని జపించి కల్మషాలు పోగొట్టుకొని, శరీరం నుంచి విడివడి ఘనతర స్థితిని పొంది ప్రఖ్యాతులైనారు. ఆదిలో హరి, విధి, సూర్య, చంద్ర, దేవేంద్రాది దేవతలందరూ శివ పంచాక్షరీ మంత్రము చేతనే జగత్ సృష్టి కార్యాలను తెలుసుకొని చేయగలిగారని కూడ శృతి వ్యాక్యం చెప్తున్నది.

పూర్వము సానందుడు శివ పంచాక్షరీ మంత్రాన్ని ఉచ్ఛరించటంతోనే నరక వాసులను ముక్తులను కావించాడు. శ్వేతుడనే వాడు శతకోటి పాపాలు చేసికూడ ప్రాణాలు విడిచి పెట్టేటప్పుడు శివనామము ఉచ్ఛరించటం వలన శివుడు అతనికి గణపదాన్నిచ్చాడు.

కాబట్టి మంత్రమూ చెడిపోదు. వినేవారు చెడిపోరు. పైకి ఉచ్ఛరింపరాదని చెప్పేవారే మంత్రద్రోహము చేసినవారౌతారు. మంత్ర ద్రోహ ఫలాన్ని అనుభవించవలసి వుంటుంది. తెలుసునా? లింగాయతులైన మీరు లింగ, మంత్ర, ఆగమాలను నమ్ముతారు. బ్రాహ్మణులు గాయత్రీ మంత్రాన్ని ,వేదాలనూ నమ్ముతారు. ఇక తక్కిన వారికి అవి అవసరములేదా? మంత్ర, శాస్త్ర, దేవతా కృప వారికి అక్కర్లేదా? జగదీశ్వరుడు కరుణతో వారిని పట్టించుకోలేదా? విచారిస్తే, మీరే ఈ జగత్తునంతా చెడగొట్టారు. మీరు పరబ్రహ్మను, పరమ శివునీ తెలుసుకోకనే ఇతరులను శూద్రులనీ, హీన సన్యాసులనీ నిందిస్తున్నారు. అసలైన జంగముడు బ్రాహ్మణుడు మొదలుకొని చండాలుని వరకూ అందరి ఎడలా సమభావంతో ఉంటాడు. లింగసమరసాన్ని తెలుసుకొన్న లింగాత్ముడే జంగముడు" అని బోధించారు.

జంగములు శివ పంచాక్షరీ మంత్రాన్ని ఉచ్ఛరింపగానే, వాళ్ళ లింగాలన్నీ వాటంతటవే దోసిళ్ళలోకి వచ్చి చేరాయి. వారంతా సిద్ధులను స్తుతిస్తూ, దేవాలయానికి తీసుకువచ్చి, పూజించి నమస్కరించారు.

పిమ్మట సిద్ధభారతి తిరుపతికి వచ్చి, అక్కడ శ్రీ వేంకటేశ్వరుని దర్శించి అక్కడ నుండి కాళహస్తికి చేరారు. అక్కడి శివలింగాన్ని దర్శించి అక్కడనుంచి ముందుకు సాగి శివకంచి, విష్ణుకంచి దర్శించి, అక్కడి నుండి శ్రీ వరదరాజ దర్శనానికి వెళ్లే దారిలో ఒక బ్రాహ్మణుడు సిద్ధులను చూచి మహాత్ముడని గ్రహించి తన ఇంటికి తీసుకు వెళ్ళి షోడశోపచార పూజగావించి, వినయముతో సాధుసేవ వలన కల్గుఫలమేమిటి? అని ప్రశ్నించాడు. సిద్ధులు అ బ్రాహ్మణునకు తన నిజస్వరూపమేమిటో బోధించారు. మునివర్యుల దర్శన పూజాదుల వలన ఆత్మసాక్షాత్కారమే ఫలమని ఆ విప్రుడు గ్రహించి కృతజ్ఞతతో మళ్ళీ నమస్కరించాడు.

అక్కడనుండి తొమ్మిది నెలలపాటు సంచరిస్తూ చిదంబర క్షేత్రానికి చేరారు సిద్ధులు. అక్కడ నటననభాపతిని దర్శించి, ముందుకు సాగి దేశకోశాలలో తిరుగాడుతూ ప్రజలకు పంచాక్షరీ మంత్ర మహాత్మ్యాన్ని వివరిస్తూ ముముక్షువులకు జ్ఞానబోధగావిస్తూ, శూన్య చార్వాకాది మతాలను ఖండిస్తూ కుంభకోణం చేరుకున్నారు. అక్కడ కుంభేశ్వరుని దర్శనం చేసుకొని అక్కడనుంచి తంజావూరులోని లింగాన్ని దర్శించి, ముందుకుసాగి శ్రీరంగపట్టణం చేరుకొన్నారు. అక్కడ వున్న వామాచారుల దుర్మార్గాలను ఖండించి, తత్వమసి మహావాక్యాన్ని బోధించి, ఏడునెలల పాటు అక్కడ వుండి శిష్యులకు బ్రహ్మజ్ఞానాన్ని దృఢపరచి, అక్కడి నుండి శ్రీరంగ పట్టణంలో శ్రీ రంగనాధుని దర్శించి, జంబుకేశ్వరము, పక్షితీర్థము దర్శించి అటునుంచి మధురకు వచ్చారు.

అక్కడ మీనాక్షిదేవిని దర్శించడానికై గుడి లోపలకు వెళ్ళారు. సిద్ధులను చూచి ఒక పూజారి పరుగెత్తుకుంటూ వచ్చి "ఎవరయ్యా నువ్వు? భ్రష్ట సన్యాసివా? కాముకునివలె కన్పిస్తున్నావు. నీవు గుడి లోపలకు అడుగు పెట్టడానికి వీల్లేదు" అని అడ్డగించాడు. "ఇంతటి కోపము నీలో నెలకొని వున్నది కాబట్టి నీవే భ్రష్టసన్యాసివి. చండాలుడవు. లోపలకు వెళ్ళడానికి డబ్బులు ఆశించే నీవే కాముకుడవు" అన్నారు సిద్ధులు. సిద్ధుల వద్ద ఏమీ లభించదని గ్రహించిన ఆ అర్చకుడు, "నీ వాదం చాలు, నోరు మూసుకొని బయటకు నడువు" అని వెళ్ళిపోయాడు. సిద్ధ భారతి "నీవు తిండికోసమై సన్మార్గాన్ని విడిచిపెట్టి భ్రష్టుడవైనావు. మొదట దానికి ప్రాయశ్చిత్తము చేసుకో" అని చెప్పి గుడిలోపలకు ప్రవేశించారు. అక్కడ మీనాక్షిదేవిని

దర్శించి, తర్వాత పట్టణంలోనికి వెళ్ళి భిక్షాటనం చేసుకొని, నదీతీరాన ఏకాంత స్థానంలో భిక్షాన్నాన్ని భుజించి, పడుకొని వున్నారు. గుడిలో సిద్ధులతో జగడం వేసుకొన్న ఆ అర్చకుడు సిద్ధులను వెతుక్కుంటూ వచ్చి తన అపరాధానికి క్షమాపణ వేడుకొని, తన ఇంటికి భోజనానికి రావలసిందని ప్రార్థించాడు. సిద్ధులు, "నన్ను ఇంటికి తీసుకువెళ్ళి భోజనం పెట్టిన దాని కంటే, ఆ అన్నాన్ని ఇక్కడికే తీసుకువచ్చి పెడితే శతాధిక ఫలం లభిస్తుంది." అనడంతో, ఆ పూజారి అట్లనే చేసి సిద్ధులకృపకు పాత్రుడయ్యాడు.

సిద్ధులు మధురనుంచి బయలుదేరి రామనాథపురంలో మహాత్ముల దర్శనం చేసుకొని నవపాషాణ, హరబలాఖాత మొదలైన క్షేత్రాలు సందర్శించి, రామేశ్వరం దర్శించి, అక్కడ నుండి రామఝురికకు వెళ్ళారు. అక్కడ ప్రాణాయామమభ్యసిస్తున్న ఒక యోగినిచూచారు. పూర్వం తాము కృష్ణాతీరంలో శాసనకట్ట గుహలో ప్రాణాయామం అభ్యసించడం గుర్తుకు వచ్చింది. ఆ యోగిని కొన్ని యోగప్రశ్నలు వేసి, అతని ప్రార్థనపై అతనికి రాజ, హఠ, లయ, మంత్రయోగాలను సాకల్యంగా వివరించి, జ్ఞానయోగ శ్రేష్ఠతను వివరించి బ్రహ్మాత్మైక్యాన్ని బోధించగా, ఆ యోగి తన మనస్సును జ్ఞానములో స్థిరపరచుకున్నాడు.

సిద్ధభారతి అక్కడినుండి ముందుకు సాగి ధనుష్కోటికి చేరారు. అక్కడ స్నానం చేస్తున్న ఒక యాత్రికుని పిలిచి "నీవు స్నానం ఎందుకు చేస్తున్నావు?" అని అడిగారు. దానికతడు "ఈ శరీరం అశుద్ధమైనది. ఇది పరిశుద్ధం కావడానికై స్నానం చేస్తున్నాను" అన్నాడు. "శరీరం అశుద్ధమని ఎట్లా తెలుసుకొన్నావు?" అని అడిగితే "జాత కర్మల ఆధారంగా" అన్నాడతను. అతని మాటలు విన్న సిద్ధులతడొక మూర్ఖుడని తలచి, అక్కడి నుండి బయలుదేరి దర్భశయన క్షేత్రాన్ని దర్శించి పిమ్మట తిరునల్వేలి పట్టణానికి వచ్చారు.

అక్కడ ధ్యానం చేస్తున్న ఒక ఉపాసకుని చూచి "నీ ఉపాసన జ్ఞాతమా? అజ్ఞాతమా? జ్ఞాతమైతే దానియందు ద్వైతముండక బ్రహ్మమే తానైఉంటాడు కాబట్టి అక్కడ ధ్యేయంలేదు. అందువలన ధ్యానానికి అవకాశం లేదు. లేక అజ్ఞాతమని చెప్పేటట్లయితే ధ్యాతయొక్క స్థితి తెలియక, ధ్యేయమును ఎరుగక ధ్యానం ఎట్లా సంభవిస్తుంది?" అని ప్రశ్నించారు. అతడు "అపరోక్షజ్ఞానానికి భిన్నమైన శాస్త్రాపరోక్షం

చేత నేను ధ్యానం చేస్తున్నాను. దానికి దృఢమైన శ్రద్ధ, విశ్వాసాలే ఆధారం. ఎందుకంటే శాస్త్రజ్ఞులు శ్రద్ధాహీనులు కావడంవలన దేవతా ధ్యానంలో ప్రవర్తింపరు. కాబట్టి ఉపాసకులకు శ్రద్ధయే ముఖ్యం" అన్నాడు. అదివిన్న సిద్ధులు అతడు సంప్రదాయకుడని తలచి, అక్కడ నుంచి ముందుకు సాగారు. తోతాద్రిలో విష్ణుమూర్తిని దర్శించి, అక్కడ నుండి తిరుకరాయకోటలో వున్న లంబనారాయణుని దర్శనం చేసుకొని, అక్కడనే విశ్రాంతి తీసుకొన్నారు.

అక్కడ నారాయణుని దర్శనానికి వచ్చిన బ్రాహ్మణులలో ఒకడు సిద్ధులను, "మీరు నిత్యకర్మలను ఏ కారణం వలన త్యజించారు?" అనిఅడిగాడు. "మోక్షము కర్మవలన కలుగదు కాబట్టి ముముక్షదశలోనే కర్మము తిరస్కరింపబడగా, యిక బ్రహ్మజ్ఞానికి నిత్యకర్మతో పనిలేద"ని సిద్ధులు చెప్పారు. వేరొక బ్రాహ్మణుడు, "ముముక్షుత్వము ధర్మమా లేక గుణమా?" అని అడుగగా సిద్ధులు, "అవి రెండూ కాదు. ముముక్షుత్వము అభ్యాసం వలన కలుగుతుంది" అని బోధించారు.

సిద్ధుల గురించి విని నగరంలోని పండితులంతా వచ్చి చేరారు. వారిలో ఒక పూజారి, "ఈ జగత్తు దేని వలన ప్రకాశమౌతున్నది" అని అడిగాడు. దానికి సిద్ధులు "జగత్తు పగలు సూర్యుని వలన, రాత్రి చంద్రుని వలన ప్రకాశిస్తుంది. వీటన్నింటినీ కన్ను ప్రకాశింపజేస్తుంది. కన్నులు మూసుకొంటే బుద్ధి ప్రకాశింప జేస్తుంది సమాధి, సుషుప్తి స్థితులలో అహంకారము లయముకాగా చిదాభాసుడు ఆత్మలో ఐక్యమౌతాడు. అప్పుడు లోపల, బయట అనే కల్పన ఏదిలేని స్వయంజ్యోతి పరవస్తువు అన్నింటినీ ప్రకాశింపజేస్తుంది. ఆ చిదాత్మయే నీవు" అని బోధించారు.

తర్వాత చిదంబర దీక్షితులనే వానికి "తత్త్వమసి" మహావాక్యము స్తుతి పరముగానీ, ఉపాసనాపరముగానీ కాదనీ, అది కేవలము జ్ఞానపరమేననీ, జ్ఞానము లేనిదే అవిద్య నశింపదనీ వివరించారు.

అంతలో తిరకంభట్టు అనే నైయాయికుడు ముందుకు వచ్చి, "స్వామీ! ఆత్మ ఏ లక్షణముల చేత లక్షింపబడుతుంది?" అని ప్రశ్నించగా, ఆత్మయొక్క లక్షణాలన్నీటినీ వివరంగా బోధించి అతని సంశయ నివృత్తి గావించారు.

వారిలో ఒక విప్రుడు దేవునికని తీసుకొచ్చిన నైవేద్యాన్ని సిద్ధయోగికి సమర్పించటమే శ్రేష్ఠమని తలచి, వారికి సమర్పించాడు. సిద్ధులు దానిని భుజించి,

విశ్రాంతి తీసుకుంటూండగా గోవిందభట్టు అనే విప్రుడు వచ్చి "స్వామీ! మీ బ్రహ్మజ్ఞానము మీ కించిత్ క్షుద్బాధనే పోగొట్టలేక పోతే, అది జన్మాది దుఃఖాన్ని ఎట్లా నశింప జేస్తుంది? ఇటువంటి బ్రహ్మజ్ఞానాన్ని నమ్మడం వలన ప్రయోజనమేమిటి?" అని అడిగాడు. దానికి సిద్ధులు, ఆత్మను గురించి అంటున్నావా? లేక దేహం గురించి అంటున్నావా? ఆత్మ శుద్ధుడు, షడూర్మి రహితుడు, దేహత్రయాతీతుడు, కేవల సాక్షి మాత్రుడు కాబట్టి ఆత్మకు క్షుద్బాధ లుండజాలవు. ఇక దేహము ప్రారబ్ధ వశమున వున్నది. ఆత్మకు దీనితో సంబంధము లేదు. ఆకలి దప్పులు, నిద్ర మెలకువ, సుఖ దుఃఖాలు దేహానికే. జ్ఞాని  ప్రారబ్ధవశాన కలిగే సుఖదుఃఖాలలో ఎప్పుడూ చిక్కుకోడు. నీటిలోని పద్మం వలె జ్ఞాని నిర్లిప్తుడు" అని బోధించారు.

ఈ విధంగా సిద్ధులు తమ జ్ఞానచాతుర్యంతో సర్వమత వాదులనూ వశ పరచుకొన్నారు. వారు కొద్ది రోజుల వరకూ సిద్ధులను తమ వద్దనే వుంచుకొని, వారి వద్ద శాస్త్ర శ్రవణం గావించి, గురు కృపకు పాత్రులయ్యారు.

తర్వాత ఆరూఢులు గుజ్జమ్మ అనే ఒక విరక్తురాలైన భక్తురాలికి విధి ప్రకారముగా పంచాక్షరీ మంత్రముపదేశించి, మానస పూజావిధానమంతా బోధించి ముందుకు సాగారు.

సిద్ధులు కొండలు, అరణ్యాలు, పట్టణాలలో సంచరిస్తూ ఛోటానారాయణుని దర్శనం చేసుకొని, తస్కరమస్కరస్థానాల ద్వారా తిరువటారులో శ్రీకృష్ణమూర్తిని దర్శించి, తిరువన్మూరులో అనంతశాయి దర్శనం చేసుకొని, అక్కడ భోజనానికి కూర్చున్న బ్రాహ్మణుల పంక్తిలో తాముకూడా కూర్చున్నారు. బ్రాహ్మణులది చూచి కోపంతో "నీవు శూద్రుడవై యుండి పంక్తిలో వచ్చి కూర్చుంటావా?" అని వెళ్ళగొట్టబోయారు. సిద్ధుడు వారితో, "విప్రలక్షణాలు శుద్ధ విప్రులకు తప్ప బుద్ధి శూన్య శూద్రులైన మీకు తెలియవు" అన్నారు. దానితో కోపించి, "నీవు శుద్ధ విప్రుడవైతే సూత్ర, శిఖాదులు నిన్ను విడిచి పెట్టి పారిపోయాయా?" అని హేళన చేశారు. దానికి సిద్ధులు, "అశిఖా, అయజ్ఞోపవీతఃయాదృచ్ఛికోభవేత్" అనే శృతి ప్రమాణాన్ని మీరు మర్చిపోయి వుంటారు - అన్నారు. "అయితే నీకు యతి చిహ్నాలైన దండ కమండలాదులైనా లేవే?" అని ప్రశ్నించారు. దానికి సిద్ధులు "అవి ఇతరులను మోసం చేయడానికి పనికి వచ్చే డాంభిక చిహ్నాలు. అవి విడచి నేను నిజ చిహ్నాలు ధరించాను.

అవి ఏవంటే - విరతియే భస్మము, సమతియే కౌపీనము, వివేకమే కమండలము, జ్ఞానమే దండము, ప్రణవమే సూత్రము, ఉపరతియే శిఖ - పరమయోగి లక్షణాలైన ఇవన్నీ సతతము నా యందున్నవి" అన్నారు. అది విని భోజన సమయానికి వైశ్వానరుడే ఈ విధంగా యతిరూపంలో వచ్చాడని భావించి సిద్ధులకు అగ్రపూజగావించి, భోజనం పెట్టారు.

తరువాత సిద్ధులు జనార్ధన క్షేత్రము దర్శించి అక్కడ నుండి ఉడిపికి వచ్చారు. అక్కడ శ్రీకృష్ణమూర్తిని దర్శించి, "సాక్షాత్తు శుద్ధ పరబ్రహ్మము క్షేత్రజుడు, సర్వవ్యాపకుడు అయిన తాను సగుణ రూపము ధరించి ఈ ఉడిపి క్షేత్రంలో కృష్ణుని రూపమున ప్రకటమయ్యాడు. ఆత్మయే ఈ సృష్టియొక్క జ్ఞానమును తన యందు ఆకర్షించుకొనుట చేత కృష్ణుడయ్యాడు" అని తలచి అక్కడ కొన్ని రోజులు నిర్వికల్ప సమాధిలో వుండి పిమ్మట అక్కడ నుండి బయలుదేరి మురుదేశ్వరుని దర్శనం చేసుకొన్నారు. అక్కడనుండి అరణ్యమార్గాన నడిచి గోకర్ణ క్షేత్రానికి చేరుకొన్నారు. అక్కడి కోటితీర్థంలో స్నానంచేసి, మహాబలేశ్వరుని దర్శనం చేసుకొన్నారు. " ఈ క్షేత్రము వేదపరమైన మహావాక్య శ్రవణానికి బహు యోగ్య స్థానమై, మనుష్యులకు ముక్తిదాయకమై యున్నది" అని యోచిస్తూ యాత్రికుల సమూహాన్ని చూస్తూ, ముందుకు సాగారు. అంతలో శ్వేత వస్త్రములు ధరించి, జటాజూటధారి, తేజస్వియైన 'జడిస్వామి' సిద్ధులకు ఎదురయ్యాడు. అతడు తన సహపాఠి యని గుర్తించి, సిద్ధులు అతని చేయి పట్టుకొని సముద్రతీరానికి తీసుకు వెళ్ళారు. ఇద్దరూ కలిసి వెళ్తుండగా జడిస్వామి "నాకు చాలా చలివేస్తుంది" అన్నాడు. వెంటనే సిద్ధులు చెత్తలో పడవేసిన ఒక పాత చింకి చాప తెచ్చి కప్పి, అక్కడ పడవేసి ఉన్న కొబ్బరికాయ చిప్పలు అతని మెడలో హారముగా వేసి ముఖాన కుంకుమరాసి, ఒక చేతికి పాత చీపురు, మరొకచేతికి ఓటి కుండ ఇచ్చి, "చూడు! ఇప్పుడు నువ్వు సరిగ్గా భైరవుని లాగ కన్పిస్తున్నావు" అని పగలబడి నవ్వసాగారు. ఇట్లా ఇద్దరూ ముందుకు సాగగా, ఒక తప్పెటవాయించే వాడు కన్పించాడు. అతడితో "మేము భిక్షాటనకు బయలు దేరాము. నీవు తప్పెట వాయిస్తూ మాతోపాటే వచ్చావంటే మాకు దొరికిన భిక్షలో నీకు ఒక భాగం ఇస్తాం" అని చెప్పగా వాడు తప్పెట వాయిస్తూ బయలు దేరాడు, వాడు తప్పెట వాయిస్తూంటే, దానికి అనుగుణంగా జడిస్వామి నృత్యం చేయసాగాడు. సిద్ధులు వెనుకనుంచి, "శభాష్!

భళి భళి" అంటూ ఉత్తేజపరుస్తూ వుండగా, ఇట్లా ఊరంతా తిరుగుతూ భిక్షాటనం చేసి, చివరకు సముద్ర తీరానవున్న మహాబలేశ్వర దేవాలయానికి చేరారు.

అక్కడ ఒక పౌరాణికుడు "జ్ఞానేశ్వరి" చెబుతుండగా సిద్ధులు ఆ రోజు తాను చెబుతానని పీఠం మీద కూర్చున్నారు. సిద్ధులు "ఊర్ధ్వమూలం అధఃశాఖా" అనే శృతి వాక్యము యొక్క అర్థాన్ని బోధిస్తూ దానికి పూర్వ పక్షంగా తానే అనేక ప్రశ్నలు వేస్తూ, మళ్ళీ ఉత్తరపక్షంగా వాటిని ఖండిస్తూ, జ్ఞానులు మెచ్చుకొనే విధంగా వివరించారు.

వారి బోధకు అక్కడున్న ద్విజులందరూ చకితులై, భక్తి శ్రద్ధలతో ఆరతిచ్చి నమస్కరించి వెళ్ళిపోయారు. ఆ పౌరాణికుడు హారతిలో వచ్చిన డబ్బును లెక్కించి రోజుకంటే ఎక్కువ వచ్చినదని సంతోష పడిపోతూంటే సిద్ధులు హాస్యంగా, "ఆ డబ్బంతా నా కష్టము వలన వచ్చింది కాబట్టినాది" అని గుప్పెట్లోకి తీసుకున్నారు. అతడు అవి లాక్కుంటూ యుద్ధానికి దిగాడు. అప్పుడు ఆరూఢులు, "నీవు పురాణం చెప్పేది డబ్బు మీది ఆశతోనా? ఇంత కొంచెము డబ్బుకోసమే ఇట్లా పోట్లాడుతున్నావే! ఇక నీకు భ్రాంతులు తొలిగేదెలా? అరిషడ్వర్గాలను జయించి, ఎవరు శాంతితో వుంటారో అతడే అసలైన పౌరాణికుడు" అని చెప్పి ఆ డబ్బువానికే ఇచ్చివేసి, నవ్వుతూ తన జోలిలో నుంచి ఏడు బంగారు నాణాలు తీసి, అతనికిచ్చారు. సిద్ధుల మహిమను చూచిన అక్కడి జన సమూహం ఆశ్చర్యచకితులై, భక్తితో సిద్ధులకు నమస్కరించారు.

చివరకు ముగ్గురూ గుడి పశ్చిమ ద్వారము గుండా బయటకు నడుస్తున్నారు. దారిలో దేవాలయానికి కుంభనైవేద్యం తీసుకువెళ్తూ ఒక భక్తుడుఎదురయ్యాడు. సిద్ధులు వానిని ఆపి "నేను మహాబలేశ్వరుడను. ఆ నైవేద్యం నాకే సమర్పించు" అన్నారు. దానికా బ్రాహ్మణుడు "అన్నంమీద నీకు ఇంతకోరిక వుండగా నీవు దేవుడవెలా అవుతావు? ఆశపోతువు నీవు ఈశ్వరుడవా? చాలు! చాలు!" అంటూ ముందుకు సాగాడు. జడిస్వామి కావాలని అతడ్ని ముట్టుకొన్నాడు. ఇంతలో అక్కడున్న బ్రాహ్మణులంతా చేరి జడిస్వామిని కొట్టబోయారు. సిద్ధులు వాళ్ళని వారించి "పరమ జ్ఞానిని మీరు కొట్టవచ్చునా? శివుడు అందరిలోనూ వ్యాపించి యున్నాడు. జ్ఞాని యొక్క ముఖంగుండా తాను తృప్తుడనౌతానని చెప్పిన గీతా ప్రమాణాన్ని మీరు చూడలేదా? "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః ప్రాణాపాన

సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం" - పరమాత్మ సత్పురుషులను విడిచి రాతి నోటి గుండా తృప్తుడౌతాడా? పిల్లవాని ఆటకోసం బొమ్మ ఏనుగును కొని పెడతారు. పిల్లవాడు పెరిగి పెద్దవాడైన తర్వాత కూడ ఆ బొమ్మమీది మోహంతో అసలైన ఏనుగును వద్దంటాడా? పరమాత్ముని నిజ స్వరూపం తెలుసుకోలేని మందమతులకు భక్తిని పెంపొందించడానికై, మునులు రాతిని మూర్తిగా చేసి స్థాపించారు. మీరు శ్రేష్ఠబ్రాహ్మణులై యుండీ ఆ రాతిమీది మోహంతో అసలైన బ్రహ్మవిద్యను విడిచి పెట్టడం తగునా? ఆకలిగొన్న వారికి పెట్టిన అన్నము పరమాత్మకే చెందుతుంది" అని బోధించారు. దానితో వారికి జ్ఞానోదయమై, సిద్ధులను పూజించి ఆ నైవేద్యం వారికే సమర్పించారు.

సంప్రదాయంలో గ్రుడ్డిగా చిక్కుకొని బాహ్యాచారాలకే విలువనిస్తూ, అసలైన అంతర్యాన్ని మర్చిపోయిన వారికి కనువిప్పు కల్గించడానికే మహాత్ములందరూ అవతరించారా అన్పిస్తుంది. శ్రీ సాయిబాబా తానే సర్వజీవ కోటిలోనూ వ్యాపించి వున్నట్లుగా అనుభవపూర్వకంగా ఎందరికో నిదర్శనాలిచ్చారు. ఆకలిగొన్న కుక్కకు రొట్టెలు పెట్టి మసీదుకు వచ్చిన శ్రీమతి తార్కాడ్‌తో "అమ్మా! నీవిచ్చిన ఆహారంతో నా ఆకలి తీరి నాఇంద్రియాలు తృప్తిచెందాయి. ఎప్పుడూ ఆకలిగొన్న ప్రాణికి పెట్టి, తర్వాత నువ్వుతిను" అంటారు బాబా. ప్రపంచమంతటా అన్ని జీవుల రూపాలలో సంచరించేది పరమాత్మయేనని గ్రహించి, సేవించడమే సర్వధర్మాలకు మూలము.

సిద్ధులు అక్కడ నాగతీర్థంలో మూడు రోజులుండి, తమ వద్దకు వచ్చిన వారి సంశయాలు తీరుస్తూ జ్ఞానబోధ గావించారు.

సిద్ధులు అక్కడి నుండి బయలుదేరి ఉళువికి వచ్చి హుబ్లీమీదుగా పండరీపురానికి వచ్చి, విఠలుని దర్శనం చేసుకొని, కళ్యాణ్ మీదుగా నాసిక్ చేరారు అక్కడ గోదావరి తీర్థంలో స్నానంచేసి, ముందు పంచవటిలో నున్న గుప్త గుహలోపల నున్న నారాయణుని దర్శనం చేసుకొన్నారు. అక్కడ నుంచి త్ర్యంబకేశ్వరుని దర్శించి, ఠాకుర్జీ మూర్తిని దర్శించి, ద్వారకలో నున్న గోమతి తీర్థానికి వచ్చారు. అక్కడ ఒక వైష్ణవ యతికి ఈ జగత్తు అంతా స్వప్నము వలె మిథ్యయని నిరూపించారు.

అక్కడి నుండి సిద్ధులు ఉజ్జయిని చేరారు. అక్కడ కాళికాదేవి గుడిలోపలకు వెళ్ళి దేవిని చూచి, "పరమ చైతన్య శక్తియే ఈ పీఠమున కాళికా నామంతో నెలకొని

యున్నది". అని ప్రశంసించి ఓంకారేశ్వరం చేరారు. అక్కడ యుగానికి ఒకసారి కోటిలింగాలుద్భవిస్తాయని ప్రసిద్ధిచెందిన సరోవరాన్ని చూచి, "కలియుగంలో మనుష్యులకు భక్తి కల్గించడానికై ఋషులీ యుక్తిని కల్పించారు" అనుకొంటూ బ్రహ్మపురికి వచ్చారు. అక్కడ వుండే "నిబాని" అనే సరోవరపు ఒడ్డున కొందరు సాధువులను చూచి, అటునుండి రుద్రపురికి వెళ్ళారు. అక్కడ ఓంకారేశ్వరుని దర్శనం చేసుకొని అచటి చెరువు వద్దకొచ్చారు. అక్కడ చేపలకు అన్నంవేస్తున్న జనులను చూచి, "ఎల్ల ప్రాణులకు దేవుడు వాటివద్దకే ఆహారం తెచ్చిస్తుంటే ఆ అన్నం కోసం నేను ప్రయత్నం చేయడమెందుకు?" అని తలచి సిద్ధులు ధ్యానస్థులై కూర్చున్నారు. అంతలోకి చేపలకు వేయడానికి అన్నం తీసుకు వచ్చిన వాడొకడు సిద్ధులను చూచి, మహాత్ముడని గ్రహించి ఆ ఆహారం వారికి సమర్పించి వెళ్ళిపోయాడు.

అక్కడ నుండి మధురాపురికి వచ్చి శ్రీరామమూర్తిని దర్శించి, ముందుకు సాగి గోకులము చేరారు. అక్కడ రాధాకృష్ణుల మూర్తిని దర్శించి బృందావనానికి వచ్చారు. అక్కడనుండి అరణ్యాలు, పర్వతాలు దాటి కాశ్మీరము చేరారు. అక్కడే ఒక గజానన దేవాలయంలో చేరిన జ్యోతిష్కులకు ఖగోళశాస్త్రాన్ని వివరంగా బోధించి, పిమ్మట వారితో అటువంటి శుష్క శాస్త్రవాదాలతో పండితులు కావడం జీవిత పరమావధి కాదనీ, సత్యమైన బ్రహ్మవిద్యను నేర్చుకొని ముక్తినిపొందడమే అసలైన లక్ష్యమనీ బోధించారు. వారి బోధతో కనువిప్పు కలిగిన ఆ జ్యోతిశ్శాస్త్ర పండితులు భవిష్యత్పురాణంలో కలియుగంలో ఐదువేల సంవత్సరాలకు భగవంతుడు భూమిమీద అవతరిస్తాడని చెప్పిన విషయం గుర్తుకు వచ్చి సిద్ధులను భగవదవతారంగా గ్రహించి, వారిని సేవించి, రెండు నెలల పాటు అక్కడనే వుంచుకొని వారి వద్ద తైత్తరీయోప నిషత్తును విని, గురుకృపకు పాత్రులయ్యారు.

అక్కడి నుండి సిద్ధులు పంజాబు చేరారు. అక్కడ చరకమౌని సాంప్రదాయకుడైన ఒక ఆయుర్వేద వైద్యునికి ఆయుర్వేదంలోని మర్మాలను బోధించారు. రోగిని పరీక్షించి అతని రోగాన్ని సగము తన తపస్సుతోను, మిగిలిన సగము ఔషధముతోను నివారించాలని చెప్పారు. తర్వాత సిద్ధులు అమృత్‌సర్‌కు వచ్చారు. అక్కడ పట్టణంలో భిక్షకు వెళ్తూ వుండగా "నానక్ షా" అనే స్వామివారి మఠము కన్పించింది. అక్కడ గురువుల చేతితో వ్రాయబడిన పాత శాస్త్రాన్ని

అవలోకించి, అక్కడ వున్న వారితో "ఈ మీ శాస్త్రము ప్రణవోపాసనము ముఖ్యంగా చెబుతున్నది. అందువలన మీరు శ్రద్ధాభక్తులతో ఉపాసన చేయండి" అని ఉపదేశించి, ముందుకు సాగి సారంగపురి, కురుక్షేత్రము, హరిద్వారము, బదరికాశ్రమము చూచుకొని కేదారములో కేదారేశ్వరుని దర్శించి, అక్కడ నుండి గంగోత్రికి వచ్చి అక్కడ కొంత కాలము నిర్వికల్ప సమాధిలో నిమగ్నులయ్యారు.

అటువచ్చిన ఒక సాధకుడు సిద్ధులను చూచి, "నీవు ఏ ఆసనములో వున్నావు?" అని అడిగాడు. దానికి సిద్ధులు "మల మాయాదిక తనువే తాననుకొనే వారికి ఆసనము గాని, జీవుని ఉపాధులను తీసివేయగా మిగిలిన బింబరూప బ్రహ్మముతో ఐక్యమైన జ్ఞానులకు కాదు" అన్నారు. అప్పుడా యోగి "బింబ ప్రతిబింబములు రెండిటి యొక్క ఐక్యత అనేది భేదమా! అభేదమా!" అని అడిగాడు. దానికి సిద్ధులు "భేదా భేద భావనలు నిజమయ్యే అవకాశమే లేదు. అద్దములో కన్పించే ముఖము భేదముగా వున్నా, కన్పించడంలోని భేదాన్ని గుర్తిస్తే అభేదంగానే వుంటాయి. అద్దంలో కన్పించే ముఖాన్ని చూచి తమ ముఖాన్ని గుర్తిస్తారు. భేదాభేద నిర్ధారణ లెక్కించడానికి రాదు. అది అనిర్వచనీయము" అని చెప్పారు. దానికా యోగి సమ్మతించి, తాను భిక్ష చేసి తెచ్చిన అన్నము సిద్ధుల వద్దనే తిని వెళ్ళిపోయాడు. సిద్ధులు అక్కడనుండి బయలుదేరి తుండపాణి లింగాన్ని దర్శించి అక్కడ దీర్ఘజ్వరంతో బాధపడుతున్న ఒక విప్రునికి పంచాక్షరీ మంత్రముపదేశించి, రోగ నివారణ చేసి, బయలుదేరారు.

పిమ్మట కేదారఘట్టము దాటి నానా పర్వతములు దాటి కాశికి వచ్చారు. గంగానది వద్ద మణికర్ణికా ఘట్టము వద్ద ముండనము, స్నానము ఆచరించి, పిండములు విడిచే వారిని చూచి నవ్వుకొంటూ ముందుకు సాగారు. కాలభైరవుని గుడి దర్శించి, అక్కడ నుండి విశ్వేశ్వరుని, అన్నపూర్ణేశ్వరిని దర్శించి ముందుకు సాగారు. అక్కడ నుండి దశాశ్వమేధ ఘట్టానికి వచ్చి అక్కడ ఒక దేవాలయంలో విశ్రమించారు. అదే సమయానికి మహాదేవశాస్త్రి, జగన్నాధభట్టు అనే పండితులు తమ శిష్యగణంతో అక్కడకు వచ్చి, న్యాయశాస్త్రంలో తమ తమ పాండిత్యం చూపించుకోడానికి వాదమాడుతున్నారు. సిద్ధులు వారి శాస్త్ర గర్వాని అణచి, జ్ఞాన మార్గాన్ని బోధించారు. తమకు కేవల శబ్ద జ్ఞానమేగాని, అనుభవ జ్ఞానములేదని

గ్రహించి ఆ పండితులు సిద్ధులకు పాదాక్రాంతులయ్యారు. వారికి ముక్తి సాధనమని చెప్పబడే ఈ కాశీక్షేత్రంలో జ్ఞానము సంపాదించుకోవలసిన అమూల్యమైన సమయాన్ని వ్యర్థమైన తర్క, న్యాయ శాస్త్రాలతో వెళ్లబుచ్చడం అవివేకమని ఉపదేశించారు.

వారి శిష్యులలో ముగ్గురు సిద్ధారూఢులతో "మీ బ్రహ్మోపదేశానికి మేము ఒప్పుకోము. ఎందుకంటే అప్రత్యక్షమైన శ్రుతివాక్యాన్ని వినుట వలన మనస్సు అభావమౌతుంది" అని తమ సంశయం వెలిబుచ్చారు. అప్పుడు సిద్ధులు "మనస్సు అభావమౌతుందని చెప్పినది మనస్సా లేక జ్ఞానమా? అది మనస్సయితే, లీనమై వుండిన మనస్సు లీనమైనట్లుగా తానెలా చెప్తుంది? ఇక జ్ఞానము చెప్తుందని అనేటట్లయితే జ్ఞానము మనస్సు లేనిదే చెప్పలేదు. నిత్యము న్యాయ తర్కాలను మాత్రం అభ్యసిస్తూ, ఇతరులను ఓడించాలని చూచువాడు బ్రహ్మరాక్షసుడై పుడుతాడు.' ' అని చెప్పేసరికి వారు భయగ్రస్తులై, సిద్ధుల కాళ్ళమీద పడ్డారు. ఆయన క్షమతో వారిని లేవదీసి, తత్వమసి మహావాక్యముపదేశించి, ఆశీర్వదించారు.

తర్వాత బసవదుర్గ, నారద, చౌకి, చౌషష్టి, లోలార్క, పాత పాండేశాది ఘట్టాలు చూస్తూ హరిశ్చంద్ర ఘట్టానికి వచ్చారు. అక్కడ ఉన్న శ్మశానాన్ని చూస్తూ నంగా ఘట్టానికి వచ్చి, విశ్రమించారు. నంగా సాంప్రదాయకుడైన ఒక బైరాగి సంచరిస్తూ అక్కడికి వచ్చాడు. "వస్త్రములను ధరించిన వారికి చింతయే కాని సుఖము లేదు. సాధువైన నీకు వస్త్రములెందుకు?" అని ప్రశ్నించాడు. సిద్ధులు, "దిగంబరివైన నీకు స్పర్శేంద్రియాలు స్పర్శను పొందినపుడు సుఖదుఃఖాలు కల్గుతాయాలేదా?" అని ప్రశ్నించారు. దానికి బైరాగి, "ప్రారబ్ధవశాన తన వ్యవహారము నడుస్తుండగా మొదట తన మనస్సును వశపరచుకొన్న వారికి సుఖదుఃఖాలుండవు" అని చెప్పాడు. "మరి మనస్సును వశపరచుకొనడమే అసలైన సాధనమై యుండగా, బాహ్యమైన ఈ వస్త్ర పరిత్యాగమెందుకు?" అని సిద్ధులు ప్రశ్నించేసరికి బైరాగి చకితుడై, "మూదివానా దిల్ శియానాహై" (బయటకు పిచ్చివానివలె కన్పించినప్పటికీ లోపల పరమ బ్రహ్మ జ్ఞాని) అని నమస్కరించి, వెళ్ళిపోయాడు. సిద్ధులు అక్కడినుండి బయలుదేరి వ్యాస కాశీ దర్శించి, అక్కడ ఒక దేవాలయంలో కూర్చుని ఉండగా ఒక పూజారివచ్చి "నీవు ఎవరు?" అని ప్రశ్నించాడు. దానికి సిద్ధులు "నిన్ను నీవు తెలుసుకొంటే నీవు ఎవరివై వుంటావో అదే నేను" అన్నారు. సిద్ధులు మహాజ్ఞాని

యని గ్రహించిన ఆ పూజారి సిద్ధులకు భోజనం పెట్టి నదీ తీరానున్నఒక దేవాలయంలో వ్యాసుడు ప్రతిష్ఠించిన శివలింగాన్ని చూపి "స్వామీ వ్యాసుడు శివుని నిందించి తన చేతిని పోగొట్టుకొన్నాడు -అది అతని మూర్ఖత్వంకాదా?" అని ప్రశ్నించాడు. దానికి సిద్ధులు, "పూర్వము వ్యాసుడు కాశీక్షేత్రంలో అన్నం కోసం యాచించగా మూడురోజులైనా ఒక్క ముద్ద కూడ లభించలేదు. దానితో శివునిమీద కోపించి చేయెత్తి దూషించడంతో, శివుడుకుపితుడై, "నీ చేయి తెగిపోవుగాక! ఈ కాశీక్షేత్రం నుంచి తక్షణమే బయటకు నడువు" అని శపించాడు. చేయి తెగిన వ్యాసుడు బయటకు వచ్చి, ఈ స్థలంలో పవిత్ర శివలింగాన్ని స్థాపించి, పశ్చాత్తాపంతో పన్నెండు సంవత్సరాలు ఘోర తపస్సు చేయగా, అతని చేయి తిరిగివచ్చింది. అట్లానే హిరణ్యకశిపుడు శివుని స్తుతించి హరిని దూషించి, మరణాన్ని కొని తెచ్చుకొన్నాడు. అంతటి వారే దేవత్వము నందు భిన్నత్వాన్ని తలచి హాని పొందగా, ఇక మిగిలిన వారి మాటేమిటి? నిర్వికారమైన పరబ్రహ్మమొక్కటే అన్ని రూపాలలోను ప్రకాశించేదనీ భేదబుద్ధికూడదనీ బోధించడానికే వ్యాసమహర్షి ఈ పనిచేసి చూపించాడు. అంతేగాని అతడు మూర్ఖుడు కాడు" అని వివరించారు.

అక్కడ నుండి ఆరూఢులు పంచకోశ యాత్రకు వెళ్ళి తిరిగి వచ్చి అక్కడ అన్నపూర్ణేశ్వరి సత్రంలో సంతర్పణ జరుగుతున్నదని విని, తాము కూడా వెళ్ళారు. సిద్ధులను శూద్రుడని ఈసడించి, చెప్పులు విడిచే చోట కూర్చోబెట్టి, విస్తరివేశారు. సిద్ధులక్కడే కూర్చుని భోజనం చేసి విస్తరాకు అక్కడే విడిచి పెట్టి లేచి వెళ్ళిపోయారు. వెంటనే ఒక బ్రాహ్మణుడు సిద్ధులను మెడబెట్టి లాక్కొచ్చి, "నువ్వు తిన్న ఆకు నువ్వు తీయకపోతే నీయబ్బ వచ్చి తీస్తాడా"? అని గద్దించాడు. "కొడుకు కావాలి అనుకొంటే నా తండ్రే వచ్చి తీస్తాడు" అని సిద్ధులు వెళ్ళిపోబోతుంటే, పట్టుకొని కొట్టబోయారు. అంతలో జటాజూటము, నుదుట భస్మము, మెడలో రుద్రాక్షమాల ధరించి ముక్కంటివలె ప్రకాశించే ఒక శివయోగి వచ్చి ఆ ఎంగిలాకు తీసివేశాడు. పీతాంబరాలు ధరించి, నవరత్న ఖచిత ఆభరణాలతోను, నుదుట కస్తూరి తిలకంతోను ప్రకాశిస్తున్న ఒక స్త్రీమూర్తి లోపలి నుండివచ్చి, సిద్ధుల చేయికడిగి, తన పమిట చెంగుతో తుడిచి, అదృశ్యమైపోయింది. అక్కడి వారంతా ఆ శివయోగి కోసం చూస్తే ఎక్కడా కన్పించలేదు. సిద్ధులకోసం వెదికితే సిద్ధులూ ఎక్కడా కన్పించలేదు.

అక్కడ నుండి సిద్ధులు ప్రయాగ క్షేత్రానికి వచ్చి, అక్కడ అనేకులు పిండ, తర్పణాది విధి నియమాదులు ఆచరించడం చూచి మనస్సులో "వీరు నిత్యనైమిత్తిక కర్మలను నిష్కామంతో చేస్తే శుద్ధ మనస్కులై నిర్మల జ్ఞానానికి అధికారులౌతారు" అనుకొంటూ వెళ్ళిపోయారు. ముందున్న సంగమ నాథుని దర్శనము చేసుకొని, అక్కడనున్న అక్షయవట వృక్షమూలాన్ని దర్శించి అట్లే గుప్తగామినియైన సరస్వతీ మూలస్థలాన్ని దర్శించారు. అక్కడ నుండి ముందుకు సాగి మొగలు సరాయికి వచ్చి, పట్టణం చేరబోయే సరికి చీకటి పడగా ఊరుబయట ఒక దేవాలయంలో విశ్రమించారు. అక్కడంతకు మునుపే ఒక కాన్యజ్ఞుడు కూర్చుని ఉన్నాడు. అతడు సిద్ధులను పరీక్షింపబోగా, సిద్ధులు అతని గర్వము అణగునట్లేగా ఉత్ప్రేక్షాలంకారాన్ని బోధించారు.

ఇంతలో పెద్ద గాలివాన వచ్చి తడిసి పోతుంటే సిద్ధులక్కడి నుండి లేచి ఒక ధనికుని ఇంటి అరుగుమీద కూర్చున్నారు. అంతలో కాపలావాడు వచ్చి, "ఏరా! ఇదేమన్నా ధర్మసత్రమనుకొన్నావా? నడుబయటకు!" అని వెళ్ళగొట్టబోయాడు. సిద్ధులు ప్రశాంతంగా "అవును ఇది ధర్మ సత్రమే" అన్నారు. "నీవు కడు మూర్ఖుడవులాగున్నావు" అన్నాడు కాపలావాడు. సిద్ధులు "నేను మూర్ఖుడను గాను నీవే మూర్ఖుడవు ఆలోచించి తెలుసుకో" అన్నారు. "నేనెట్లా మూర్ఖుడనో చెప్పు" అన్నాడు వాడు.

"అయితే ఈ ఇంట్లో ఇంతకుముందు ఎవరున్నారు? షావుకారు తండ్రి, అతనికి ముందు షావుకారు తాత, ఇట్లా తాత తర్వాత తండ్రి, తాను, తర్వాత తన కొడుకు, మనుమడూ ఇలా పాతవారుపోయి క్రొత్తవారు వస్తున్నారు కాబట్టి ఈ ఇంటికీ, ధర్మసత్రానికీ తేడా ఏముంది? ఇది తెలుసుకోకుండానే కోపం తెచ్చుకొన్న నీవు మూర్ఖుడవా నేను మూర్ఖుడనా?" అన్నారు.

వీరి మాటలు లోపలినుంచి వింటున్న ధనికుడు సిద్ధులు మహాత్ములని గ్రహించి, బయటకొచ్చి నమస్కరించి ఒకరోజు తమ ఇంటిలో వుండవలసినదిగా ప్రార్థించాడు.

అప్పుడు సిద్ధులు "భూమి యనే సదనంలో తమ పూర్తి అయుష్యమంతా గడిపినా, అది ఒక క్షణము కూడ పూర్తిగా కాదు, సత్రము వంటి నీ ఇంటిని నీవే ఒక రోజు వుండి

విడిచి బయటకు వెళ్ళి పోయేటప్పుడు, నేనెందుకు అక్కడకు రావడము?" అన్నారు. "గురుదేవా, మీ మాట సత్యము" అంటూ వారి చేయిపట్టుకొని లోపలకు తీసుకవచ్చి, తనపై అంతస్థుకు తీసుకువెళ్ళారు. అక్కడ అతని పిల్లలు చదరంగం ఆడుతూంటే, సిద్ధులు ఉత్సాహంగా వారి వద్ద కూర్చుని చదరంగం ఆడి వాళ్ళను ఓడించారు. చదరంగం ఆట సామ్యంతో ఆత్మసాక్షాత్కరించే వుపాయాన్ని బోధించారు. మూడు నెలల నుండి కడుపు నొప్పితో బాధపడుతున్న షావుకారు తల్లిని చూచి "పూర్వజన్మలో చేసిన పాపము మరు జన్మలో వ్యాధిరూపంలో పీడిస్తుంది. అది శివధ్యానము, మహాత్ముల పాద తీర్థము, మానస పూజాదుల వలన నివృత్తియవుతుంది" అని చెప్పి, ఆ ధనికుని ప్రార్థన మేరకు తన పాద తీర్థాన్ని ఇచ్చి, అమె వ్యాధి నివారణగావించారు.

సిద్ధులు అక్కడ నుండి గయకు బయలుదేరి మార్గమధ్యంలో ఒక శివాలయంలో పూజాసమయంలో గాయకులు భైరవిరాగం పాడుతుంటే విని సిద్ధులు ఆ సమయాన శంకరాభరణ రాగము పాడవలెననీ, నాభిస్థానమందుండు కుండలీ సర్పము ఊర్ధ్వముగా వెళ్ళి బ్రహ్మరంధ్రమున శోభించుట వలన ఆత్మరూపుడగు శంకరునికి ఆభరణంగా వుంటుంది గాబట్టి శంకరాభరణము ఈశ్వరునికి ప్రియమైనదనీ బోధించారు. తర్వాత ఆ గాయకుల ప్రార్థన మీద సామగానము యొక్క రహస్యమును తెలిపి, జీవుని శరీరంలో సప్తస్వరాలూ, ఏయే స్థలాలలో పుడుతాయో, ఆయా స్థలాలలోని ఏ స్వరాలను చేర్చి లీనపరిస్తే పరమాత్మ కృపవలన ఆత్మజ్ఞానం కల్గి ముక్తులౌతారో వివరించి, భగవంతుని ప్రీతికోసమై గానము చేయాలి గానీ, నరుల మెప్పుకొరకు గాదని బోధించారు.

అక్కడ నుండి సిద్ధులు వైద్యనాథ క్షేత్రానికి వెళ్ళి అక్కడ అర్చకులు ఈశ్వరునికి అభిషేకం చేయడం చూచి, "ఈ విధంగా స్థూల లింగానికి అభిషేకం చేయడం వలన లింగము మీద వున్న శిలాదృష్టి పోయి దేవభావం ఎలా నిలుస్తుందో, అలానే జీవుని దేహభావం పోయి, ఆత్మభావం కలగడానికి గాను మంద బుద్ధులకు శాస్త్ర కారులిలా చెప్పియుంటారు" అని తలచి, అక్కడి నుండి అరుణాచల క్షేత్రము, గంగానది శతముఖాలుగా సముద్రంలో ప్రవేశించే స్థానాన్ని చూచి, కలకత్తాకు వచ్చారు. అక్కడ మహాకాళికాదేవి ఘట్టాన్ని చుట్టుకొని పద్మి జగన్నాథమునకు వచ్చి,

నీలచక్రమును చూచి దేవస్థానంలో ప్రసాదం తీసుకొని "అన్నమే పరబ్రహ్మ" మనే శ్రుతి వాక్యం ఈ స్థలానికి చెల్లుతుంది అనుకొన్నారు. అక్కడ నుండి సముద్రతీరానున్న కబీర్ మందిరానికి వెళ్ళారు. అక్కడ సాధువులు ఆపకుండా ద్వంద్వావృతంగా రామనామ ముచ్చరించడం చూచి, అలా ఉచ్చరిస్తే ఆ నామశక్తి క్షీణిస్తుందనీ, అర్థవంతంగా ఒక్కసారి ఉచ్చరిస్తే చాలుననీ బోధించారు.

సిద్ధులు అక్కడ నుండి బయలుదేరి కటక్‌లోని మహానది తీరానున్న భద్రాక్షమనే ఊరికి వచ్చారు. అక్కడి లింగాన్ని దర్శించి, నదీతీరానికి వచ్చారు. ఏ పడవా రాకపోవడంతో అక్కడే రెండురోజులు ఆహారం కూడా లేకుండా వుండిపోయారు. మూడవరోజున నావ తీరానికి వచ్చింది. సిద్ధులు పడవ ఎక్కబోగా, పడవవాడు డబ్బులు అడిగాడు. తన దగ్గర చిల్లిగవ్వలేదని చెప్పారు సిద్ధులు. అయితే "నీ దగ్గర వున్నది ఇంకేదైనా ఇవ్వు" అన్నాడు వాడు. సిద్ధులు వెంటనే "ఇదుగో - జీర్ణమైన ఈ లంగోటి వున్నది, కావాలంటే తీసుకో" అని తన లంగోటి తీసి అతని మీద విసిరేశారు. వాడు సిగ్గుపడి, సిద్ధులను నావలో కూర్చోబెట్టుకొని అవతలి ఒడ్డుకు చేర్చాడు. నావలోని వాళ్లందరి వద్ద డబ్బు వసూలు చేయగా, ఎప్పటికంటే అధికంగా వచ్చాయి. ఆ పడవవాడు సంతోషంతో "ఈ సాధువు మహిమ వలననే ఈ రోజు నాకు ఇంతడబ్బు దొరికింది. దీనితో వీరికొక వస్త్రము కొని ఇవ్వాలి" అనుకొని వెంటనే ఒక ధోవతి కొని సిద్ధులకు సమర్పించాడు. సిద్ధులు అందులో లంగోటికి అవసరమైనంత మాత్రం వుంచుకొని, తక్కినది పేదలకు పంచివేశారు.

అక్కడి నుంచి సంచరిస్తూ, సిద్ధులు ఓఢ్ర దేశానికి వచ్చారు.



# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 4

ఓఢ్రదేశంలో ప్రజలు దుర్భర దారిద్ర్యంవల్ల, హీనాతి హీన దశలో నున్నారు. క్రొత్తవారెవరు వచ్చినా తమ ద్రవ్యాన్ని వారపహరిస్తారనే వాళ్ళ భయం. వారు సిద్ధులను తాళ్ళతో కట్టివేసి, కొరడాతో కొట్టడానికి ఉద్యుక్తులయ్యారు. అదే సమయానికి మహా తేజోవంతులైన ఇద్దరు రౌతులు గుఱ్ఱాల మీద కత్తులు ఝుళిపిస్తూ, "కౌన్‌హైరే? బేయిమాన్ పకడో! యహీ సబ్‌కో పతాలేతే కౌన్ కౌన్‌హై?" అంటూ ఆర్భాటంతో వచ్చారు. భయంతో అక్కడున్న వారంతా కాలికి బుద్ధిచెప్పారు. "సునోజీ కలికే పాంచ్ హజార్‌కా సమయ్. ఉసమే ఏక్‌పాద్‌బీత్‌గయాహై, ఇస్ మే హెూషియార్‌సే చలేతో భగవాన్ అప్ సబ్‌కే కల్యాణ్ కరతే హై" అని చెప్పి వెళ్ళిపోయారు.

చివరకు సిద్ధులు అక్కడి సమీపంలోని ఏ పల్లెకూ వెళ్లక అడవిలోనే ఉంటూ, కందమూలాలు భుజిస్తూ కొన్ని రోజులు గడిపారు. కొన్ని రోజులు నిర్వికల్ప సమాధిలో ఉండి, లేచి ప్రయాణం సాగించారు. దారిలో ఒక బైరాగి సిద్ధులతో కలిసి "ఈ మార్గాన వెళ్తే భయంకరమైన కోతులుంటాయి. వేరే దారిన వెళ్దాము" అన్నాడు. దానికి సిద్ధులు, "నశ్వరమైన ఈ శరీరాన్ని ఎన్ని రోజులు రక్షిస్తావు?" అని అతణ్ణి విడిచి తాను ఒక్కడే అదే మార్గము గుండా నడిచారు. బైరాగి చెప్పినట్లే దారిలో వందలకొద్ది కోతులు ఎగురుకొంటూ వచ్చి, సిద్ధులను చుట్టుముట్టాయి. సిద్ధుల వద్ద తినడానికి ఏమీ లేదు. వారు నగ్నంగా వుండటం చూచి నిరాశతో వెళ్ళిపోయాయి.

సిద్ధులు అక్కనుండి సింహాచలానికి వచ్చారు. అక్కడ దేవస్థానంలో నరసింహమూర్తికి శ్రీగంధలేపనం చేయడం చూచి, "భగవంతుడు సద్వాసనలతో కూడిన భావానికి దొరికేవాడే గానీ, చావు పుట్టుకలే నేను అనే దుర్వాసనా భావానికి గోచరింపడు అనే భావాన్ని ఈ లేపనం సూచిస్తున్నది" అనుకుంటూ బయటకు వచ్చి గోముఖ తీర్థంలో కూర్చున్నారు. అక్కడ ఆత్మహత్యకు సిద్ధమైన ఒక మార్వాడీకి గోముఖ తీర్థంలోని నీటితో అతని మహారోగ నివారణ కావించారు. ఆ మార్వాడీ సిద్ధులను ఇంటికి తీసుకువెళ్ళి పూజించి, తన సర్వస్వాన్ని సిద్ధుల పాదాల వద్ద అర్పించాడు.

"ఇవన్నీ నావిగా నీవద్దనే వుండనివ్వు" అని అతనికి దేహ పంచీకరణం, పంచకోశముల వివేకము ద్వారా జ్ఞానోపదేశము చేశారు.

అక్కడ నుండి బయలుదేరి, సిద్ధులు విజయనగరానికి వచ్చారు. అక్కడ కొందరు బైరాగులు వంట చేసుకొని భుజిస్తూ, అక్కడేవున్న సిద్ధులను కూడ పిలిచారు. భోజనం చేస్తూ, వారికి మనము తిన్న అన్నము దేహంలో ఏమౌతుంది అనే విషయం బోధించారు.

అక్కడ నుండి సిద్ధులు భద్రాచలానికి వచ్చారు. అక్కడ రామదాసు పునరుద్ధరించిన దేవాలయం చూచి, అక్కడ నుండి సజ్జనగడ్‌కు వచ్చి అక్కడ సమర్థ రామదాస స్వామి స్థాపించిన శ్రీరామమూర్తినీ, రామదాసు సమాధినీ దర్శించారు. అక్కడి నుండి విజయవాడ వైపుకు సాగి, దారిలోని క్షేత్రాలన్నీ దర్శిస్తూ కృష్ణాతీరానికి వచ్చారు. అక్కడ విశ్రాంతి కోసం ఒక చెట్టు నీడలో కూర్చుని వుండగా ఒక స్త్రీ అక్కడకు వచ్చి ముక్తి మార్గముపదేశించమని ప్రార్థించింది. దానికి సిద్ధులు స్త్రీలకు జ్ఞానమార్గము యోగ్యముకాదని, సోమవార వ్రతమాచరింపవలసినదనీ బోధించి, ఆ వ్రత మహిమ వివరించారు.

అక్కడినుండి సిద్ధులు మంగళగిరికి వచ్చారు. అచటి దేవాలయంలో ప్రవేశించి, పూజారిని ప్రసాదం పెట్టమని అడిగారు. అర్చకుడు సిద్ధులకు పానకమిచ్చాడు. అది త్రాగి సిద్ధులు సావధానంగా తన అభయహస్తమెత్తి,"దేవా! నీకు జయమగుగాక!" అని ఆశీర్వదించారు. అది చూచి అర్చకుడు, "దేవుని ఆశీర్వదించడం తప్పు" అన్నాడు. అందుకు ఆరూఢులు "అద్వైత బ్రహ్మము సగుణరూపంలో జగదుత్పత్తి, స్థితి లయాదులను గావిస్తాడు. జగత్తునకు ఆధారభూత పరబ్రహ్మమును ఎవరు సాక్షాత్కరింపజేసికొని, బ్రహ్మమే తాననే దృఢనిశ్చయులౌతారో అటువంటి మహాత్ముల చరణస్పర్శను గంగకూడ కోరుతుంది. అటువంటప్పుడు సర్వదేవతలు బ్రహ్మవిద్వరేణ్యుల ఆశీర్వాదమును అపేక్షిస్తారు" అన్నారు.

పిమ్మట సిద్ధులు మంగళగిరి కొండమీద నుండి దిగివస్తూ, దారిలో ఒక గుహలో ఒక బ్రాహ్మణుడు క్షుద్రవిద్యలకై సాధన చేస్తుండటం చూచి, వాటిని విడువమని చెప్పి, అతనికి విధివత్ నాలుగు వర్ణాశ్రమ ధర్మాలను బోధించి, ఆశీర్వదించి పంపారు.

అక్కడ నుండి సిద్ధులు ఆదోని వచ్చారు. అక్కడ బాళీ గుహవద్ద కొందరు సాధువులతో కొన్ని రోజులు గడిపారు. వారికి భ్రాంతి నశించడానికి సాధనాలైన భూత పంచీకరణమును తెల్పి, పిదప ఆత్మను వివరించి, అనుభవానికి వచ్చేటట్లు చేశారు. వారిని రోజూచూస్తూ, వారి బోధలు వింటూన్న ఒక కుష్ఠురోగి సిద్ధులు మహాత్ములని తెలుసుకొని వారి పాదాలమీదపడి, తన వ్యాధిని పరిహరింపవలసిందిగా ప్రార్థించాడు. సిద్ధులు కరుణతో వానికి తమ పాద తీర్థంతో స్నానము చేయించి, పంచాక్షరీ మంత్ర ముపదేశించారు. తక్షణమే అతని వ్యాధినయమై, ఆరోగ్యమైన శరీరమొచ్చింది. ఈ మహిమ విన్న ఊరి జనులంతా వచ్చి, సిద్ధుల దర్శనం చేసుకొన్నారు.

అక్కడ నుండి సంచారం సాగిస్తూ సిద్ధులు బీజాపూర్ వచ్చారు. బీజాపూర్‌లో తిరుగుతుండగా ఒక కసాయివాడు చేయిపట్టుకొని లాక్కొనిపోయి, జంతువుల చర్మాలు ఎత్తించాడు. ఒక ఇంటికి భిక్షకువెళ్తే ఆ ఇంటి యజమాని మట్టి ఎత్తి పోయించాడు. ఉరుసు జరుగుతుంటే అక్కడ సిద్ధులచేత దివిటీలు పట్టించారు. అక్కడ జరుగుతున్న నృత్యము, పాటలను అపహాస్యము చేయనారంభించారు సిద్ధులు. కొందరు గొల్లున నవ్వుతుండగా, కొందరు కుపితులై సిద్ధులను కొట్టబోయారు. ఇంతలో ఒక మహాసర్పము ప్రత్యక్షమై, సిద్ధులను వారి బారినుండి రక్షించింది. ఊరి లోపలకు భిక్షకు వెళ్ళడంవలన దుష్టుల వలన బాధలు ఎక్కువౌతున్నాయని, సిద్ధులు ఊరి వెలుపల ఒక పాడుబడిన కోటలోనున్న బిస్‌చిఫ్ మసీదులో నివసింపసాగారు. అక్కడ దొరికిన పండ్లు మాత్రమే తింటూ పూర్ణానంద స్వరూపులుగా సంచరిస్తున్న సిద్ధులను చూచి కొందరు పంచముడని అనుకొన్నారు. కొందరు పిచ్చివాడనుకొనే వారు. కొందరు సాత్వికులు "అయ్యో! ఇతని ప్రారబ్ధమేమిటో గాని ఇలా అన్న వస్త్రాలు లేకుండా అరణ్యంలో త్రిప్పుతోంది" అనుకొన్నారు. సిద్ధులకు పూర్వము బద్వేలిలో జరిగిన సంఘటన గుర్తుకు వచ్చింది.

బద్వేలి గ్రామంలో దేవాలయంలో కూర్చునివున్న సిద్ధులను కాపలావాడు, "ఎవరు నువ్వు?" అని అడిగాడు. సిద్ధులు ఏమీ మాట్లాడక పోవడంతో కొత్వాలు దగ్గరకు తీసుకువెళ్ళాడు. కొత్వాలు ఎన్ని ప్రశ్నలు వేసినా మాట్లాడక పోవడంతో, సిద్ధులను ఒక చీకటి గదిలో వేసి, తాళం వేశారు. మూడు రోజుల తర్వాత బయటకు తీసుకువచ్చి, మళ్ళీ ప్రశ్నించినా సిద్ధులు జవాబివ్వక పోవడంతో కొరడాతో కొట్టడం

ప్రారంభించారు. దెబ్బదెబ్బకు సిద్ధులు "శివార్పణమస్తు" అంటూండడం విని, ఒక బ్రాహ్మణుడు పరుగున వచ్చి, "ఈతడు బ్రహ్మజ్ఞాని వలె కన్పిస్తున్నాడు. ఇతడిని కొట్టకండి" అని చెప్పి, విడిపించి తన ఇంటికి తీసుకువెళ్ళి సకలోపచారాలతో పూజించి, వారిని తమ ఇంటిలో కొన్నాళ్ళుంచుకొన్నాడు. ఆ వూరి వారంతా సిద్ధుల వద్దకొచ్చి ఆధ్యాత్మబోధ వింటూ, ఇంతటి మహాత్ముని శిక్షించినందుకు కొత్వాలు మీద కోపించారు. కొత్వాలు కూడ ఆ మహనీయుని పట్ల తాను చేసిన అపరాధానికి పశ్చాత్తప్తుడై సిద్ధుల కాళ్ళ మీద పడ్డాడు. సిద్ధులు మాత్రము "నా కర్మను ఈ రీతిన పరిహరించిన నీవే నాకు అప్పుడవు" అంటూ కొత్వాలుకు నమస్కరించారు. కొత్వాలు కలవరపడి "పరమ పాపినైన నన్ను రక్షింపుమని శరణు వేడితే మీరే నాకు నమస్కరించి నన్ను ఇంకా ఏ నరకానికి పంపుతారు?" అని కన్నీరు కార్చాడు. అప్పుడు సిద్ధులు, "కొత్వాలూ విను. నా కర్మము నీ దృష్టి ద్వారము గుండా నీ మనస్సులో చేరినది. అక్కడ అంతర్యామియైన గురువు నిన్ను ప్రేరేపించి, నీ చేత ఈ పని చేయించారు. నా కర్మమును నాకు తినిపించి, తీర్చివేసిన ఆ గురువుకు నా నమస్కారములు. దీనివలన నీకు ఏ బాధా కలుగదు" అని ఆశీర్వదించి పంపారు. ఆ వూరి జనులంతా సిద్ధుల పేరుతో మందిరాన్ని నిర్మించవలెనని వున్నదని ప్రార్థింపగా, వారికి ఆశీర్వాదమిచ్చి అక్కడ నుండి బయలుదేరి వచ్చేశారు.

సిద్ధులలా పాడుబడిన మసీదు వద్ద నివసిస్తూండగా మొహరం పండుగ వచ్చింది. కొందరు తాగుబోతులు, సారాయి తాగి సిద్ధుల వద్దకొచ్చి, వారిని లాక్కు వెళ్ళి బండికాడి భుజాల మీదబెట్టి, నలుగురు మనుషులు బండికాడి మీద ఎక్కి, వీధి వీధి తిరుగుతూ డబ్బులు అడుక్కున్నారు. సిద్ధుల తొడలు నొప్పులు పుట్టి, క్రింద పడిపోగా, వారిని ఇంకా కొట్టి, మళ్ళీ నిల్చోబెట్టారు. అట్లా సాయంత్రం వరకు సిద్ధులను హింసించి విడిచి పెట్టారు. వారి రెండు తొడలు కందిపోయి అడుగు వెయ్యలేక అక్కడే కూర్చుండి పోయి ఇలా ఆలోచించారు. "నేనిలా తిరుగుతుంటే ఇంద్రియాలు విక్షేపం చెందుతాయని తెలిసి గురునాధులు ఒకే చోటున కూర్చుండమని ఇట్లా ఉపకారం చేశారు" అని నిర్వికల్పస్థితిలో అక్కడే కొన్ని రోజులు కాలం గడిపారు.

అక్కడకు అనేక మంది బాలురు వచ్చి, సిద్ధులతో రకరకాల ఆటలాడుతూ గడిపేవారు. అలా వుండగా సిద్ధుల గురించి విన్న తుళజప్ప అనే ఒక భక్తుడు పిల్లల

చేత వారిని తమ ఇంటికి రప్పించుకొని, వారికి సకలోపచారాలు చేసి పూజించి తన ఇంట్లో కొంతకాలముండవలసిందిగా ప్రార్థించాడు. చాలా మంది భక్తులు అక్కడకు వచ్చి శాస్త్ర శ్రవణం చేసేవారు. అలా కొన్ని రోజులు గడిపి తిరిగి బిన్‌చిఫ్ మసీదును చేరారు.

అక్కడకు పండితులు, పామరులు, స్త్రీలు, పురుషులు, బాలురు, సర్వజాతి జనులూ వచ్చి ఆ మహాత్ముని దర్శనం చేసుకొని వెళ్తున్నారు. తత్త్వవేత్తలు వచ్చి వారి వద్ద శాస్త్ర శ్రవణం చేసేవారు. మొదట వీరిని రకరకాలుగా బాధించిన వారంతా పశ్చాత్తాపపడి తమ డాంభికాచారాన్ని విడిచిపెట్టి, వారి పాదాల వద్దకు వచ్చి అపరాధం మన్నించమని వేడుకొన్నారు. తల్లులు పసిపిల్లలను రోగ నివారణకై సిద్ధుల ఆశీర్వాదానికి తీసుకవచ్చేవారు. కొందరు భూతాలు, దెయ్యాలు పట్టినవారిని సిద్ధుల వద్దకు తీసుకువచ్చి నివారణ చేసుకొనేవారు.

ఇలా ఉండగా ఒకరోజు బీజాపూర్‌లో వుండే పద్దెనిమిది కులవాదులు వచ్చి, సిద్ధ సద్గురువుల ముందు తమ తమ జాతియొక్క శ్రేష్ఠత్వాన్ని చెబుతూ కలహించుకోసాగారు. శరీరములోని వేరు వేరు ఇంద్రియాల వలె వేరు వేరు జాతుల, వర్ణముల వారు తమ తమ వ్యవహారాలు నెరవేరుస్తుంటారని, జగత్తు మొత్తానికి తండ్రియైన దేవుడొక్కడేననీ సమచిత్తంతో ఒకరితో ఒకరు ప్రేమకల్గి వుండాలనీ సిద్ధులు బోధించి పంపారు.

ఇలా కొన్నిరోజులు గడిచిన తర్వాత సిద్ధులు అక్కడనుండి ముందుకు దేశ సంచారానికి బయలుదేరగా, ఆవూరిలోని భక్తులంతా వచ్చి, స్వామి వారిని అక్కడే వుండిపొమ్మని ప్రార్థించారు. ఇకముందు ఆ దేశానికి క్షామం రాబోతుందని తాము జనుల ఆ కష్టాలను చూడబోలేమనీ అన్నారు సిద్ధులు. దానికి ఒక ధనికుడు "స్వామీ నా వద్ద 25 సం॥లకు సరిపోయే ధనధాన్యాలు దాచాను! మీకు ఏ లోటు లేకుండా కాపాడుతాను" అనగా సిద్ధులు "నీవు నన్ను ఒక్కడునూ జాగ్రత్తగా కాపాడుతావు. నిజమే. కానీ, ఈశ్వరుని క్షోభాగ్నిని నివారింపగలవా? పూర్వము హరిశ్చంద్ర, నల మాంధాతల వంటి వారికే సాధ్యము కాలేదు. అటువంటిది మీ చేత సాధ్యమౌతుందా? నీవు నామీద ప్రేమతో ఇట్లా అంటున్నావు గాని ఎల్లప్పుడూ స్వచ్ఛందంగా సంచరిస్తూ,

సంతోషంగా వుండేనాకు మర్త్య, స్వర్గాలు రెండూ సమానమే. దీని గురించి మీరు విచారింపవద్దు" అని చెప్పి, అక్కడ నుండి బయలుదేరారు.

మార్గంలో కలిగిన కష్ట నష్టాలను సిద్ధులు దేహానికి వప్పజెప్పి, తాను సంతోషంతో జీవన్ముక్తి సుఖాన్ని అనుభవిస్తూ జమఖండి వద్దనున్న సిద్ధాపురమనే గ్రామానికి వచ్చారు. సిద్ధాపురము ఒక చిన్న పల్లెటూరు. ఆవూరి జనులు చాలావరకు పేదవారు. ఆ ఊరికి ఒక హఠయోగి వచ్చాడు. అతడు వెయ్యిమంది జంగములకు అర్చన చేస్తానని మొక్కుకున్నాననీ, ధనధాన్యాలు పోగుచేసి ఇచ్చిన దాకా తాను దీక్ష విడువననీ చెప్పి, రెండుచేతులు నేలకానించి, కాళ్ళు ఎత్తి శీర్షాసనం వేసుకొని నిలుచున్నాడు. ఆ యోగిని వస్తుంచి తాము భుజించడమెలా అని అమాయకులైన ఆ వూరి వారంతా అన్న పానములు లేకుండా అట్లానే వున్నారు. ఇట్లా యోగిని ఆకలితో వుంచితే ఊరికి ఏమి కీడు రానున్నదోనని ఆ వూరి పెద్దలు భయపడుతున్నారు. ఇంతలోకి అక్కడికి సిద్ధులొచ్చారు. విషయమంతా తెలుసుకొని, "ముందు అట్లానే సహస్ర జంగమార్చన గావిస్తామని చెప్పండి ఆ యోగితో" అన్నారు. హఠయోగి సంతోషంతో తన హఠం విడిచిపెట్టి లేచి కూర్చున్నాడు. సిద్ధులతని వద్దకు వెళ్ళి, "ఓ యోగీ! జంగమపదము జగద్భరితమైనది. అటువంటప్పుడు నీవు ఏ జంగముని తృప్తి పరుస్తావు? జంగముడు క్షుధాది షడూర్ములతో కూడిన వాడైతే అతడు పూజకు యోగ్యుడు కాడు. ఇక షడూర్మి రహితుడైతే అతడు సదా తృప్తుడై ఉంటాడు. అంటే వానికి అన్నాదులతో ఏమి ప్రయోజనం?" అని అడిగేసరికి ఆ హఠయోగి నోరెత్తలేక పోయాడు. అమాయకులైన ఆ వూరి ప్రజలను మోసగించి డబ్బు సంపాదిద్దామని చూచిన వాని అసలు రంగు సిద్ధులవద్ద బయట పడిపోయింది. ఇక అక్కడుంటే మర్యాద దక్కదని సిద్ధుల పాదాలకు నమస్కరించి, "ఆకలిగా వున్నది" అన్నాడు. సిద్ధులు వానికి, పాలు పంచదార తెప్పించి పెట్టారు. అవి తిని ఊరివారికి ముఖం చూపించలేక, దొంగవలె పరిగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు.

అక్కడ నుండి సిద్ధులు యాదవాడకు వచ్చారు. భిక్షాటన చేస్తూ సిద్ధులు ఒక ఇంటిముందు నిలుచున్నారు. ఆ ఇంటిలోని సాధ్వి సిద్ధులను చూచి ఒక రొట్టెముక్క, కొద్దిగా కూర ఇచ్చింది. అది తీసుకొని సిద్ధులు "రొట్టె నిండా కూరలేదు" అన్నారు. వెంటనే ఆమె సిద్ధుల చేతిలో నుండి ఆ రొట్టెను తీసుకొని అదే కూరను రొట్టెనిండా

అద్దీ తిరిగిఇచ్చింది. సిద్ధులు మళ్ళీ "అయ్యో, విరుమకోడానికి రొట్టె మిగులలేదే!" అన్నారు. ఆమె నవ్వుకొంటూ లోపలకు వెళ్ళిపోయింది.

సిద్ధులు పిల్లవానివలె రోడ్డుమీదే రొట్టెతింటూ, హాస్యమాడుతూ, జనాన్ని నవ్విస్తూ వెళ్తున్నారు. అక్కడ అల్లమయ్య అనే పౌరాణికుడు ఒక ఇంట్లో స్కాందపురాణం చెబుతున్నాడు. ఉన్మత్తావస్థలో ఉన్న సిద్ధులు ఆ ఇంట్లోకి వెళ్ళబోగా, పిచ్చివాడని తలచి లోపలకు రానివ్వలేదు. సిద్ధులు ఎవర్నీ లెక్క చెయ్యకుండా బలవంతంగా లోపలకు వెళ్ళి కూర్చున్నారు. అక్కడ పౌరాణికునకు అలంకారములోని అర్థాన్ని సమన్వయము గావించి చెప్పగా పౌరాణికుడు సిద్ధులు గొప్ప తత్వజ్ఞులని గ్రహించి పాదాక్రాంతుడై కాశీ వెళ్ళడానికి అనుజ్ఞనిమ్మని ప్రార్థించాడు. సిద్ధులు "కాశీకి వెళ్ళినవారు తిరిగిరారని అంటారు. నువ్వెందుకు వెళ్తావు?" అన్నారు. శాస్త్రి "అది ఏమైనా కానివ్వండి నేను మాత్రము వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను" అన్నాడు. "అట్లయితే నీవు వెంటనే వెళ్ళు, తిరిగిరావద్దు" అని ఆ అల్లమయ్యను ఆశీర్వదించారు.

అక్కడ నుండి బయలుదేరిన సిద్ధభారతి తిరుగాడుతూ ఒకకోట లోపలికి ప్రవేశించారు. చీకటి పడింది. గస్తీ వాళ్ళు సిద్ధులను ఎవరని ప్రశ్నిస్తే సమాధానం చెప్పకపోయేసరికి కొరడాలతో కొట్టనారంభించారు. అంతలో ఇద్దరు వ్యక్తులు, "ఇతడు మాకు తెలుసు దొంగకాడు. భిక్షకుడు" అని చెప్పి విడిపించారు. సిద్ధులు ఊరి బయట మారుతి ఆలయం చేరి అక్కడ విశ్రమించారు. మర్నాడు ఆ వార్తవిని అల్లమయ్య శాస్త్రి భక్తులతో వచ్చి బాధపడుతూంటే స్వామి పూర్వము బళ్ళారిలో జరిగిన సంఘటన చెప్పి, దానికంటే ఇదేమంత పెద్ద కష్టము కాదనీ, సర్వమూ శివార్పణమనీ చెప్పారు.

బళ్ళారిలో కాలాబజారులో నున్న ఒక ధనికుని ఇంటి ముందు భిక్షకై నిల్చున్న సిద్ధులను కాపలావాడు "నీవెవరు?" అని అడిగి, సిద్ధులు సమాధానం చెప్పకపోవడంతో క్రితం రోజు వారింటికి కన్నం వేసిన దొంగ అని భావించి, చేతిలోనున్న కర్రతో కొడుతూ ఐదు మెట్ల మీద నుండి క్రిందకు తోశాడు. మోకాలికి బాగా దెబ్బ తగిలి రక్తం కారగా "శివార్పణం" అనుకొంటూ వెళ్ళిపోయారు.

భక్తులంతా సిద్ధులను ఊరిలోనికి రమ్మని ప్రార్థించగా వారు నిరాకరించారు అక్కడికే భోజనం తెప్పించి పెట్టి, తమ తమ సంశయాలు తీర్చుకొని, వారి ఆశీర్వాదము పొంది వెళ్ళిపోయారు.

సిద్ధులు అక్కడ నుండి బయలు దేరి సంచరిస్తూ గోకావి పురానికి వచ్చారు. అక్కడ నదీతీరాన చెట్టు నీడలో కూర్చుని వున్న సిద్ధులను చూచి, ఒక పడవవాడు, "ఓరేయ్ ఇటురా" అని పిలిచాడు. సిద్ధులు విననట్లుగా ఊరుకొన్నారు.వాడు సిద్ధుల సమీపానికి వచ్చి బలవంతంగా చేయి పట్టుకొని తీసుకువెళ్లి నావ దగ్గర నిలబెట్టి, "నువ్వు ఈ నావను తీసుకెళ్లి నీటిలో పెట్టు" అని దాని తాడును సిద్ధుల చేతిలో పెట్టాడు. సిద్ధులు ఆ నావను ఎత్తి నీటిలో వేశారు. "పదిమందికి గానీ అలవిగాని ఈ నావను ఇతడు ఒక్కడే ఎత్తాడు. ఇతడెవరై వుండవచ్చా" అని ఆశ్చర్యంతో ఆ పడవవాడు సిద్ధులను "నీవెవరివయ్యా?" అని అడిగాడు. దానికి సిద్ధులు "నీవలెనే నేనూ ఒక నావికుడను. నీవు నదికి ఒక ఒడ్డునుంచి అవతలి ఒడ్డుకు దాటిస్తావు. నేను సంసారమనే జలనిధిలో మృత్యువు నుండి అమృతత్వమనే తీరానికి దాటిస్తాను" అని పలుకగా, సిద్ధులు గొప్ప మహాత్ములని గ్రహించి, ఆ పడవవాడు నమస్కరించి సిద్ధులను అవతలి ఒడ్డుకు చేర్చాడు.

పిమ్మట సిద్ధులు బెల్గాం మీదుగా గరగ గ్రామానికి వచ్చారు. అక్కడ మడివాళస్వామి అనే మహాత్ములు వున్నారు. వారు దిగంబరులు. అంధులు. సిద్ధుల రాకను దివ్యదృష్టితో తెలుసుకొని తమ శిష్యుడైన ఘంటప్ప అనే వాడిని పిలిచి, "ఏరా, ఘంట్యా! నేను మొండి మొలతో వున్నాను. ఇక్కడకు ఈ రోజు ఒక మనిషి వస్తున్నాడు, అందుచేత త్వరగా నా కౌపీనం తెచ్చి ఇవ్వు" అని చెప్పారు. ఆ శిష్యుడు తెచ్చి ఇచ్చాడు. స్వామి వారు ధరించుకొన్న మీదట అక్కడున్న భక్తులు "ఇదేమిటి స్వామీ! మీరెంతకాలం నుంచో దిగంబరులుగా వున్నారు. ఈ రోజు ఎందుకిలా సంకోచిస్తున్నారు? మేమంతా మనుష్యులం కాదా?" అని అడిగారు. దానికి మడివాళ స్వామి వారు "మీరు బహిర్దేశానికి వెళ్ళినప్పుడు పశువులు వస్తే, మీరు సిగ్గుపడతారా? కాని మనుష్యులొస్తే సిగ్గుపడతారు గదా! నాకు సరిసమానమైన మనిషి ఈ రోజు వస్తున్నాడు. మిగతా వారంతా జ్ఞానశూన్యులైన మూగప్రాణుల వంటి వారు. అందువలన నేను అతని ముందుకు మొండి మొలతో వెళ్ళలేను" అన్నారు.

అంతలోకి సిద్ధులు మఠద్వారం వద్దకు వెళ్ళారు. ఘంటప్ప, "అయ్యా! ఎవరో బయట నుంచి మహాత్ములొచ్చారు" అని అరిచాడు. స్వామి వారు "ఘంట్యా! ఆయన్ని త్వరగా లోపలికి పిలు, ఎట్లా ఉన్నాడో చూస్తాను" అన్నారు. ఘంటప్ప సిద్ధులను లోపలికి తీసుకవెళ్లాడు. సిద్ధులు స్వామివారికి నమస్కరించి అక్కడే నిల్చున్నారు. మడివాళ స్వామి "సాధూ! నీపేరేమిటి? అన్నారు. దానికి సిద్ధుడు నన్ను "ఆరూఢులు అంటారు" అన్నారు. దానికి ఆయన "ఆరూఢ అని అంటున్నావ్, నువ్వు సరాసరి

ఆకాశం నుండి వూడిపడ్డావా? తల్లి గర్భంనుంచి పుట్టలేదా ఏమి? నీ తల్లిదండ్రులు పెట్టిన పేరేమిటో చెప్పు" అన్నారు. "నేను నిజంగా మాయ అనే ముసుగు వేసుకొని బ్రహ్మము నుంచే వచ్చాను" అని అన్నారు. అప్పుడు మడివాళ స్వామి వారు సిద్ధులను దగ్గరకు పిలిచి, ప్రేమతో కౌగిలించుకొని, ఒళ్ళంతా నిమిరి, వారి దేహం కృశించి వుండటం చూసి, విచారిస్తూ, "నిజంగా ఇతడు దేహాన్ని దండించి మనస్సును నిగ్రహించాడు. లేకపోతే జ్ఞానము వ్యర్థ జ్ఞానమై వుండేది" అని వ్యాఖ్యానించారు. ఇక వారి జ్ఞాన సంపదను పరీక్షించాలని స్వామి వారు ఈ క్రింది విధంగా ప్రశ్నించారు.

"నేను సంచరించే రోజుల్లో ఒక నగరం చూచాను. ఆ నగరంలో ఎటువెళ్ళినా గంతులేసే కోతులే! అటువంటి నగరాన్ని చూచావా?" అని ప్రశ్నించారు. దానికి సిద్ధులు "ఈ దేహమే ఒక నగరం, దీనిలో వుండే చపల చిత్త వృత్తులే కోతులు" అని ప్రత్యుత్తర మిచ్చారు. స్వామి వారు సంతృప్తులై మళ్ళీ ఇలా అడిగారు. "నేను సంచరించేటప్పుడు ఒక శ్రీమంతుల భవంతి చూచాను. అందులో మూడు పెద్ద నదులు ప్రవహిస్తూ వచ్చి ఆ ఇంటి వంటగదిలో కలిశాయి. ఆ నీటితోనే అక్కడ వంట అంతాచేసేది. నేను ఆ మూడు నదులు దాటి వంటింట్లోని వంటకాల్ని ఆరగించి బయటకు రావాలంటే మూడు క్రోసుల పొడుగుంది ఆరోడ్డు. అటువంటి ఇల్లు నీకేమైనా కన్పించిందా?" అని అడిగారు. ఈ దేహమే ఒక భవంతి. త్రికూటమే ఆ ఇంటిలోని వంటగది. ఇడ, పింగళ, సుషమ్న నాడులే మూడు నదులు, వాటి నుంచి రేచకం, పూరకం, కుంభకం, ప్రాణాయామం చేయడమే వంట వండుట. నిర్వికల్ప సమాధిలోని ఆనందమే వంటను ఆరగించడం. జాగ్రదాది మూడు అవస్థలే మూడు క్రోసుల పొడుగున్న రోడ్డు అని మనస్సులో అనుకొని శ్రీ మడివాళ స్వామి వారితో ఇలా అన్నారు. "నేను విరాగినై సంచరించేటప్పుడు ఆరు ఊళ్ళు చూచాను. ఒక ఊళ్ళో అన్నీ పందులే కన్పించాయి. రెండో వూళ్ళో అన్నీ పాములే తిరుగుతున్నాయి. ఈ రెండు ఊళ్ళను దాటి మూడవఊళ్ళోకొస్తే ఒక చెట్టుమీద నుంచి మరోచెట్టు మీదకు దూకే కోతులే వున్నాయి. ఇవన్నీ చూచుకొంటూ నాలుగో ఊళ్ళోకొచ్చాను. అక్కడ అన్నీ మిణుగురు పురుగులు మాత్రమే వున్నాయి. ఐదవ ఊరుకొచ్చి కొంచెం విశ్రాంతి తీసుకొన్నాను. అక్కడ అన్నీ సజీవ శవాలు కన్పించాయిగాని, మనుష్యుల జాడే లేదు. అని చెప్తుంటే మధ్యలో "అలాగైతే మనుష్యులే లేని ఆ ఊళ్ళలో ఈ ప్రాణులు ఎట్లా బ్రతుకుతున్నవి?" అని మడివాళ స్వామి వారు అడిగారు. దానికి సిద్ధులు "గురువర్యా!

ఈ ఐదు ఊళ్ళ బయట నున్న కుక్కలు వేరు వేరు ఊళ్ళలో చచ్చిపడివున్న గాడిద మాంసాన్ని తెచ్చి, ఆ సర్పాల ప్రభువైన ప్రాణానికి అర్పిస్తున్నాయి. వాటిని తిని అవన్నీ బ్రతుకుతున్నాయి. నేను ఈ పట్టణాలన్నీ ప్రయాసతో దాటుకొంటూ ఆరవ పట్టణం చేరుకొన్నాను. అక్కడ ఒకడు స్వప్నంలో వండిన వంటను జాగ్రదావస్థలో తింటూ సుషుప్తి యందు తృప్తి పొందేవాడు వున్నాడు. సంతోషంతో నేను అతని పాదాలపై వ్రాలాను. వెంటనే నాకు పిచ్చితో తల తిరిగి, స్పృహ తప్పి, నన్ను నేనే తిని వేశాను. చివరకు నేను చనిపోవడం నేనే తెలుసుకొని, మనుష్యులను వెతుక్కోవడానికి దేశదేశాలు గాలిస్తూ వచ్చాను. ఎక్కడా నాకు ఒక్కడు కూడా దొరకలేదు. చివరకు ఇక్కడ నీవొక్కడవే దొరికావు" అని చెప్పి నమస్కరించారు.

అప్పుడు మడివాళ స్వామివారు, "శహభాష్ సిద్ధా! నేను యోగపరంగా ప్రశ్నిస్తే, నీవు జ్ఞానపరంగా వాటికి చక్కగా సమాధానమిచ్చావు. నీవు శ్రీ గజదండ గురూత్తముల ఉపదేశం పొందడం సార్థకమైనది. గురువులు నీకు ఆరూఢుడని పేరు పెట్టడం యోగ్యమైనది. పోతే యోగ వాశిష్ఠంలో "అన్నం పాత్రలో వున్నప్పుడు దాని రుచి తెలియదు. పొట్టలోకి వెళ్ళిన తర్వాత కూడా తెలియదు. కాని, నాలుక మీద వున్నప్పుడు మాత్రమే, దాని రుచి తెలిసేది" అని వ్రాయబడివున్నది - దాని మీద నీ అభిప్రాయమేమి? అని ప్రశ్నించారు. దానికి సిద్ధులు, "పూర్వావస్థలో అంటే అజ్ఞాన దశలో జీవునికి నిజమైన సుఖం తెలియదు. జీవుడు శ్రవణాది సాధనాలతో, సిద్ధ వస్తువుతో తాదాత్మ్యం చెందిన విదేహముక్తునికీ ఆ సుఖం తెలియదు. మధ్యావస్థ అయిన జీవన్ముక్త స్థితిలో మాత్రము ఆ సహజానందపు అనుభవము గోచరిస్తుంది" అని జవాబిచ్చారు. ఈ జవాబు విని స్వామి వారు "చూచారా! సాక్షాత్తూ పరమశివుడే ఈ రూపంలో భూమి మీద అవతరించాడు! ఆ పరమ శివుని ఆజ్ఞ మీదే నేను కూడ ముముక్షువులను ఉద్ధరించడానికి ఈ దేశంలో అవతరించాను" అని చెప్పి సిద్ధులను ఆరు నెలల పాటు తమ వద్దనే వుంచుకొన్నారు. సిద్ధులు అతిక్లిష్టమైన వేదాంత విషయాలను మూఢుని మనస్సుకు కూడా హత్తుకుపోయేటట్లు, బోధించడం చూచి మడివాళ స్వామి ఆశ్చర్యచకితులైనారు. నిజగుణులు కన్నడములో రచించిన

శాస్త్రవిషయాలను సిద్ధుల ద్వారా విని, ఆనంద పరవశులై, "సిద్ధా, నిజగుణులు ఇలా శాస్త్రవిషయాలన్నీ ఇంత సరళమైన కన్నడంలో తెలిపారని నాకు తెలిస్తే నేను సంస్కృతం నేర్చుకోవడానికి కాశీకి వెళ్లేవాడినే కాదు" అని అన్నారట.

సిద్ధులు గరగ నుండి బయలుదేరుతూంటే మడివాళ స్వామి ఒక పట్టాన విడిచిపెట్టలేదు. ఇద్దరమూ ఇక్కడే వుందామని ఎంత చెప్పినా, సిద్ధులు వినక, హుబ్లీ వెళ్ళాలని బయలుదేరారు. త్రికాలజ్ఞాని ఐన మడివాళ స్వామి వారికి ముందు ముందు హుబ్లీలో సిద్ధులకు ఎదురయ్యే కష్టాలు అన్నీ తెలుసునో ఏమో - "సిద్ధా! హుబ్లీకి వెళ్ళవద్దు! అది చాల ప్రమాదకరమైన దేశం! నిన్ను పైకెక్కించినట్లే ఎక్కించి క్రింద పడవేయ జూస్తారు. చాల జాగ్రత్తలో వుండు" అని హెచ్చరించి పంపారు.





# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 5

సిద్ధులు సుమారు 1876-77 ప్రాంతంలో హుబ్లీకి వచ్చి వుండాలి. సిద్ధులే ఒక సందర్భంలో తాము హుబ్లీకి వచ్చేటప్పటికి40 సంవత్సరముల వయస్సు వుంటుందని చెప్పారు. 10 సంవత్సరాల ప్రాయంలో ఇల్లు విడిచి గురువు నన్వేషిస్తూ బయలు దేరానని కూడా మరొక సందర్భంలో సిద్ధులే చెప్పారు. 1836లో జన్మించిన సిద్ధులు పదేండ్ల ప్రాయంలో ఇల్లు విడిచి, దాదాపు 12 ఏళ్ళు గురుసేవలో గడిపి, 18 ఏళ్ళపాటు దేశాటన గావించి, చివరకు హుబ్లీ చేరి, తమ జీవిత శేషమంతా అక్కడే గడిపారు.

గురు స్వరూపులైన మడివాళస్వామి వారు హుబ్లీలో రానున్న ఆపదలను సూచించి, వారించినా వినక సిద్ధులు హుబ్లీకే ఎందుకు వచ్చి స్థిరపడ్డారో! వారు తమ దేశాటనలో ఎన్నెన్నో పుణ్యక్షేత్రాలు, తపోభూములు దర్శించినా, అవేవీ ఎన్నుకొనక చివరకు హుబ్లీకే ఎందుకు వచ్చారో ఎవరికెరుక? సుమారు 52 ఏళ్ళపాటు సిద్ధుల పాదస్పర్శను పొంది పుణ్యక్షేత్రమయింది హుబ్లీ! అక్కడే వారి సమాధి నుండి ఈ నాటికీ భక్తులను కటాక్షిస్తూ, సజీవులై వున్నారు సిద్ధారూఢులు.

సిద్ధులు హుబ్లీకి వచ్చిన తర్వాత మౌనంగా వుంటూ గోపాలకులతో కలిసి ఆటలాడుతూగడిపేవారు. నగరంలో తిరుగుతూ, కనిపించిన ఇంటి ముందు చేతులు జోడించి మాట్లాడకుండా నిలబడేవారు. ఇంటి వాళ్ళు ఏదైనా తెచ్చి వేస్తే దాన్ని అక్కడే తినేవారు. వాళ్ళు ఏమీ పెట్టకపోతే ముందుకు సాగేవారు. కొందరు వారిని పిచ్చివాడనీ, మూర్ఖుడనీ, మూగవాడనీ, పిశాచి అనీ నోటికి వచ్చినట్లు తిట్టేవారు. సిద్ధులు పరప్పగారి పొలంలో వుండే ఒక చిన్న శివాలయంలో రాత్రి కాలం గడిపేవారు.

ఒకరోజు జడిమఠ స్వామివారైన శ్రీ సిద్ధవీరయ్య అనేవారు సిద్ధుల స్థితిని తెలుసుకొని, తన శిష్యులతో కలిసి అక్కడకు వచ్చారు. అక్కడ ఆరూఢులు ఒక పాత గోనెపట్టాలను ప్రీతితో కప్పుకొని, అక్కడ వున్న శివలింగానికి ఆనుకొని కూర్చున్నారు. వారి తల మీద పగడవిప్పి ఆడుతూవున్న సర్పాన్ని చూచి భయపడి

వారంతా "పాము పాము"ని అరవడంతో అది పారిపోయింది. సిద్ధులు గొప్ప మహాత్ములని గ్రహించి, వారికి నమస్కరించి, ఎంత మాట్లాడించినా, వారు మాట్లాడ లేదు. చివరకు అందరూ కలసి వారిని ఎత్తుకొని ద్వాదశ బసవ మఠానికి తీసుకొని వచ్చారు. ఒక మంగలిని పిలిపించి, క్షౌరం చేయించి అభ్యంగన స్నానం చేయించి, శుభ్రమైన ధోవతి కట్టి పక్వాన్నాలతో భోజనం పెట్టి, మెత్తని పరుపు మీద పడుకోబెట్టారు. తెల్లవారకముందే లేచి ఎవరికీ దొరకకుండా వెళ్ళిపోయారు సిద్ధులు. అప్పటి నుంచీ తాను ఎవరికీ కన్పించకుండా, అడవిలో వుంటూ, గోపాలురతో కలిసి ఆటలాడుతూ, వాళ్ళ దగ్గర రొట్టె అడిగి తింటూ వుండేవారు. ఇట్లా ఆరునెలలు గడిచాయి.

అక్కడే సమీపంలో వున్న చన్నప్ప చౌక్ వద్ద శరణప్ప అనే అతను కర్జీపరప్ప, ఉజ్జణ్ణ భీమప్ప మొదలగువారిని కూర్చోబెట్టుకొని ప్రతిరోజు సాయంకాలం నిజగుణుల బోధామృతాన్ని శ్రవణం చేసేవాడు. ఒకరోజు సిద్ధులు అకస్మాత్తుగా వచ్చి, ఆ చెట్టు క్రింద కూర్చున్నారు. ఇంతలో శాస్త్ర శ్రవణం మొదలైంది. శరణప్ప పరమానుభవ బోధలలో మూడవ సంధి, అయిదవ సూత్రంలోని రెండవ పద్యంలోని 'చిత్' శబ్దానికి 'కరణమ'ని (ఇంద్రియరీతి) అర్థం చెప్పాడు.

సిద్ధులు అది విని "చిత్ శబ్దానికి ఆత్మ అని అర్థం చెప్పాలి. ఇంద్రియమని చెప్పరాదు" అని తాను ఆ సూత్రార్థాన్ని అందరూ మెచ్చుకొనేటట్లుగా వివరించారు. ఇలా ఆరూఢులు చెప్పినది విని, వారంతా తలవంచి సాష్టాంగ నమస్కారం చేసి, వారికిభోజనం పెట్టి అక్కడే శయనింప జేశారు. సిద్ధులు ఎవరికీ తెలియకుండా నిశ్శబ్దంగా లేచి వెళ్ళిపోయారు.

ఆరూఢులు అక్కడ నుంచి వేగంగా బయటపడి ముళ్ళపొదలతో నిండిన తోరవీయుల వారి బావిలోకి దిగి "ఇదే నాకు అనుకూలమైన నివాసము" అని అక్కడ నివసింపసాగారు. సిద్ధుల గురించి విన్న మదలేటప్ప అనే వైశ్యుడు, వారిని తన ఇంటికి తీసుకొని వెళ్ళి, అభ్యంగన స్నానం చేయించి, పట్టు వస్త్రములు కట్టబెట్టి, పూజించి, మెత్తని పరుపువేసి శయనింపజేశాడు. మరునాడు తెల్లవారకముందే సిద్ధులు వాళ్ళు కట్టబెట్టిన వస్త్రాలు అక్కడే విడిచి, తన పాత చింకిబట్టలు కట్టుకొని మళ్ళీ వచ్చి ఆ బావిలో కూర్చున్నారు. సిద్ధుల వైరాగ్యానికి అందరూ ఆశ్చర్యపోయారు.

ఇలా కొన్నిరోజులు గడిచిన తర్వాత క్షీరసాగరపు బసవణ్ణ అనే అతను సిద్ధుల వద్దకు వచ్చి, తమ ఇంట్లో యోగశిష్ఠ సద్బోధ ప్రారంభించమని వేడుకొన్నాడు. సద్గురువులు దానికి సమ్మతించి, అతనితో వెళ్ళి, శాస్త్రబోధ చేసి, మళ్ళీ బావికి వచ్చి చేరేవారు.

సిద్ధులు తమకు ఏకాంతం దొరకడం లేదని ఆ బావిని విడచి "డుమగేరి"కి వచ్చారు. అక్కడ చిద్ఘదానందస్వామి వారి సమాధిని చూసి, ఆనందంతో అక్కడే నివసింపసాగారు. గోపాలురతో కలిసి ఆటలాడుతూ, జనులకు లీలలు చూపుతూ, అడవిలోని పండ్లతో ఆకలి తీర్చుకొంటూ, రోజులు గడపసాగారు. పిల్లలతో కలిసి ఆడుతూ, వాళ్ళకు నేరేడు, జామ మొదలగు పండ్లు తెచ్చి పెట్టడం వారి దినచర్య. రాత్రిపూట శ్రీ చిద్ఘదానందస్వామి వారి సమాధి ప్రక్కన నిద్రపోయేవారు. ఒకరోజు గోపాలురతో కలిసి ఆడుతూ ఒకతోటలోకి వెళ్ళారు. ఒక పిల్లవాడు తోటలో పనసకాయ కోసుకొని పరుగెత్తాడు. తోటమాలి అదిచూచి వెంటబడ్డాడు. పిల్లలు పారిపోయారు. సిద్ధులు అతని చేతికి దొరికారు. తోటమాలి సిద్ధులను పట్టుకొని కొట్టసాగాడు. అదే సమయానికి కృష్ణాపురపు గురుపాదయ్య అనే అతను వచ్చి, విడిపించి, చాలా బాధపడుతూవుంటే, సిద్ధులు, "అయ్యా! జ్ఞానికి కర్మపాశము ఏదో ఒక నెపముతో తీరిపోవలసినది వున్నది. కృష్ణుడు తాను ఏ తప్పూ చేయకనే అపవాదుకు గురి కావలసి వచ్చింది. అట్లాగే నాకున్నూ!" అని అన్నారు.

కృష్ణాపురపు గురుపాదయ్య ద్వారా సిద్ధుల మహిమ అందరూ తెలుసుకొని, నిత్యమూ వారి వద్దకు వెళ్ళి శాస్త్రశ్రవణం చేయసాగారు. అది చూచి అసూయ చెందిన ఒక వ్యాపారి, ఎవ్వరూ లేని ఒక రాత్రి సమయంలో శ్రీ చిద్ఘదానందస్వామివారి సమాధి వెనుక పడుకొని వున్న సిద్ధులను చూచి "నీచాత్మా, నువ్వెవరు?" అని గద్దించి అడిగాడు. సిద్ధులు మాట్లాడక, మౌనంగా వుండటంతో, ఆ వ్యాపారి కోపంతో ఒళ్ళు తెలియకుండా నిందిస్తూ, సిద్ధులను పైకెత్తి, విసిరివేశాడు. సిద్ధుల మోకాలు, మోచేతులు చీరుకొని రక్తంకారసాగింది. అలా మెల్లగా ప్రాకుతూ తాను మొదట పడుకొన్న స్థలానికే వచ్చి గురుధ్యానంలో కూర్చున్నారు. సూర్యోదయం కాగానే

ఉజ్జిణ్ణభీమప్ప మొదలగువారు వచ్చి సిద్ధుల శరీరం మీద గాయాలు చూచి కలవర పడ్డారు. సిద్ధులు వారితో, "ప్రారబ్ధమనే ఫలముంటే దానిని నశింపచేయాలి. తన కర్మ క్షీణింపగా, త్వరితంగా విదేహముక్తి లభించే కాలమొస్తుంది" అని చెప్పారు. లక్కుండి గురప్ప, యరగల్ల బసప్ప, నాగప్ప, బసయ్యస్వామి వీరందరూ కలిసి సిద్ధులను ద్వాదశ బసవ మఠానికి తీసుకొచ్చి చికిత్స, సేవ చేశారు.

సిద్ధారూఢులు మళ్ళీ తాము నివసించే ప్రదేశానికి వచ్చి గోపాలురతో ఆటలాడుతూ నివసింపసాగారు. వారి కీర్తి విదియ చంద్రుని వలె దినదిన ప్రవర్ధమానం కాసాగింది. అది చూచిన లింగాయతులకు అసూయ ఎక్కువై వారంతా ఉడికి పోసాగారు. ఎవ్వరూ లేని సమయం చూచి ఒకడు సిద్ధులను తీసుకువెళ్ళి ఒక పాడుబడ్డ బావిలోనికి నెట్టివేశాడు. అది చూచిన ఒక గృహస్థు పరిగెత్తుకొంటూ వచ్చి అతి ప్రయాసతో సిద్ధులను బావిలోంచి బయటకు తీసాడు. శరీరానికి గుచ్చుకొన్న ముళ్ళన్నీ జాగ్రత్తగా తీసి, తలకు తగిలిన గాయాల రక్తం తుడిచి, ఆకుపసరు పిండి కట్టుకట్టాడు.

ఒక రోజు ఇద్దరు వ్యక్తులు సిద్ధులను తీసుకువెళ్ళి ఒక పాడుబడ్డ దేవాలయంలో నిలబెట్టి, "ఏరా! గోప్యంగా వుంచవలసిన అతి పవిత్రమైన శివ మంత్రాన్ని మాల మాదిగ మొదలగు వారందరికీ తేడా లేకుండా బోధించి, వారి నోటితో ఉచ్చరింప జేస్తావా? నీకు రోజులు ముంచుకొచ్చాయా? నోరు మూసుకొన్నావేమిటి? మాట్లాడు! నీవికమీదట నోటితో ఎప్పుడూ ఈ మంత్రాన్ని ఉచ్చరింపనని నీ గురువు మీద ప్రమాణం చేసి చెప్పు. లేకపోతే, ఇక్కడే ఇప్పుడే చంపి పారవేస్తాము" అని గద్దించారు. సిద్ధులు మౌనంగా వుండటంతో, వాళ్ళకి పైత్యం తలకెక్కి, మళ్ళీ కొట్టనారంభించారు. అంతలో బయట మనుష్యుల అలజడి కావటంతో వాళ్ళు సిద్ధులను లోపలే వుంచి తలుపు గడియవేసి వెళ్ళిపోయారు.

మర్నాడు అర్ధరాత్రి వరకూ ఆరూఢులు అక్కడే కూర్చుని వున్నారు. అప్పుడు పరమశివుడు ప్రత్యక్షమై, "బిడ్డా! నీవు నా అంశతో భూమి మీద అవతరించావు. నిజమైన తితిక్ష నీయందున్నది. నీ కర్తవ్యాన్ని నీవు విడువక నెరవేర్చు. నిన్ను నేను సదాకాపాడుతాను" అని సిద్ధుల శరీరాన్ని చేతితో నిమిరి అదృశ్యమైపోయాడు.

దానితో ఆరూఢుల శరీరంలోని నొప్పులన్నీ తగ్గిపోయాయి. అక్కడే నిర్వికల్ప సమాధిల
మునిగి పోయారు. ఇలా మూడు రోజులు గడిచిపోయాయి. ఒకరెవరో దేవాలయాని
వచ్చి తలుపు తెరిచి సమాధిలో వున్న సిద్ధులను చూచి భక్తితో ఉపచారాలు చేసి
పిమ్మట వారిని చిద్ఘదానందస్వామి సమాధి వద్దకు తెచ్చి, పాదాలంటి నమస్కరించి
ఆశీర్వాదం పొంది వెళ్ళిపోయాడు.

శ్రీ సిద్ధుల వద్దకు బాళికాయి చన్నప్ప, గుగ్గరి పరప్ప, గుఢ్డద శివప్ప, పరప్ప
శిరగుప్పి హెంబన్న, ఉప్పిన సిద్ధప్ప, దివటి తిప్పణ్ణ మొదలగువారంతా రోజు క్రమం
తప్పకుండా వచ్చి శాస్త్రశ్రవణము, భజన, మంగళ హారతి నెరవేర్చి వెళ్ళేవారు
వారందరూ నడుము కట్టి నిలబడి శ్రీచిద్ఘదానందస్వామి వారి సమాధి చుట్టూ పెరిగిన
గడ్డి త్రవ్వివేసి. అక్కడ రకరకాల పూలచెట్లును నాటి పెంచారు. హంబప్ప ఒక బా
త్రవ్వించాడు. నాగప్ప ఒక పంచవేయించాడు. ఈ విధంగా అందరూ పరమ భక్తిత
ఒక ఆశ్రమం ఏర్పాటు చేశారు. ఒక్కొక్క సారి అందరూ కూడి ఆశ్రమంలో వంటచేసి
సద్గురువులతో కలిసి భోజనం చేసేవారు.

ఈ విధంగా పెరుగుతూన్న సిద్ధాశ్రమ శోభ చూచి అసూయతో జంగముల
సభచేసి, "ఇక ముందు ఎవ్వరూ ఆ లింగంలేని సన్యాసి మఠానికి వెళ్ళకూడదు
అతనికి నమస్కరింపరాదు. ఈ నియమాన్ని ఉల్లంఘించిన వారు ప్రాయశ్చిత్తం
చేసుకోవాల్సి వుంటుంది" అని కట్టడి చేశారు. అయినప్పటికీ సద్భక్తులు ఆ నియమం
పట్టించుకోకుండా సిద్ధాశ్రమానికి వెళ్తూనే వున్నారు.

ఒక రోజు రాత్రి 3 గం॥ల సమయంలో హంద్రయ్య అనే ఒకడు పడుకొని
నిద్రపోతున్న సిద్ధులను లేపి, పైకెత్తి పడవేశాడు. వాడు కులమదంతో తన చెప్పు
సిద్ధుల తలమీద పెట్టి, "ఇది క్రింద పడితే చచ్చేటట్లు బాదుతాను" అని
యముడులాగా ముందు నిలుచున్నాడు. ఆ చెప్పు కొంచెం సేపట్లో క్రింద పడింది
హంద్రయ్య కోపంతో సిద్ధులను తిడుతూ ఒక కర్రతీసుకొని కొట్టనారంభించాడు
ఆరూఢులు అన్నిటికీ శివార్పణమంటూంటే వాడు ఆపి, "ఏరా నీచుడా! నువ్వు
సాధువువా? నువ్వు నిజంగా భేదరహితుడవైతే ఈ మద్యాన్ని తాగు" అంటూ తన

జేబులోవున్న సీసాతీసి, సిద్ధులకు త్రాగింపబోయాడు. సిద్ధులు త్రాగకపోవడంతో, కోపంతో మళ్ళీ కొట్టసాగాడు. ఆ మూర్ఖ జంగముని క్రూరత్వం చూచి తూర్పుదిక్కు ఎర్రబారింది. కరుణాసాగరులైన ఆరూఢులు ఆ దుష్టుని మీద కనికరంతో "నిజముగా నీవుట్లా గురువు వైనావు. నీ ఉపకారాన్ని నేనెన్నడూ మరువను. ఉపకారము చేసిన వారికి ప్రత్యుపకారము చేయకుండా ఉండరాదు. విను. ఇక తెల్లవారుతున్నది. ఊరిలోని జనం వచ్చే వేళయింది. వాళ్ళు నీ ఈ అమానుషకృత్యాన్ని చూస్తే నిన్ను ప్రాణాలతో ఉంచరు. కాబట్టి వెంటనే ఇక్కడ నుంచి పారిపో" అన్నారు. వాడు పారిపోయాడు.

ఒకరోజు సీగి పున్నమినాడు ఒక రైతు చేనుకు బలివ్వడానికి గాను తలమీద బుట్ట పెట్టుకొని, చేతిలో మండుతున్న పిడకను పట్టుకొని వెళ్తున్నాడు. అతడు హెగ్గేరి కట్టమీద కూర్చుని వున్న ఆరూఢులను చూచి పలుకరించగా వారు మాట్లాడలేదు. వాడికి కోపమొచ్చి, "నీ చేత మాట్లాడించడమెలాగో నాకు తెలుసు" అంటూ, ఆ మండుతున్న పిడకను వారి బోడితల మీద పెట్టి వెళ్ళిపోయాడు. ఒక భక్తుడు అది చూచి, పరుగున వచ్చి, ఆ నిప్పును పడద్రోసి, "స్వామీ! ఇది ఏమి భోగము!" అని కన్నీరు మున్నీరుగా విలపిస్తూంటే, సిద్ధులు నవ్వుతూ, "కొన్ని రోజుల క్రితం సర్పం నా తలమీద పడగవిప్పి ఆడుతూంటే నన్ను శేషధారినని అన్నారు గదా! అలాగే ఇప్పుడు అగ్నిధారినయ్యాను! అంతే!" అన్నారు. తర్వాత కొద్ది రోజులలో తలమీద వ్రణము లేచి ఆ రైతు మరణించాడు.

సిద్ధులు సిద్ధాశ్రమంలో వుంటూ భక్తుల కష్టాల్లో పాలుపంచుకొంటూ వారికి శాంతిని ప్రసాదించేవారు. భక్తుల అర్హతను పరీక్షించి, వారిని తగిన సేవలో నియమించే వారు.

ఇలా వుండగా ఒకరోజు ఉజ్జిణ్ణి భీమప్ప తన ధర్మపత్ని లక్ష్మమ్మను వెంట పెట్టుకొని సిద్ధసద్గురువుల సన్నిధికి వచ్చాడు. సిద్ధుల పాద పద్మములకు నమస్కరించి తమకొక బిడ్డను ప్రసాదింపుమని వేడుకొన్నారు. అప్పుడు సిద్ధులు మీ వంశాన్ని ఉద్ధరింప జేసే ఆత్మజ్ఞానియైన సత్పుత్రుడు కావాలా? లేక సంసారంలో అనేక వ్యధలు కలిగించే

కర్మరచితుడైన పుత్రుడు చాలునా? కోరుకోండి!" అన్నారు. ఆ దంపతులు దేవా మాకు జ్ఞానియైన సత్పుత్రుడే కావాలి" అన్నారు. అప్పుడు ఆరూఢులు "అలా అయితే నేను మీకు పుత్రుడనౌతాను. నన్నే మీ కులపుత్రునిగా భావించి పుత్రవాత్సల్యంతో కాపాడండి" అని సెలవిచ్చారు.

ఆ దంపతులు ఆనందభరితులై స్వామికి నమస్కరించి వారిని అతివైభవంగా తమ ఇంటికి తీసుకువెళ్ళి, నామకరణాది ఉత్సవాలు చేశారు. అది మొదలుకొని ప్రతిరోజు సూర్యాస్తమయం కావడంతోనే మంగళహారతిచ్చి, ఊరేగింపుతో సిద్ధులను ఉజ్జణ్ణ భీమప్పగారింటికి తీసుకొచ్చేవారు. అక్కడ సిద్ధ వీరప్ప మొదలైన వారంతా శాస్త్రశ్రవణానికి వచ్చేవారు. రాత్రికి వారింట్లో పడుకొని, వేకువజామున శివ భజనతో మంగళహారతిచ్చి మఠానికి తీసుకొచ్చేవారు. ఇది ఒక సంప్రదాయమయింది. ఇతర ప్రదేశాల నుంచి భక్తులు మఠానికి వచ్చినప్పుడు మాత్రం సిద్ధులు అక్కడే వుండిపోయేవారు.

ఇంటిలో బాలుని వలె ఆడుకొనే సిద్ధుల చేష్టలను, వినోదాలను, హాస్యాలను వర్ణించసాధ్యంగాదు. లక్ష్మమ్మ భోజనం పెట్టినప్పుడు ఆ ఎంగిలి చెయ్యి ఆమె మడి చీరకు రాసేవారు. లక్ష్మమ్మకు మడి ఎక్కువ. ప్రతిరోజు మడితో వంటచేసి, దేవునికి నైవేద్యం పెట్టనిదే ఎవర్నీ ముట్టుకోనిచ్చేదికాదు. దేవుని నైవేద్యానికని వండిన దాన్ని ఎట్లాగో వచ్చి సిద్ధులు ఎంగిలి చేసేవారు. అదిచూసి ఆమె కోప్పడుతూండేది. ఈ విధంగా సద్గురు సిద్ధారూఢులు చిన్న పిల్లవానిలాగా ఆడే ఆట పాటలను భక్తులు చూసి "పూర్వకాలంలో పతివ్రత అమ్మవ్వ ఇంట్లో శంకరుడు ఆమె కొడుకులా ఆడిన ఆటలు పురాణాల్లో వినేవాళ్ళం. దాన్నిప్పుడు కళ్ళారా చూస్తున్నాం' అంటూండేవారు. అయితే యిది కొంతమందికి కంటగింపుగా వుండేది. లింగములేని సన్యాసిని తెచ్చి ఇంట్లో పెట్టుకొన్నారు అని చాలమంది ఉజ్జణ్ణగారింట్లో జరిగే ధార్మిక కార్యాలకు వచ్చేవారు కాదు. లక్ష్మమ్మ నీరు తెచ్చుకోవడానికి బావికి వెళ్తే ఆమె ముట్టుకోవడంతో నీరు మైలపడతాయని గుసగుసలాడేవారు. కొంతమంది నిష్ఠాపరులు ఉజ్జణ్ణగారిని కులంనుంచి వెలివేశారుకూడ. అయినా ఇవేమీ లెక్కచెయ్యక తమ స్వంత బిడ్డకన్న ఎక్కువ ప్రేమతో సిద్ధులను చూచుకొనేవారు ఆ దంపతులు.

పాతహుబ్లీలో గౌరీ ఉత్సవానికి నానా కలశాలతో ఒక అందమైన రథాన్ని తయారుచేశారు. కాని ఎవరి ఇంటి గౌరీదేవిని రథంలో కూర్చోబెట్టాలనే విషయం మీద పోట్లాటవచ్చి రెండేళ్ళుగా ఉత్సవం నిలిచిపోయింది. చివరకు ఒకరోజున ఊరిలోని పెద్దలందరూ చేరి, "ఉత్సవం నిలిచిపోతే ఊరికి కీడు జరుగుతుంది. మనము ఎవరి ఇంటి గౌరీదేవినీ రథంలో కూర్చోబెట్టవద్దు. శివుని అవతారమైన సిద్ధులనే రథంలో కూర్చోబెట్టి ఉత్సవం జరిపిద్దాం" అని నిర్ణయించారు. వాళ్ళలో కొందరు మంగళ వాయిద్యాలను ఏర్పాటు చేయడానికి ఒప్పుకొన్నారు. భీమప్ప అన్న సంతర్పణ కార్యక్రమాన్ని చేపట్టాడు. అందుకు తన ఇంట్లోవన్నీ అమ్మేశాడు.

సిద్ధులను ఊరేగింపుతో తీసుకొచ్చి, అలంకరించిన రథంలో కూర్చోబెట్టి స్వామివారికి పట్టువస్త్రాలు పూలమాలవేసి, నుదుట విభూతిరాసి, కస్తూరీ తిలకం పెట్టి పూజించారు. ముత్తైదువులు భక్తితో మంగళహారతి పాడారు. "పార్వతీపతి హరహర మహాదేవ", "శ్రీ సిద్ధారూఢ స్వామి మహారాజ్‌కీ జై" అనే జయ జయ ధ్వానాలతో రథాన్ని లాగారు. ఎంతో ప్రయత్నం మీదగాని కదలని ఆ రథం ఆరోజు దానంతటదే కదిలిందని అక్కడ ప్రత్యక్షంగా చూచిన వారు చెప్పారు.

ప్రారబ్ధానుసారం వచ్చే సుఖదుఃఖాలను శరీరానికి అప్పజెప్పి, తాను నిజమైన ఆనందాన్ని పొందేవాడు సాధువు. సిద్ధారూఢులు తమ శిరస్సు పైన కిరీటము వుంచి నప్పుడూ, నిప్పు తెచ్చి పెట్టినప్పుడూ గూడ సమభావంతో వుండటం చూచి సకల జనులూ ఆశ్చర్యానందాలలో మునిగిపోయారు.

తరువాత సిద్ధులను వైభవంగా సిద్ధాశ్రమానికి తీసుకువచ్చారు. కొందరు అన్న సంతర్పణ గావించారు. ఒకరు సిద్ధులకు పట్టు వస్త్రాలు సమర్పించి భక్తితో నమస్కరించారు. మరికొందరు ఛత్ర చామరాలు సమర్పించారు. కారడగి మల్లప్ప అనేవాడు అక్కడ వంటచేయడానికి అనువైన స్థలంలేదని మూడు చావిళ్ళను వేయించాడు.

మరికొద్ది రోజులలో ధాతు నామ సంవత్సరం వచ్చింది. దేశమంతట క్షామం వచ్చింది. తినడానికి తిండిలేక ప్రజలు మలమల మాడిపోతున్నారు. కొందరు కన్న

బిడ్డల్నికూడ అమ్ముకొని తమపొట్ట నింపుకొంటున్నారు. ఆ సమయంలో సిద్ధారూఢుం
ఆకలితో అలమటించిపోతున్న దరిద్ర ప్రజలకు స్వయంగా ఆయనే నిలబడి అన్నదాన
చేయించారు. సర్వదానాలలోకీ అన్నదానం శ్రేష్ఠమైనదనీ, అన్నదానం చేసినప్పుం
కలిగే తృప్తి మరేదానమువలనా కలుగదనీ సిద్ధులు బోధించడంతో ఎందరో భక్తుం
ముందుకువచ్చి, రోజుకొకరు చొప్పున అన్నదానం జరిపించారు.

ఇప్పుడు సిద్ధుల సమాధివున్న స్థానంలో ఒక చావడి ఉండేది. అక్కడ శాస్త్రబో
గావించే సిద్ధులు దానికి ఎదురుగా వున్న మరొక చావడిలో వంట చేసేవారు. క్షామ
వచ్చినప్పుడు అన్నదానం జరిగింది కూడ అక్కడే. ప్రతి సంవత్సరం కార్తీక మాసం
ఇదేవిధంగా అన్నదానం కొనసాగించాలని భక్తులు నిశ్చయించారు. ప్రతి సంవత్సర
కార్తీకశుద్ధ నవమి నుంచి అమావాస్య వరకు సప్తాహం జరిపి, ప్రాతఃకాలం
శాస్త్రశ్రవణమూ, మధ్యాహ్నం అన్న సంతర్పణ, సాయంకాలం కీర్తన, మహాపూజానంతర
అన్న సంతర్పణ జరిపించారు. గౌరీపూర్ణిమ రోజున అత్యంత వైభవోపేతంగా జరి
రథోత్సవంలో అసంఖ్యాకంగా భక్తులు పాల్గొనేవారు.

ఒకసారి ఈ ఉత్సవం కోసమై చేయించిన రథానికి తారాచువ్వ వల
నిప్పంటుకొని కాలిపోయింది. భక్తులంతా అది ఏ అరిష్టాన్ని సూచిస్తున్నదోన
భయపడుతూంటే సిద్ధులు ప్రసన్న వదనంతో "నిప్పు పడటం వలన ఏమైంది?
అని ప్రశ్నించారు. "మండి ప్రకాశమైంది" అన్నారు భక్తులు. అప్పుడు సిద్ధులు నవ్వుత
"ఆకాశము నుండి నిప్పుపడి ప్రకాశమగుట వలన శివుని ప్రకాశము సంవత్స
సంవత్సరానికీ అధిక మౌతుంది. మీరేమీ బెంగపడకండి" అని చెప్పారు. దాని
వారి చింత తొలగింది.

సిద్ధుల నిస్వార్థ నిరపేక్ష సేవా భావము, ఎల్లప్పుడూ తోటి మానవు
శ్రేయస్సునుగురించిన చింతన, సమబుద్ధి, సమచిత్తము, ఐక్యభావము జను
హృదయాలను ఆకర్షించుకొన్నవి. సర్వమతస్థులూ సిద్ధులలో తమ ఆరాధ్యదైవాని
చూచుకొనేవారు. వంటిమీద ఒక చిన్న కౌపీనము, బోడి తల, బక్క చిక్కిన శరీరము
సిద్ధులు కొందరకు సాక్షాత్తూ పరమశివుడే అయినారు. దోసిలియే భిక్షాపాత్ర

ఎటువంటి ఆశలేక తనను నమ్మివచ్చిన శిష్యుల కళ్యాణార్థమే ఆలోచించే సిద్ధులు జైన భక్తులకు జినుడూ అయినారు. సిద్ధుల వద్దకు వచ్చే భక్తుల సంఖ్య రోజురోజుకూ పెరిగి పోసాగింది. వారి కీర్తి హుబ్లీ పట్టణంలోనేగాక, చుట్టుప్రక్కల చాలదూరం వరకూ వ్యాపించింది.

సిద్ధుల ఖ్యాతి కొందరిలో అసూయాద్వేషాలు రగుల్కొల్పింది. సిద్ధులను తుదముట్టించనిదే తమకు శ్రేయస్సు కలుగదని కొందరు జంగములు నిశ్చయించుకొన్నారు. ఒక రోజు అమావాస్యనాడు అర్ధరాత్రి వేళ సిద్ధారూఢులను తీసుకురావడానికి నలుగురు వ్యక్తులను పంపారు. సిద్ధులకు కపట భయ భక్తులతో నమస్కరించి, మాపై దయవుంచి మఠానికి వచ్చి పాదపూజ, ప్రసాదాలు స్వీకరించి రావాలి" అని ప్రార్థించారు. సిద్ధులు ప్రసన్న వదనంతో లేచి నిలబడి బయటకు వచ్చి అక్కడ కూర్చొని వున్న ఒకనితో తాను కౌదీ మఠానికి వెళ్తున్నట్లుగా చెప్పి బయలుదేరారు.

మఠాన్ని సమీపిస్తూ ప్రమాదాన్ని గ్రహించిన సిద్ధులు "ఏమయ్యా! దీపమే లేదు మీ ఉత్సవం ఎక్కడ జరుగుతున్నది? ఏమిటీ మోసం?" అని అడిగారు. దానితో ఆ వంచకులు నానా దుర్భాషలాడుతూ నువ్వు త్రికాలజ్ఞానివైతే ఈ మాత్రం నీకు ముందుగా తెలియలేదా? నీకు పూజా? నీకు ప్రసాదమా? నీ అంగాలను ప్రసాదం చేసి ఆ దేవునికి సమర్పించి పెద్ద ఉత్సవం చెయ్యాలని నిన్ను తీసుకువచ్చాం" అని వికటంగా నవ్వసాగారు. సిద్ధులు నిశ్చల కంఠంతో "నరకమయమైన నా ఈ దేహాన్ని మీరు నరికి దేవునికి అర్పిస్తే నేను ధన్యుడను" అని చెప్పి, శివధ్యానంలో నిశ్చలంగా కూర్చున్నారు. వాళ్ళు పీకల వరకు సారాయి తాగివచ్చి సిద్ధులను చంపడానికి సన్నద్ధులై, అశ్లీలాలు మాట్లాడుతూ, సిద్ధులున్న గది సమీపానికి వచ్చారు. వారందరికీ ఆశ్చర్యమయింది. సిద్ధులు వాళ్ళకెదురుగా వచ్చి నిలుచున్నట్లు కన్పించింది. "గదిలోపల పెట్టి, గడియ వేసివచ్చాము కదా ఇతడెలా బయటికి వచ్చాడని ఆశ్చర్యపోతున్నారు. అంతకంటే ఆశ్చర్యకరంగా ఒక్కొక్కరికి తమ ఎదుట ఒక సిద్ధారూఢులున్నట్లే కన్పించసాగింది. సిద్ధులేనని తలచి, తమ సహచరులను తామే

చితక బాదుకోసాగారు. "నన్నెందుకు కొడుతున్నావురా" అని అరిచినా తాగిన నిషా
విన్పించుకొనకు చేతులలిసిపోయే దాకా కొట్టసాగారు. అందరి ఒళ్ళు దెబ్బల
హూనమైపోయింది. ఒకడా దెబ్బలకు ఓర్చుకొనలేక పారిపోతుంటే ఒక పాము వా
కాలికి చుట్టుకొని కరిచింది. "చచ్చానురా!" అంటూ వాడు నేలమీద ప
కొట్టుకుంటున్నాడు. అదిచూచి, మిగతావాళ్ళు కూడ భయంతో పారిపోయారు.

అక్కడ సిద్ధాశ్రమంలో భక్తులు వచ్చి సిద్ధులు కొదీ మఠానికి వెళ్ళిన విషయ
విని, అందులో మోసముందని అనుమానించి వెంటనే వారంతా పరుగు పరుగు
కొదీ మఠానికి వచ్చారు. లోపలికి వచ్చి చూడగా సిద్ధులు నిర్వికల్ప సమాధిలో వున్నార
పాము కరిచిన వాడు విలవిల్లాడుతూ ప్రక్కనే పడివున్నారు. భక్తులు జరిగినదంత
తెలుసుకొని ఈశ్వరుని అగాధలీలను కొనియాడుతూ, సిద్ధులకు నమస్కరించి తిరి
మఠానికి వెళ్ళిపోదామని సిద్ధులను తొందర చేశారు. సిద్ధులు, "విలవిల్లాడుతూ
పడివున్న వీడిని ఇలా విడిచి ఎలావచ్చేది?" అని పంచాక్షరీ మంత్రం జపిస్తూ వాడిమీ
తమ అమృత హస్తాన్నుంచారు. వాడు శివ శివ అంటూ లేచి సిద్ధారూఢుల కాళ్ళమీ
పడి తన అపరాధాన్ని క్షమించమని వేడుకొన్నాడు. కరుణాళులైన సిద్ధులు వాడి
లేపి ఆశీర్వదించి, భక్తులతో కలిసి సిద్ధాశ్రమానికి వచ్చారు.

మరునటి రోజు ఈ సంగతి విని, భక్తులంతా ఖిన్నులయ్యారు. ఇకనుం
ఎప్పుడూ స్వామి వారిని ఒంటరిగా విడిచి పెట్టకూడదని నిశ్చయించుకొన్నారు. గూ
చన్నమల్లప్ప తాను స్వామి వారిని కనిపెట్టుకొని వుంటానని చెప్పి, అక్కడే సిద్ధాశ్రమం
లోనే నివసింపసాగాడు.

అజాత నాగలింగ స్వామిగా పేరు గాంచిన నవలగుంద నాగలింగ యో
ఒకగొప్ప మహాత్ముడు. మహిమాశాలి. సిద్ధులు నాగలింగ యోగిని శక్తి అవతారంగా
పేర్కొనేవారు. రాయచూరు జిల్లాకు చెందిన జావళగేరి అనే గ్రామంలో పుట్టి
నాగలింగప్ప చిన్న వయస్సులోనే ఇల్లు విడిచిపెట్టి ఊరూర తిరుగుతూ నవలగుందకు
వచ్చారు. అక్కడ నమగార భీమవ్వ అనే భక్తురాలి భక్తికి చిక్కి ఆమెకు కొడుకయ్యారు
ఆత్మజ్ఞానికి జాతి, కుల, మతములనేవి లేవని ప్రపంచానికి తన ఆచరణద్వార

చూపించారు. భక్తులు వారికి ఒక పల్లకి ఏర్పాటు చేశారు. నవలగుంద బోయీలు నాగలింగ యోగిని పల్లకిలో కూర్చోబెట్టుకొని తిప్పుతూండేవాళ్ళు.

ఒకసారి నవలగుంద వీధుల్లో వెళ్తూవున్న పల్లకిని శరీఫ్ సాహెబ్ చేత్తో పట్టి ఆపారు. ముందు నడుస్తున్న బోయీలు పల్లకీ కదలక పోవటంతో "ఏయ్! ఎవరది?" అని అరిచారు. ఆ బోయీలకు పల్లకీ పట్టుకొన్నది శరీఫ్ సాహెబ్ అని తెలియదు. దానికి శరీఫ్‌యోగి "అతనే ఇతను ఇతనే అతను" అని సమాధానం చెప్పారు. తాను, నాగలింగప్ప వేరుకాదని వారి భావం. పిమ్మట నాగలింగప్పతో "ఏయ్ నాగలింగా! నువ్విట్లా పల్లకీ ఎక్కి కూర్చుని మోయించుకోవడం తగదు" అన్నారు. వెంటనే నాగలింగప్ప "ఏయ్ శరీఫ్! ఎక్కినది ఎవరు? మోసేది ఎవరు? చెప్పు!" అని ప్రశ్నించారు. లీలా మూర్తియైన నాగలింగప్ప ఇలా ఊరూరు తిరుగుతూ భక్తులనుద్ధరిస్తూండేవారు. మహిమలు చూపుతూ వుండేవారు.

అది 1879-80 కావచ్చు. సిద్ధులు మండుటెండలో వట్టి కాళ్ళతో నడుస్తూ ఒక భక్తునిఇంటికి వెళ్తూవున్నారు. పల్లకిలో వెళ్తున్న నాగలింగ యోగి వారికి ఎదురయ్యారు. వెంటనే నాగలింగప్ప పల్లకినుంచి దిగి, "దేవతలను మోసపుచ్చి, కైలాసంనుంచి మర్త్యలోకానికి మానవావతారంలో వచ్చిన మహాశివుడే ఇతడ"ని కొనియాడుతూ సిద్ధుల వద్దకొచ్చి వారి శరీరం మీదవున్న వస్త్రాన్ని సర్రున లాగివేశారు. దాన్ని అయిదు పేలికలు చేసి ఒక పేలికను అగ్నికి అర్పించారు. ఒకటి వాయువుకు, ఒకటి ఆకాశానికి, ఒకటి నీటికి అర్పించారు. వేరొకటి మట్టిలో వుంచారు. ఈ విధంగా ఆ అయిదు ముక్కలను పంచభూతాలకు అర్పించి, పిమ్మట తన వంటి మీదనున్న తెల్లని జరీ శాలువా తీసి అత్యంత ప్రీతితో సిద్ధులకు కప్పారు. అదిచూసి సిద్ధులు "సదయా! కూర్చున్నదెవరు? నిల్చున్నదెవరు? సంతోషంతో దీన్ని కప్పుతున్న వారెవరు?" అన్నారు.

నాగలింగ యోగి ఈ చర్యకు అంతరార్థమేమైవుండవచ్చునో! పంచ భూతాలతో కూడిన ఈ సిద్ధుల శరీరం పంచభూతాలకు అర్పించబడిన తర్వాత కూడ వారి కీర్తి సూర్యచంద్రులువున్నంతకాలం ప్రకాశవంతంగా వెలుగుతూనే వుండగలదని సూచించడం కావచ్చునా?

అంతలోకి ఒక చమత్కారం జరిగింది. ఎక్కడ చూచినా నాగలింగప్పయే కన్పించసాగారు. చివరకు సిద్ధుల శిష్యుడొకడు, "స్వామి! మా గురువుగారు మాకు చెప్పకుండా ఎక్కడికి వెళ్ళారు?" అని నాగలింగప్పను అడిగాడు. నాగలింగస్వామి "అన్ని దిక్కులా అందరనూ కాపాడే సద్గురువులను నీవు తెలుకోలేదా?" అని అడిగి "మీ గురువుగారు విషజ్వరంతో బాధ పడుతున్న గురుశాంతప్పను మరణం నుంచి రక్షించడానికి వెళ్ళివున్నారు. మీ గురువుగారు ఇప్పుడే తిరిగివస్తారు" అని చెప్పారు. అంతలో చూస్తే సిద్ధులు అందరి మధ్యనే వున్నారు.

తర్వాత సిద్ధులు తనను పిలిచిన భక్తుని ఇంట ప్రసాదం స్వీకరించడానికై వచ్చియున్నారు. అక్కడ భోజన కార్యక్రమం సక్రమంగా జరిగింది. నాగలింగప్ప అక్కడ ప్రత్యక్షమై ఆ ఇంటిలో నుంచి రెండు ఉన్ని వస్త్రాలు తెచ్చి పేదలకు పంచి పెట్టసాగాడు. ఇంటి యజమాని అది చూచి కోపంతో కొట్టబోయాడు. సిద్ధులతనిని వారించి "ఏమిటయ్యా ఇది? సాధువర్యులను కొడితే నీ వంశమే నాశనమౌతుంది. నీ అదృష్టం వలన కల్గిన సదవకాశమిది. నాగలింగ స్వామి కృపాబలం వల్ల త్వరలో నీకు ఒక పెద్ద ఉన్ని అంగడి స్థాపించుకొనే స్తోమత వస్తుంది" అని బోధించడంతో, పశ్చాత్తాపపడి, నాగలింగస్వామి చరణాలకు ప్రణమిల్లాడు.

ఈ విధంగా మహాయోగీశ్వరుల చేతనే పరమశివుని అవతారంగా కొనియాడబడిన సిద్ధారూఢుల కీర్తి దశదిశలా వ్యాపించి ఎందరో ముముక్షువులు వారి చెంతకు వచ్చి చేరారు.

ప్రముఖ స్వాతంత్ర్యయోధులైన శ్రీబాలగంగాధర తిలక్ ఒకసారి హుబ్లీ వచ్చారు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం హుబ్లీ మునిసిపల్ సరిహద్దులోపల తిలక్ మీటింగ్ పెట్టకూడదనీ, ఉపన్యాసమివ్వకూడదనీ ఆంక్షపెట్టింది. అందువలన మునిసిపల్ సరిహద్దు అవతల మీటింగ్ పెట్టడానికి తీర్మానించారు దేశభక్తులు. అయితే ఈ సభకు అధ్యక్షులెవరు? అనే చర్చ వచ్చింది. తిలక్ మహాశయుని సభకు అధ్యక్షత వహిస్తే తమను బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేస్తుందేమోనని ప్రతివారికీ భయం. అందువలన అధ్యక్షత వహించడానికి ఎవరూ ముందుకు రాలేదు. అటువంటి

పరిస్థితుల్లో కొందరు సిద్ధారూఢుల వద్దకు వెళ్ళి విషయం విన్నవించుకొన్నారు. సిద్ధులు సంతోషంగా ఒప్పుకొన్నారు. "నేను సన్యాసినైతే మాత్రమేమి? నేనూ ఈ దేశప్రజల్లో ఒకడినే. అంతశ్శత్రువులను జయించడమొక్కటే సన్యాసి కర్తవ్యంకాదు. అతడు బాహ్యశత్రువులను కూడా ఎదుర్కొనవలసివున్నది. ముప్పైకోట్ల ప్రజల స్వాతంత్ర్యం కోసం తిలక్ తనను తాను అర్పించుకోగాలేనిది, ముందూవెనకా ఎవరూలేని ఈ సన్యాసికి భయమెందుకు? నాకు ఎవరి భయమూ లేదు. ఎవరి ఆంక్షలనూ లెక్కబెట్టను. నాకు మఠమైనా, జైలైనా ఒక్కటే - పదండి" అన్నారు.

అలానే గాంధీజీ హుబ్లీకి వచ్చినప్పుడు కూడ సిద్ధులే అధ్యక్షత వహించారు. అయితే అప్పుడు కార్యకర్తలకు ఒక సమస్య ఎదురైంది. "గాంధీజీ సభకు అధ్యక్షత వహించేవ్యక్తి ఖాదీవస్త్రాలే ధరించాలి గదా మరి కావి బట్టలు ధరించే సిద్ధులు దీనికి ఒప్పుకొంటారో లేదో!" అని. చివరికి వారంతా వెళ్ళి సిద్ధులకే విన్నవించుకొన్నారు. "అయ్యా! మనిషి యోగ్యత కట్టుకొన్న బట్టను బట్టి వస్తుందా? నాకు ఇటువంటి వస్త్రమే కట్టుకోవాలన్న నియమమేమి లేదు. భక్తులు కావి తెచ్చికట్టబెట్టారు. కట్టుకొన్నాను. ఇప్పుడు మీరు ఖాదీ తెచ్చి కట్టబెడితే, అదేకట్టుకొంటాను" అన్నారు. ఆ విధంగా ఖాదీబట్టలు కట్టుకొని సిద్ధులు గాంధీజీ సభకు అధ్యక్షత వహించారు. ఆనాటి ఫోటోలు కూడ కొన్ని గ్రంథాల్లో ముద్రితమై యున్నవి.



# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 6

ఒకరోజు సిద్ధారూఢులు శిష్యులకు శాస్త్ర శ్రవణం చేయిస్తూ వుండగా ఒక యువకుడు వచ్చి భక్తి శ్రద్ధలతో సిద్ధుల పాదాలకు నమస్కరించాడు. సిద్ధులు 'నీవెవరు?" అని ప్రశ్నించారు. దానికతడు వినమ్రంగా "తండ్రీ! నేను ఎవరు అనేది నాకు తెలియదు. అది తెలుసుకోవడానికే తమ సన్నిధికి వచ్చాను" అని విన్నవించుకొన్నాడు. ఒక్క చూపులోనే సిద్ధులతడు నిజమైన ముముక్షువని గ్రహించారు. కానీ, మరికొంత పరీక్షింపదలచి పైకి ఉపేక్షా భావం వహించారు. అతడు మఠంలోనే ఉండిపోయి, సిద్ధులసేవ చేయసాగాడు. మఠం చుట్టూ ప్రాంగణమంతా శుభ్రం చేసేవాడు. సిద్ధులు ప్రసాదం పెడితేనే తినేవాడు. లేకపోతే ఒక్క మెతుకు కూడముట్టుకొనే వాడు కాదు. అనంతరం శివమంత్రం జపిస్తూ తన పనులు చూచుకొనేవాడు. చివరికా యువకుడు సిద్ధుల మనస్సును గెలిచాడు. సిద్ధులతని దాసబుద్ధికి మెచ్చి, కబీరు దానని పేరు పెట్టారు. అతని సంస్కృత పాండిత్యం సిద్ధులకు సంతసం కల్గించింది.

ఆ కాలంలోనే మరికొందరు ముముక్షువులు సిద్ధుల వద్దకు వచ్చిచేరారు. వారిలో సిద్ధావధూత ముఖ్యుడు. ఇంకా వరణప్ప, గోవింద స్వామి, శివపుత్రప్ప, దేవేంద్రప్ప, చన్న మల్లప్ప, బసయ్య, గుండాగురు, ఉద్దండప్ప, గోపాలప్ప, రామయ్య మొదలైన వారు కూడా వచ్చి స్వామి సేవలో నిమగ్నులయ్యారు.

కబీరుదాసు ముస్లిం అయినప్పటికీ సంస్కృత భాషలో మంచి పాండిత్యం వుంది. సంగీతంలో కూడ ప్రావీణ్యం వుంది. సంగీత పాటకులు సిద్ధుల సమక్షంలో కచ్చేరి చేసి, సిద్ధుల ఆశీర్వాదం, కబీరు మెప్పు పొందాలని వచ్చేవారు.

కబీరుఆదోని జాగీర్దారు పుత్రుడనీ, హైదరాబాద్ నిజాంకు దగ్గర సంబంధీకుడనీ అంటారు. కబీరు పదివేళ్ళకూ పది వజ్రపుటుంగరాలుండేవి. చాలా ఖరీదైన వస్త్రాలు ధరించేవాడు. కొందరతనిని విలాససాధువనీ అనేవారు. కానీ, అతని అంతఃకరణము మాత్రము అతి స్వచ్ఛమైనది. ఎవరినైనా సరే, ఎంతో వినమ్రంగా 'దొరా' అని గాని, 'తల్లీ' అనిగాని సంబోధించేవాడు. కబీరు తన అలవాటు ప్రకారం

ఒక పెద్ద గుండిగెడు నీళ్ళుకాచి, అందులో అత్తరు వేసి స్నానం చేసేవాడు. కరువు కాలంలో సిద్ధులది గమనించి, "కబీరా! ఈ కరువులో జనానికి త్రాగేనీళ్ళు లభించక అలమటిస్తూ వుంటే నీవు ఇన్ని నీళ్ళు శరీరం కడుక్కోడానికి వృధా చేయవచ్చా? ఈ నీరు ఎంతమంది మనుషులకు, పశువులకు, త్రాగడానికి పనికి వచ్చేదోకదా!" అన్నారు. అంతే! అప్పటి నుండి కబీరు ఒక్క చెంబు నీళ్ళుకూడ వంటి మీద పోసుకోలేదు. అంతటి వజ్రనిష్ట కబీరుది.

ఒకసారి ఒక పండితుడు మఠానికి వచ్చాడు. "సిద్ధారూఢ స్వామీ! మీరు బ్రహ్మము గురించి ఇంతగా చెప్తారు. బ్రహ్మము ఇట్లా ఉంటాడని మాకు చూపించలేరా?" అని అడిగాడు. ఆ సమయంలో కబీరు లోపల దిగంబరంగా స్నానం చేస్తున్నాడు. సిద్ధులు "కబీరా" అని పెద్దగా కేకవేసి పిలిచారు. శివ మంత్రం జపిస్తూ, దేహస్ఫురణే మరిచి స్నానంచేస్తూవున్న కబీరు చెవిన సిద్ధుల పిలుపు పడింది. వెంటనే "వస్తున్నాను స్వామీ" అంటూ ఆ చెంబు అక్కడ పడేసి పరిగెత్తుకు వచ్చి గురువు గారి ఎదుట నిలబడ్డాడు. సిద్ధులు అప్పుడాపండితునితో "బ్రహ్మమంటేఇట్లాఉంటాడు, చూడు" అని చెప్పారు.

సిద్ధుల కీర్తిని సాధుసత్పురుషుల నోట విని షోలాపూర్ నుంచి కిరే మఠపు పట్టపుస్వామి నిర్వాణప్ప అనువారు హుబ్లీకి వచ్చి చేరారు. అక్కల్‌కోట నుంచి శరణప్ప అనేమరొక సాధువు, మురగోడ నుంచి బాబా గర్దె అనే సాధువు సిద్ధులచెంతకు వచ్చారు. సిద్ధులు మఠంలో శిష్యులకు శాస్త్రవిషయాలు బోధించేవారు.

సిద్ధుల గురించి వినిన జమఖండి సంస్థానాధీశులైన అప్పాసాహెబ్ కుటుంబ సమేతంగా సిద్ధుల దర్శనానికి వచ్చారు. ఆ రోజుల్లో మఠానికి వెళ్ళడానికి ముళ్ళపొదలలో చిన్న కాలిబాట మాత్రమే వుండేది. మఠానికి వస్తూ దారిలో ఒక చిన్న పిల్ల, రాయి తగిలి ముందుకు పడగా, నుదుట పెద్ద గాయమై రక్తం స్రవించసాగింది. అది చూశారు సిద్ధులు. వెంటనే పరుగెత్తు కొటూ వచ్చి, తన భుజం మీద వున్న వస్త్రం చింపి, కట్టుకట్టి, ఉపచారం చేశారు. జమఖండి అప్పాసాహెబ్ మఠం వరకు మంచి రోడ్డు వేయించాలని నిశ్చయించుకొని, తామే స్వయంగా వుండి ఆ కార్యం నెరవేర్చారు.

సిద్ధులు తమ వద్దకు చేరిన ముముక్షువులందరకూ వారి వారి అర్హతను బట్టి శాస్త్రవిషయాలు బోధించేవారు. నిర్వాణప్పకు శ్రుతి ఆగమార్థాలతో శైవ సిద్ధాంతాన్ని, జయకృష్ణ అనే వానికి ముండకోపనిషత్తును, బాబాగర్డె అనేవానికి చాంధోగ్యోపనిషత్తును, తిరకప్పకు మాండుక్యోపనిషత్తును బోధించారు. పిమ్మట శిష్యులందరకూ ఒక్కొక్క గ్రంథాన్ని కన్నడంలోకి అనువదించడానికి అనుజ్ఞ ఇచ్చారు. బాబా గర్డె విద్యారణ్య కృత పంచదశిఅనే గ్రంథాన్ని, కబీరుదాసు సిద్ధారూఢుల చరిత్ర, దాని అంత్య భాగంలో దశోపనిషత్తు సారాన్ని కన్నడంలో రచించారు.

సిద్ధారూఢుల కీర్తి చంద్రుని వెన్నెలలాగ జగత్తు అంతా వ్యాపించింది. స్వామి వారి దర్శనానికి సంతభాస్గల్ స్వామి వారు, రంగస్వామి, బాలకదేవేంద్రుడు, అథణి మురగేంద్రస్వామి, శరణప్ప, ఆదయ్య, ఉద్దానయ్య మొదలగు అనేక సత్పురుషులు వచ్చి మఠంలో సేవచేయసాగారు.

ఒకరోజు శరీఫ్ సాహెబ్ అనే సాధువు వచ్చి మఠంలోని సుందరమైన ఉద్యానవనంలోకి వెళ్ళి, నాలుగైదు పువ్వులు కోసుకొన్నాడు. అది చూచి తోటమాలి శివయ్య "ఏమయ్యా! ఈశ్వరుని అగాధ సృష్టి రచనాత్మక చాతుర్యాన్ని చూపే పూవులను కోసి, సుగంధాన్ని ఆస్వాదించి, అరనిమిషంలో నలిపి పారవేయడం వివేకవంతులైన మీకు తగునా?" అని ప్రశ్నించాడు. దానికి శరీఫ్ "ఓహో, ఇక్కడ ఇట్లావున్నదా?" ఆరూఢులని పేరుగాంచిన సిద్ధులూ, వారి శిష్యులే ఇట్లా వుంటే ఇక మిగిలిన వారి సంగతేమిటి? సర్వభోగాలు భోగులకు కానీ, త్యాగుల భోగానికి కాదు" అన్నాడు. సిద్ధారూఢులది విని కూడా ఊరుకొన్నారు. శాస్త్రశ్రవణానికి అందరూ కూర్చున్నారు. సిద్ధులు శరీఫ్ సాహెబ్ తన తప్పు తెలుసుకొనేటట్లుగా బోధించడంతో అతడు పశ్చాత్తాప్తుడూ, జ్ఞానబోధతో అజ్ఞానము వదిలిపోగా, ఆరూఢుల పాదముల వద్ద రెండు కొబ్బరికాయలుంచి నమస్కరించాడు. సిద్ధులతనిని ఆశీర్వదించి ఒక కొబ్బరికాయ చేతిలో పెట్టబోయారు. శరీఫ్ "స్వామీ! నశించిపోయే శరీరమనే ఈ కాయలో లోపల బయట ఏమీ లేక చిదాకాశంలో తానే తానైగోచరించునట్లుగా, ఈ కొబ్బరికాయ లోపల వున్న నీరు, కొబ్బరి రెండూ లేకుండా చేసి నాకు ప్రసాదించవలసిందని వేడుకొన్నాడు. దానికి సద్గురువులు "అత్యంత క్షుద్రులు, విచారహీనులు ప్రదర్శించే గారడీ పనులివి. జ్ఞానులైన సత్పురుషులు తమ మహిమను చిన్న చిన్న ప్రతి పనికీ

ఎప్పుడూ ఉపయోగించరు. సరే! నీ గురువైన గోవిందస్వామికి ప్రాప్తించిన దేవీ ఉపాసనా బలాన్ని ప్రసిద్ధం చేయడానికి నీవే యోగ్యుడవు. కాబట్టి నీవే ఈమహిమను చేసి చూపించు! నీ గురువు కీర్తి నలుదిక్కులా వ్యాపిస్తుంది" అన్నారు.

వెంటనే శరీఫ్ అక్కడ వున్న కాయను తీసుకొని వాసన చూసి కొట్టారు. వట్టి కొబ్బరిపెంకు మాత్రం తునాతునకలై పగిలింది. మరొక కాయను తీసుకొని "కాయయే కన్పించకుండా పోవుగాక" అనగానే అది మాయమైపోయింది. ఈ రెండు సంఘటనలు చూసి అందరూ ఆశ్చర్యచకితులుకాగా, సిద్ధులు ఆ సిద్ధివెనుక వున్న అంతరార్థాన్ని బోధించారు.

పాత హుబ్లీ వాసులైన హలగూర గదిగప్ప, మల్లప్ప అనేవారు వారి మూడు ఎకరాల పొలాన్ని మఠానికి రాసి ఇచ్చారు. సిద్ధులు మఠ వ్యవస్థాపకులైన శిరగుప్ప హెంబప్ప, గుడ్డద శివప్పల పేర ఆ కాగితం వ్రాయించారు. కానీ తన పేరిట వ్రాయనివ్వలేదు. అట్లాగే ఒక శ్రీమంతుడు ఒక పొలాన్ని సిద్ధులకు ఇవ్వడానికి వచ్చాడు. సిద్ధులతనిని కూర్చోబెట్టి, "నీపొలం తీసుకొని నేనేం చేయను? అరకపట్టి వ్యవసాయం చేయనా? నీ పొలం నీదగ్గరేవుంచుకో, బాగా పండించు, అందులో కొంత భాగం దేవునికి అర్పించు. నీకు మేలు జరుగుతుంది" అని చెప్పి పంపించివేశారు. ఇంతటి వైరాగ్యమూర్తి అయిన సిద్ధులకు మఠపు ఆస్తి గురించి చివరికి విషంపెట్టారు హుబ్లీవాసులు.

సిద్ధారూఢులు సర్వజ్ఞమూర్తి. అసదృశమైన ఉపరతితో కూడిన ఆ వైరాగ్య మూర్తి సమీపానికి వెళ్ళడానికే జంకేవారు భక్తులు. వారి దర్శన, స్పర్శన, సంభాషణభాగ్యాన్ని అనుభవించిన భక్తులకు వారి పాదపద్మములను ఎన్నటికీ విడువరాదన్న బుద్ధి కలిగేది. సిద్ధులు సామాన్య మానవులు కారు. అవతారపురుషులు. వారి కన్నులలో గోచరించే అపూర్వ కారుణ్యాన్ని చూచి భక్తులు అప్రయత్నంగానే ఆకర్షింపబడేవారు. "సిద్ధులు మహాస్వామి యైనప్పటికీ వారెప్పుడు పీఠంమీద కూర్చుని భోజనం చేయలేదు. ప్రసాద సమయానికి వారు ఏదో ఒక విస్తరి ముందు కూర్చుని ఒక ముద్ద తినేవారు. వారి చేతి ప్రసాదం కోసం భక్తులు వేచికూర్చునేవారు. వారు ముట్టుకొన్నదే అమృతమయ్యేది". అని శ్రీ నాగభూషణ స్వామి చెప్పారు. వారు మఠం యొక్క లౌకిక, భౌతిక వ్యవహారాల్లో ఎప్పుడూ వేలుపెట్టలేదు.

భక్తులు అధిక సంఖ్యలో రావడంతో మఠంలో చోటుసరిపోక పోయింది. 1889లో గౌరీ పున్నమి ఉత్సవానికి వెదురుతో చేసిన ఒక రథాన్ని కట్టించారు. కాని ఆ రథం లాగడానికి అక్కడ తగినంత చోటు లేదు. ఊరి పెద్దలంతా చేరి అక్కడ స్థలాన్ని కొనడానికి ఆలోచిస్తూ వుంటూ సిద్ధులు వారితో "శివనామస్మరణ జరగాలి. వచ్చిన భక్తులకు అంత ప్రసాదం లభించాలి. వారికి తమ నిజతత్వం తెలిసి, ముక్తాత్ములు కావాలి. దీనికిఏమి అవసరమో అవి మీరే చేయండి. తక్కిన లౌకిక విషయాలను నా చెవి వరకూ తీసుకరావద్దు" అని చెప్పారు.

భక్తులు పున్నమికి సిద్ధులను రథం మీద కూర్చోబెట్టి, ఉత్సవం జరిపించేవారు. ఈ విధంగా కొంత కాలం ఉత్సవం వైభవంగా జరిగింది. 1902లో ప్లేగు వ్యాపించటంతో ఉత్సవం సంక్షిప్తంగా ముగించారు. 1904 నుంచి గౌరీ పున్నమికి బదులుగా శివరాత్రికి ఉత్సవం ప్రారంభించారు.

మఠంలో జరిగే ధార్మిక కార్యాలన్నిటిలో నిమగ్నులైనట్టుగా వున్నప్పటికీ సిద్ధులు అప్పుడప్పుడు బయటకు వెళ్ళిపోయి గొడ్లకాపరులతో కలిసి ఆటలాడుకొంటూ వుండేవారు. తిరిగి మఠానికి వచ్చేవారు కాదు. భక్తులు వారిని వెదుక్కుంటూ వెళ్ళి, తిరిగి మఠానికి తీసుకురావలసి వచ్చేది. అడవిలో ప్రశాంత వాతావరణంలో సిద్ధులు ధ్యానస్థులై కూర్చునేవారు. అది గమనించిన భక్తులు వారి ధ్యానానికి అనుకూలంగా ఒక సమాధి మందిరాన్ని కట్టించాలని తలచి, ఈ కార్యం చేపట్టారు. 1896లో ప్రారంభమైన సమాధి మందిరము1906 పూర్తయింది.

సిద్ధులలో జ్ఞానము, సిద్ధి రెండూ ప్రకటమయ్యేవి. కోపమనేది ఏమిటో తెలియదు. తనను నమ్మి వచ్చిన భక్తులను ఉద్ధరించటం ఒక్కటే వారికి తెలిసింది. పేదలూ, ధనికులూ, సామాన్యులు, రాజులూ, మూఢులు, జ్ఞానులూ, అమాయకప్రజలూ, మహాత్ములూ, దార్శనికులూ, సాధువులూ, అందరూ సిద్ధుల వద్దకు వచ్చేవారు. వచ్చిన వారు తమను తాము మరిచి, సిద్ధులకు పాదాక్రాంతులయ్యేవారు. సిద్ధులు వారి బాహ్యశరీరాన్ని చూచేవారు కాదు. వారి లోపలి జీవాత్మను గుర్తించేవారు. ఎవరికి ఎటువంటి ఔషధం ఇవ్వాలో వారికి తెలుసు. వారి వారి స్థితిని బట్టి వారి వారికి తగిన విధంగా బోధించేవారు. వారి నెలవుతో హుబ్లీ కైలాసమే అయింది.

సిద్ధుల వాక్కు అమృత వాక్కు, బొంబాయిలో ఒక శ్రీమంతుడుండేవాడు. అతనికి చాలా కాలం వరకు పిల్లలు లేక ఎందరో దేవుళ్ళకు మొక్కుకొని ఎన్నో ధర్మకార్యాలు చేసిన తర్వాత చివరకు ఒక కొడుకు పుట్టాడు. జ్యోతిష్కులా శిశువు జనన చక్రంవేసి, అతడు మూలానక్షత్రంలో పుట్టడం చేత తల్లిదండ్రులకు మరణం తప్పదని చెప్పడంతో, వారు దిగులు చెంది దిక్కుతోచక వున్న సమయంలో ఒక సాధువు, వారి ఇంటికి వచ్చి, హుబ్లీలోని శ్రీ సిద్ధారూఢుల దర్శనం చేసుకొంటే ఆపద గట్టెక్కుతుందని చెప్పాడు. ఆ శ్రీమంతుడు వెంటనే బయలుదేరి సిద్ధారూఢుల దర్శనం చేసుకొని, బిడ్డను వారి పాదాల మీద వుంచి కాపాడమని వేడుకొన్నారు. సిద్ధులా బిడ్డమీద అభయహస్తముంచి "ఈ బిడ్డ వలన మీకు శుభమే జరుగుతుంది. మీ వంశాన్ని ఉద్ధరిస్తాడు" అని ఆశీర్వదించారు. ఆ ధనిక దంపతులు సిద్ధుల సేవలోని కొంతకాలం వున్నారు. జ్యోతిష్కులు చెప్పిన పీడ తొలిగిపోయింది. వారి ఆనందం అనిర్వచనీయం. ఆ శ్రీమంతుని హృదయం సిద్ధుల పట్ల భక్తి భావంతో నిడిపోయింది. అతని ద్వారా సిద్ధుల కీర్తి బొంబాయి నగరమంతా వ్యాపించింది.

మొదట మఠంలో కొందరు భక్తులు భిక్షకు వెళ్ళి భిక్షాన్నం తెచ్చేవారు. సిద్ధులకు ఆ భిక్షాన్నమే పరమాన్నము. ఒక్కొక్కసారి ఎవరైనా సిద్ధులను తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించినా, వెళ్ళేముందు మఠంలో తగిలించివుండే జోలిలో నుండి ఒక చిన్న రొట్టె ముక్కను నోట్లో వేసుకొని మరీ బయలుదేరేవారు. అది చూచిన ఒక శిష్యుడు "స్వామీ! వారు మృష్టాన్నం పెట్టడానికి మిమ్మల్ని తీసికెళ్తూవుంటే మీరు ఈ భిక్షాన్నాన్నెందుకు నోట్లోవేసుకొంటారు?" అని అడిగాడు. దానికి సిద్ధులు "పెట్టేవాళ్ళు తమకిష్టమైతే పిలిచి భోజనం పెడతారు. లేకపోతే బయటకు వెళ్ళగొడతారు. ఇది తాత్కాలికం. కానీ భక్తులు పెట్టే ఈ భిక్షాన్నం నిత్యమైనది. చిరకాలం వుండేది" అని చెప్పారు. ప్రసాదానికి వెళ్ళేటప్పుడు సిద్ధులు ఏ వాహనమూ ఎక్కేవారు కాదు. సిద్ధులు ఎప్పుడూ చెప్పులు వేసుకొనే వారు కాదు. మేళతాళాలతో తీసికెళ్ళడానికి ఒప్పుకొనే వారు కాదు. ప్రసాదంస్వీకరించే ఇంటికి సరిగ్గా సమయానికి వెళ్ళేవారు. "మహాదేవి జయిసు" అంటూ ప్రసాదం స్వీకరించేవారు. ఇంటిలోని వారందరిని పిలిచి ఒక్కొక్కరి నోటిలో ఒక్కొక్క ముద్ద ప్రసాదం పెట్టేవారు. ఇట్లా అక్కడ వున్నవారందరికీ ప్రసాదం పెట్టిన తర్వాత గంగాళంలో మిగిలిన దానిలో ఒక్క ముద్ద తాము తినేవారు.

ఒకసారి సిద్ధులు బొమ్మపుర చౌక్‌లో మురగోడ మారంతప్ప అనే భక్తుని ఇంటికి ప్రసాదం స్వీకరించడానికి వెళ్ళారు. ఆ ఇల్లాలు సిద్ధుల కోసమని అప్పుడే వెన్నకాచి ఘుమఘుమలాడుతున్న నేయి తెచ్చి వేయబోయింది. సిద్ధులామెతో "తల్లీ! స్వామి అయిన వాడు జిహ్వకు దాసుడు కాకూడదు. ఏది తింటే మాత్రం ఏమౌతుంది? పదార్థము నాలుక మీద వున్నప్పుడే రుచి తెలిసేది. లోపలకు వెళ్ళిన తర్వాత ఏమౌతుంది? అన్నీ ఒక్కటే! పొట్ట అంటే ఏమిటి? అది ఒక అంటుపాత్ర" అని చెప్పారు.

ఒకసారి దీపావళిరోజున వ్యాపారస్థులు తమ కొట్లలో లక్ష్మీపూజ చేయించుకోవడానికి సిద్ధులను తీసుకువెళ్ళారు. ఒకరి తర్వాత ఒకరు వాళ్ళవాళ్ళ కొట్లకు తీసుకువెళ్ళి పూజ చేయించుకొని, సిద్ధుల ఒడిలో రూపాయలు దక్షిణగా సమర్పించారేగానీ, మధ్యాహ్నమైనా వారి భోజనం గురించి ఎవరూ పట్టించుకోలేదు. సాయంత్రానికి అన్ని చోట్లా పూజ ముగించి, సిద్ధులు మఠానికి తిరిగి వచ్చారు. వంట ఇంట్లోకి వెళ్ళి అక్కడ కూర్చుని వున్న రాచప్పతో "రాచ్చా, చెత్తకుప్పలో నిప్పు పడింది" అన్నారు అమాయకుడైన రాచప్పకు ఏమీ అర్థంకాలేదు. "ఏ కుప్ప? ఎక్కడ నిప్పు పడింది? అని ఆదుర్దాగా లేచి వస్తున్న రాచప్పతో సిద్ధులు తమ పొట్టను చూపిస్తూ "ఈకుప్పలో నిప్పుపడింది" అన్నారు నవ్వుతూ. సిద్ధులకు ఆరోజు ఎవరూ ప్రసాదం పెట్టలేదని అర్థం చేసుకొని రాచప్ప, "స్వామీ ఒక్క నిమిషంలో రొట్టెచేసుకొని తీసుకువస్తాను" అని లోపలకు వెళ్తూ వుంటే ఆపి, అక్కడ ఒక మూలవున్న చద్దిఅన్నం చూపిస్తూ అది చాలునన్నారు సిద్ధులు. "దేవా అది చద్ది అన్నము, పాచిపోయింది. క్షణంలో రొట్టె చేసుకొని తెస్తాను" అన్న రాచప్పతో "రాచ్యా! చెత్తకుప్పలో పడ్డనిప్పు ఆర్పడానికి శుభ్రమైన నీరే అక్కర్లేదు. మురికినీరైనా పనికి వస్తుంది. ఈ అన్నమే ఇప్పుడు నాకు ప్రసాదం. అదేచాలు" అని పిడికెడు అన్నం తీసుకొని తిన్నారు. దానితోనే వారి ఆకలి తీరిపోయింది.

సిద్ధుల పాదధూళి సోకినంతనే ఐశ్వర్యవంతులౌతారనీ, వారి హస్తప్రసాదంతో దారిద్ర్యం పరిహరింపబడుతుందనీ భక్తులు దృఢంగా నమ్మేవారు. శ్రీమంతులు పిలిచినా, కడుపేదలు పిలిచినా సిద్ధులు వెళ్ళేవారు. ఒకసారి ఒక పేదరాలు భక్తితో సిద్ధులను తన ఇంటికి ప్రసాదానికి ఆహ్వానించింది. ఆహ్వానిస్తూనే, "స్వామీ! నేను

కడుపేదరాలిని. మీతో పాటు ఒకరిద్దరి కంటె ఎక్కువ మందివస్తే, నా శక్తి చాలదు' అని విన్నవించుకొన్నది. సిద్ధులు సరేనన్నారు. మర్నాడు ప్రసాదసమయానికి సిద్ధులు ఇద్దరు శిష్యులను మాత్రమే వెంటతీసుకొని బయలుదేరారు. దారిలో మరికొందరు కలిశారు. తీరా ఆమె గుడిసెకు చేరేసరికి నలభై మంది అయ్యారు. అంతమంది జనాన్ని చూసిన ఆమె కలవరపడిపోయింది. తాను వండింది నలుగురికి. నలభై మందికి ఎట్లా పెట్టగలదు? తన పరువు పోవడానికే వచ్చింది అనే ఆలోచనతో భయంతో ఆమె సిద్ధులను లోపలికి ఆహ్వానించడమే మరిచిపోయి "ఏమయ్యా సన్యాసీ! నేను నీకు చెప్పిందేమిటి? నీవు చేసిందేమిటి?" అని గట్టిగా అడిగింది ఇంటికి వచ్చిన మహాదేవుని లోనికి ఆహ్వానించడంపోయి, ఏం చెయ్యాలో తోచని అస్తవ్యస్తమైన మనస్సుతో వాకిట్లోనే నిలుచుంది. సిద్ధులే ముందుకు వెళ్ళి "తల్లీ ప్రసాదం తయారు చేశావా?" అని అడిగారు. ఆమె కోపం ఇంకా చల్లారలేదు. "అదుగో, వండి అక్కడ పెట్టాను" అన్నది ప్రసాదం పెట్టు, రమ్మని అన్నా, ఆమె అక్కడ నుంచి కదలలేదు. "అక్కడ వండి పెట్టాను. నువ్వేంచేస్తావో చెయ్యి" అన్నది కోపంగా.

సిద్ధులు భక్తులందరినీ ఆ గుడిసె ముందు ప్రాంగణంలో కూర్చోబెట్టి లోపలకు వెళ్ళి "మహాదేవి జయిసు" అంటూ ఆ వంటకాల మీద అభయ హస్తాన్నుంచారు. కూర్చున్న భక్తులనోటిలో సిద్ధులే ఒక్కొక్కరికి ఒక్కొక్క ముద్ద ప్రసాదం పెట్టారు. ఆ ఒక్క ముద్దతోనే వారి ఆకలి తీరిపోయి, తృప్తులయ్యారు. "ఇంతటి రుచికరమైన భోజనం ఇంతవరకెప్పుడూ తినలేదు. ఈ తల్లి చేతి ప్రసాదం అమృతం" అంటూ అందరూ ఆమెను పొగడసాగారు. అందరికీ పెట్టిన తర్వాత ఆ పాత్రను ఆ ఇల్లాలు ముందుంచారు. వండిన దానిలో సగం కూడ ఖర్చుకాలేదు. "తల్లీ, సిద్ధుని ప్రసాదం నువ్వు స్వీకరించు" అంటూ ఆమెకు కూడ తినిపించారు. అది అమృతమే! "తండ్రీ! నేను నోటి కొచ్చినట్లు మాట్లాడాను. క్షమించు దేవా!" అంటే ఆమె సిద్ధుల కాళ్ళమీద పడింది. సిద్ధుల చేతిలో అన్నపూర్ణేశ్వరి నెలకొని వున్నది.

శివరాత్రి ఉత్సవాలకు లక్షల సంఖ్యలో జనం వచ్చేవారు. రోజుకు 50 బస్తాల బియ్యం వండేవారు. రోజుకు పది బస్తాల ఉప్పు ఖర్చు అయ్యేదంటే, ఇక అక్కడ ఎంతమందికి అన్నదానం జరిగేదో ఊహించవచ్చు. అంతమంది భక్తులకు ప్రసాదం తయారు చేసే భక్తుల మనోభావం ఎంతటిదో, వారి భక్తి ఎంతటిదో! ఎందరు నీరు

తెచ్చేవారో, ఎందరు వంటచేసేవారో, ఎందరు పాత్రలు తోమేవారో! అంతా పద్ధతి ప్రకారం జరిగిపోయేది. సిద్ధులు ఎవ్వరికీ "ఆ పనిచెయ్యి! ఈ పనిచెయ్యి!" అని చెప్పి ఎరుగరు. ఉత్సవం రెండు నెలలు వుండనగానే పనులు ప్రారంభమయ్యేవి కట్టెలు తెచ్చివేసేవారు. సిద్ధులు ప్రవచనం అయిపోగానే లేచి వచ్చి కట్టెలు భుజానికెత్తుకొని తీసుకెళ్ళి లోపల పెట్టేవారు. అంతటితో సిద్ధారూఢులే పనిలో దిగడంతో, మిగతా వారు ఊరకనే వుండగలరా? ధనికులు, పేదలు, రాజు అనే తేడా లేకుండా అందరూ పూనుకొనేవారు. బియ్యపు బస్తాలు, జొన్నలు వస్తే గూడ అంతే! వడ్లు దంపడానికి వచ్చిన స్త్రీలు జల్లిస్తూ, చెరుగుతూవుంటేఅటూ ఇటు పడిపోయిన ధాన్యాన్ని ఏరుతూ అక్కడే కూర్చునేవారు సిద్ధులు. అవి ఎత్తుతూ "సన్యాసి ధాన్యమని అంత అలక్ష్యం కూడదమ్మా! మీ ధాన్యమైతే ఇలా పారబోస్తారా?" అని మందలించేవారు.

ఒకసారి సిద్ధులు దివటి మల్లప్ప టాంగలో వెళ్తూ, రోడ్డుమీద పడివున్న ఒక ఎండుమిరపకాయను చూశారు. వెంటనే టాంగా ఆపించి, దిగి, ఆ కాయను తీసుకొని తమ ఉత్తరీయపు కొంగున కట్టుకొని భద్రంగా మఠానికి తీసుకువచ్చారు. రాచప్పను పిలిచి "రాచ్చా! నాకీ రోజు ఒక గొప్ప నిధి దొరికింది సుమా!" అని చెప్తూ ఆ కాయను తీసి వంటకుపయోగించమని ఇచ్చారు.

మఠంలో ప్రతిరోజూ వడ్లు దంపడానికి కొందరు స్త్రీలు వచ్చేవారు. వారిలో ఒకామెకు చాలా మంది మనుమలు. పేదరాలు. ఆరోజు ఆమె మనుమడు "అన్నం అన్నం" అని ఏడుస్తూంటే, రెండు దెబ్బలు వేసి వచ్చింది. మఠంలో రాసులుగా వున్న బియ్యం చూస్తూంటే, ఆ పిల్లవాని ఏడుపే మనసులో మెదిలి, ఎవరూ చూడకుండా రెండు దోసిళ్ళ బియ్యం ఒడిలో కట్టుకొన్నది. అందరూ పనిముగించి వెళ్ళేటప్పుడు సిద్ధులకు పాదాభివందనం చేసి వెళ్ళడం ఆచారం. అలానే ఆమెకూడా వంగి నమస్కరిస్తూ వుంటే, ఒడిలో నుండి కొన్ని బియ్యం రాలి సిద్ధుల పాదాల మీద పడ్డాయి. ఆమె భయంతో వణికిపోతూ జరిగిన సంగతంతా చెప్పి, తన అపరాధాన్ని క్షమించమని పరిపరి విధాల వేడుకొన్నది. సిద్ధులు శూన్యంలోకి చూస్తూ వున్నారు. వారి కళ్ళెదుట ఆమె దారిద్ర్యమే కన్పిస్తున్నది. ఆమెను లేవనెత్తి "తల్లీ దారిద్ర్యమనేది చాల చెడ్డది. మనస్ఫూర్తిగా గురుసేవ చేసే మీకు దారిద్ర్యం వుండకూడదు. ఆకలి

దరిద్ర్యం, మీ దగ్గరకే రాకూడదు. రా!" అని ఆమెను లోపలకు తీసువెళ్ళి ఒడినిండా బియ్యంపోసి, నీఇంటిలో సదా అన్నపూర్ణేశ్వరి విలసిల్లుగాక!" అని ఆశీర్వదించి పంపారు.

కైలాస మంటప నిర్మాణం జరుగుతున్న సమయంలో చాలా కొయ్యదూలాలు బయటనే వేసివున్నాయి. ఒకరోజు రాత్రి దొంగలు ఆ దూలాలన్నీ నాలుగు ఎడ్లబండ్లకెత్తుకొని తోలుకువెళ్ళిపోయారు. బిక్కూసింగు అనే భక్తుడు భారత్‌మిల్లు సమీపంలో వాటిని చూచాడు. బిక్కూ సింగు రైల్వే పోలీసుగా పనిచేసి రిటైరైనాడు. తెల్లవారుఝామున మూడు గంటలకే నిద్రలేచి, సిద్ధుల దర్శనానికై చలిగాలిని కూడ లెక్కచెయ్యక బయల్దేరాడు. ఆ రాత్రి సమయంలో బండ్లు చెక్కలు వేసుకొని రావటం చూచిన అతనికి అనుమానం కల్గింది. కానీ, "ఛీ సిద్ధారూఢుల దర్శనానికిపోతూ ఇవేమి ఆలోచనలు?" అనుకొని ముందుకు సాగిపోయాడు. బిక్కూసింగ్ మఠానికి వెళ్ళేసరికి ఇంకా తెల్లవారలేదు. ఆ చలిగాలిలో ఒంటి మీద లంగోటి తప్ప ఏమీ ధరించని సిద్ధరూఢులు సమాధి మందిరం వద్ద ఆరుబయట కూర్చుని వున్నారు. బిక్కూసింగు నమస్కరించుకొని, "స్వామీ! ఈ చలిలో ఇక్కడ కూర్చున్నారేమి?" అనడిగాడు. "బిక్కూ! నా కోసం నువ్వు అంతదూరం నుంచి చలిలో రాగాలేనిది నేను శయనమందిరం మంచి నాలుగడుగులు ఇవతలికి వచ్చి ఇక్కడ కూర్చోవడం నాకు భారమా?" అన్నారు. ఆ అవ్యాజమైన ప్రేమకు బిక్కూ కళ్ళు చమర్చాయి. తెల్లవారింది. కైలాసమంటపం దగ్గరికొయ్యదూలాలు దొంగలెత్తుకు పోయారని అందరికీ తెలిసింది. "అయ్యో, చేతికి దొరికిన దొంగల్ని విడిచి పెట్టేశానే!" అని బిక్కూ చాల బాధపడ్డారు. కొంతసేపటికి పోస్టు బంట్రోతు ఒక కవరు తెచ్చిచ్చి వెళ్ళాడు. ఆ కవరు బిక్కూసింగు చేతికిచ్చి, "బిక్కూ! నాలుగు బండ్ల కొయ్యలు పోయాయని బాధపడకు. శివుడు నాలుగు వ్యాగన్ల కొయ్యలు పంపించాడు చూడు" అన్నారు. కవరు ఊడదీసి చూస్తే లోపల రైల్వే రసీదు, హాళ్యాళ దేశపాండే అనే భక్తులు కైలాసమంటప నిర్మాణం నిమిత్తం నాలుగు వ్యాగన్ల కొయ్యలు పంపుతున్నట్లుగా ఉత్తరం వున్నాయి. బిక్కూసింగ్‌కు నోటమాట రాలేదు.

కైలాస మంటపం గోడలు మూడడుగులు పైకి లేచాయి. దాని ముఖ్యశిల్పి అయిన మిత్రికోటి కాళప్పకు ప్లేగు వ్యాధి వచ్చింది. తొడమీద, కాళ్ళమీద పెద్దపెద్ద ప్లేగు బొబ్బలు లేచాయి. తాను ఇక బ్రతకడని అతనికి తెలిసింది. విపరీతమైన జ్వరం, బాధ, శరీర ప్రజ్ఞ కూడ లేదు.

మఠంలో శాస్త్ర ప్రవచనం జరుగుతున్నది. సిద్ధులు లేచి, "కాళ్యా వెళ్ళి పోతున్నాడు చూద్దాము పదండి" అని శిష్యులందరితో కలిసి కాళప్ప దగ్గరకు వచ్చారు. "కాళ్యా! నీ జీవిత సంధ్య సమీపించిందా?" అని అన్నారు సిద్ధులు. అంతటి బాధలోనూ కాళప్ప సిద్ధుల పాదాలు పట్టుకొని, "నా జీవన సూర్యుడే నా దగ్గరకు వస్తే, ఇక ప్రొద్దు ఎట్లా క్రుంగుతుంది" అన్నాడు. ఇంతలో వైద్యులు వచ్చి చూశారు. పెదవి విరిచి, ముందు జరగవలసింది చూసుకోమని చెప్పి వెళ్ళిపోయారు. సిద్ధులు నవ్వారు. కాళప్ప ప్రక్కనే నేలమీద కూర్చుని అతని శరీరం మీద తన అభయ హస్తముంచి, "ఇప్పుడెలావుంది?" అన్నారు సిద్ధులు. "అప్పా, మీ చేయి నా మీద వుంటే బాధ తొలిగిపోయింది. దేవా! సర్వదా మీ చేయి నా శిరస్సు మీద వుండుగాక!"అని వేడుకొన్నాడు. అంతలోకి నాశిక్ శరణప్ప ముందుకు వచ్చి, "దేవా! కాళప్ప మన మఠానికి విశ్వకర్మ, మన పాలిటి అమరశిల్పి. అతనికి మా ఆయుష్యమిస్తాము. మాకోసమన్నా అతణ్ని మీరు కాపాడాలి". అని అర్థించాడు. సిద్ధులు "సరే! భక్తుల ఇచ్ఛప్రకారమే జరుగుగాక!" అని అందరనూ దగ్గరకు పిలిచి "ఇప్పుడు కాళ్యా వెళ్ళిపోతున్నాడు. ఇతను చనిపోతే, మన మఠానికి ఇంకొక కాళ్యారాదు. అతడు బ్రతికి జీవించాలంటే మీరు మీ మీ ఆయుష్షులో కొంత భాగం అతనికి ధారపోయండి. ఎవరెవరు ఎంతెంత ఆయుష్యమిస్తారో ముందుకు రండి" అన్నారు. అందరూ ఒకరి మొహాలొకరు చూచుకొనే వాళ్ళే, ఎవరూ ముందుకు రారు.

సిద్ధులు నిరుపాదప్పను పిలిచి "నువ్వు ఐదు సంవత్సరాలు ఇవ్వు!" అన్నారు. "అల్లేదేవా!" అని నమస్కరించాడతను. బెటగేరి చన్న బసప్ప అనే భక్తుడు ముందుకు వచ్చి ఐదు సంవత్సరాలిస్తానన్నాడు. మూరగోడ పీతాంబరప్ప ఒక సంవత్సరం ఆయుష్షు ఇచ్చాడు. సిద్ధులు ఆ ఆయుష్షును కాళప్పకిచ్చి, బ్రతికించారు. కాళప్ప బ్రతికి కైలాస మంటప నిర్మాణాన్ని పూర్తిచేశాడు. సిద్ధుల మూర్తిని నిర్మించాడు.

కాళప్ప పల్లెటూరు రైతు. చెప్పుకోతగ్గ చదువూ లేదు. హుబ్లీ దగ్గరలోని పల్లెటూరైన మిశ్రకోటిలో ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు. అతనికి శిల్పంలో అంత శాస్త్రపరిజ్ఞానం కూడలేదు. అటువంటి కాళప్ప చెక్కిన సిద్ధుల మూర్తి లోకమంతా అచ్చెరువు చెందేటట్లు వుంది . మొదట సిద్ధుల మూర్తిని చెక్కడానికి బొంబాయిలో

శిక్షణ పొందిన శిల్పి ఒకడు వచ్చాడు. అతడాపనికి రు. 15,000/-అడిగాడు. దానికన్నా అత్యంత శ్రద్ధతో చెక్కే కాళప్ప సరళభక్తియే సిద్ధులకు నచ్చింది కాబోలు - "ఎందుకు? మన కాళ్యా చెక్కుతాడులే!" అన్నారు. ప్రతిరోజు కాళప్ప ఎదుట అతడు చెప్పినంతసేపూ చెప్పినట్లుగా కదలక మెదలక కూర్చునేవారు. సిద్ధుల మూర్తి పూర్తయింది. ఎందరో శిల్పులా మూర్తిని చూచి ఆశ్చర్యపోయారు. కాళ్యాలో ఇంతశక్తి వుందా అని విస్మయం చెందారు.

సిద్ధులు మొదట కాళప్ప కైలాసమంటపు నమూనా గీసి చూపిస్తే, దానికి ఒప్పుకోలేదు, "కాళ్యా! నీవే చూస్తున్నావు గదా! నేను కడుపేదవాడిని. చేతులు కాళ్ళు, ఈ లంగోటీ తప్ప ఏమీ లేని వాడిని. ఇంతటి కట్టడం రాజమహారాజులకే చెల్లుతుంది గానీ, మనకెందుకు?" అన్నారు. అప్పుడు ఉజ్జణ్ణ లక్ష్మమ్మ తన దగ్గరున్న బంగారు ఆభరణాలు, డబ్బుదస్కం అంతా తెచ్చి సిద్ధుల ముందుంచి, కైలాస మంటపం కట్టి తీరాల్సిందే" అన్నది. చాల మంది భక్తులు కూడ ముందుకు వచ్చారు. సిద్ధులు, "సరే! భక్తుల ఇచ్ఛ" అన్నారు.

శివరాత్రి రోజులు సమీపిస్తున్నాయి. సిద్ధులు ఒకరోజు మఠంలో ప్రవచనం చేస్తున్నారు. ఉన్నట్టుండి ఆయన మోకాళ్ళమీద కూర్చుని, తన రెండు చేతులూ నేలకు గట్టిగా ఒత్తారు. అలా రెండు నిముషాలుంచారు. వారి శరీరమంతా తడిసి ముద్దయిపోయి, నీళ్ళు గారుతున్నది. వారు ఒక్కొక్కరిని చేయిపట్టి పైకి లాగుతున్నట్లుగా చేస్తూ "పైకి రండి! పైకి రండి! శివుడు రక్షిస్తాడు. చింతించకండి. శివ నామస్మరణ చేయండి" అంటూ సిద్ధులు మరాఠీలో మాట్లాడుతున్నారు. ఎదురుగా శాస్త్ర బోధ వినడానికి కూర్చున్న భక్తులకు ఏమీ అర్థంగాక ఆశ్చర్యంతో చూస్తున్నారు. సిద్ధులు నీళ్ళలో మునిగి పైకి వచ్చినట్లుగా నీళ్ళుకారుతూ వున్నారు. అదేమిటని అడిగిన భక్తులతో సిద్ధులు బొంబాయిలోని భక్తులు సముద్రంలో పెనుగాలికి చిక్కుకొని మునిగి పోయేటట్లుగా వుంటే రక్షించి వస్తున్నాను. వాళ్ళు రేపు సాయంత్రానికి ఇక్కడికి వస్తారు" అని చెప్పారు. అలానే మర్నాడు సాయంత్రానికి వాళ్ళు వచ్చి సిద్ధుల పాదాల మీదపడి, "తండ్రీ! నీవు వచ్చి మమ్మల్ని రక్షించకపోతే సముద్రంలో మునిగి మేము చనిపోయేవాళ్ళమే. స్వామీ! నీ కృప వలన మళ్ళీ వచ్చి నీ పాదాలు దర్శించగలిగాము" అని జరిగినదంతా అక్కడి భక్తులకు చెప్పారు.

శివరాత్రి వచ్చిందంటే హుబ్లీలోని భక్తుల సంతోషం అంతా ఇంతా కాదు. అందరూ వచ్చే భక్తుల సేవకై దిగుతారు. భక్తుల భోజన సదుపాయానికై సిద్ధులు సుమారు 200 అన్న సత్రాలు ఏర్పాటు చేసేవారు. అక్కడ తెరపి లేకుండాఏడెనిమిది రోజులపాటు ఉత్సవానికి వచ్చిన భక్తులకు అన్నదానం జరుగుతూవుండేది. మొదటి రోజు సిద్ధులు ప్రతి సత్రానికి వెళ్లి పూజచేసి వచ్చేవారు. ప్రొద్దుటే అన్ని సత్రాల్లో వంట పూర్తి చేసుకొని సిద్ధుల రాక కోసం ఎదురు చూస్తూండేవారు. సిద్ధులు అన్నపూర్ణేశ్వరి అవతారం. వారి హస్తస్పర్శ అయితే చాలు దేనికీ కొరత వుండదని భక్తుల నమ్మిక.

ప్రతి సంవత్సరమూ మంటూరు ఈరప్ప తన అన్నసత్రం పెట్టేవాడు. మొదటి రోజు సిద్ధులు అతని సత్రానికి వచ్చారు. రవ్వకేసరికి రవ్వ పొయ్యిమీద ఉడుకుతున్నది. దానిలోకి బెల్లం తక్కువయిందని బెల్లం కోసం ఒక పిల్లవాడిని అంగడికి పంపించి, ఎదురు చూస్తూ వాకిట్లో నిల్చున్నాడు ఈరప్ప. సిద్ధులు లోనికి వస్తూ, "ఈరా! పూజకి తయారు చేశావా!" అని ఆత్మీయంగా అడిగారు. "దేవా! రవ్వకేసరికి బెల్లం తక్కువయితే, తేవడానికి పంపించాను. బెల్లం రావడంతోనే వంట అయిపోతుంది" అన్నాడు. ఒక పెద్ద గుండిగలో పొయ్యి మీద రవ్వ ఉడుకుతున్నది. బెల్లం రెండుశేర్లు కూడాలేదు. అది చాలదు. "ఇక్కడుంది కదయ్యా బెల్లం" అంటూ సిద్ధులు ఆ బెల్లం గుండిగలో వేసి,. కుతకుత ఉడుకుతున్న ఆ రవ్వలో చెయ్యిపెట్టి కలిపేశారు. చిత్రం! వారి చెయ్యి కాలనేకాలలేదు. గరిటతో తిప్పినట్లు చేత్తో తిప్పి, కొంచెం తీసి "తీపి చూడు" అని ఈరప్పకు పెట్టారు. అందరకూ పెట్టారు. బాగా తియ్యగా వుంది. "నీ అంతఃకరణమే బెల్లం వలె తియ్యగా వుంటే, వేరే బెల్లమెందుకయ్యా!" అని నవ్వుతూ అన్నారు సిద్ధులు.

శ్రీ సాయిబాబా కూడ భక్తులకు అప్పుడప్పుడు, వంట చేసి పెట్టేవారు. వారు కూడ తమ చేయి ఉడుకుతున్న అన్నంలో పెట్టి తిప్పుతూ కలియబెట్టేవారు

శివరాత్రి జాతరకు అన్ని మతాల, వర్ణాలకు చెందిన వారూ అన్న సత్రాలు పెట్టేవారు. బ్రాహ్మణులు, ముసల్మానులు కూడ అన్న సత్రం పెట్టేవారు. గోపన కొప్పులో వడ్డెర జాతికి చెందిన "హుచ్చప్ప" అనే భక్తుడు కూడ ఒక సత్రం పెట్టాడు.

ఒకరోజు తెల్లవారు జామునే వంట పూర్తి చేసి, సిద్ధుల పాదపూజకు మడినీరు తేవడానికని చెరువుకు వెళ్తున్నాడు. వాకిట్లోనే సిద్ధులతన్ని ఆపి, "ఓయీ పిచ్చివాడా! నీలోనే మడినీరు వుండగా, కప్పలు, చేపలు ఎంగిలిచేసిన చెరువు నీరెందుకు తెస్తావు? ఆ నీరు నాకు వద్దు నీలోని భక్తిజలమే చాలు!" అన్నారు. హుచ్చప్పకు ఏమీ అర్థం కాలేదు. "దేవా! నాలో మడి నీరు ఎక్కడ వున్నాయి?" అని అడిగారు. "హుచ్చా! నీలో మడి నీరెక్కడ వున్నాయని అడుగుతున్నావా? ఏదీ నీ నోరుతెరువు నాలుక చాపు!" అన్నారు. అతడట్లానే చేశాడు. అతని నోట్లో కొబ్బరిముక్క పెట్టారు సిద్ధులు. నోట్లోనీరూరింది. హృదయంలో భక్తి జలం ఊరింది. ఆ భక్తి జలంతో సిద్ధుల పాదపూజ అయింది.

సిద్ధులు చనిపోయిన వారిని బ్రతికించిన సంఘటనలు అనేకం. హుబ్లీ బొమ్మాపూర పేటలోని మురుగోడ దేవికాబాయి అనే ముదుసలి సిద్ధుల భక్తురాలు. ఆమెకు వంద సంవత్సరాలు. ఒక రోజు ఆమెకు మాట పడిపోయింది. శ్వాస ఆగిపోయింది. చనిపోయిందని నిర్ధారించి, కన్నులు మూసి, రెండుచేతులూ గుండెలమీద పెట్టారు. రావలసిన వాళ్లంతా వచ్చారు. ముందు జరుగవలసిన దానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇంతలో ఆమె చిన్నగా కళ్లు తెరిచింది. చేతులు చిన్నగా తీసుకొంది.ఏమోచెప్పాలని ఆతృత పడుతున్నట్లుగా వుంటేదగ్గరకు వెళ్లి "అవ్వా! నీ కోరిక ఏమిటి?" అని అడిగారు. ఆమె, "నన్ను లేవదీసి కూర్చోపెట్టండి. సిద్ధారూఢ స్వామి నా దగ్గరకు వచ్చి కూర్చున్నారు. "శివాయనమః" అనమని చెప్పారు. వారి పాదాలకు నమస్కరించాలి. నన్ను లేపి కూర్చోబెట్టండి" అని తన దగ్గర్లో ఒక చోట తలవంచి, "అప్ప ఇక్కడ నిలబడి వున్నారు" అని నమస్కరించింది. ఆ తర్వాత ఆమె పది సంవత్సరాలు బ్రతికింది.

సిద్ధారూఢులు తమకూ, తమ చిత్ర పటానికీ భేదం లేదని చూపిన సంఘటనలున్నాయి. ఒకసారి ధర్మవ్వ అనే భక్తురాలు మట్టితో సిద్ధుల మూర్తిని తయారు చేసింది. ఆ మూర్తి కుడి కంటిమీద ఒక గంటు పడింది. లోపల ఏవో చిన్న విత్తనాలు చిక్కుకొని వుంటాయని భావించి ఆమె ఒక సన్నని పదునైన సూది వంటి దానితో భ్రుకుటి మీద కెలక నారంభించింది. ఒక చేత్తో మూర్తిని పట్టుకొని, మరొక చేత్తో కెలకుతూ వుంది. ఆమె చేతికి మూర్తి చాలా వేడిగా తగిలింది.

ఆమెకనుమానమొచ్చి ఇతర దేవతా మూర్తులను పట్టుకొని చూచింది. అవి చల్లగానే వున్నాయి. సిద్ధుల మూర్తి మాత్రం వేడిగా మారిపోతున్నది. ఏదో అపచారం జరిగిందని వ్యాకుల పడుతూ ఆమె, ఆమె భర్త పరుగెత్తుకొంటూ మఠానికి వచ్చారు. అక్కడ సిద్ధులు విపరీతమైన జ్వరంతో పడుకొని వున్నారు. ధర్మవ్వ పరుగెత్తుకొంటూ వెళ్లి సిద్ధుల కాళ్ల మీద పడింది. తల ఎత్తిన ఆమె దృష్టి సిద్ధుల కుడి భ్రుకుటి మీద పడింది. అక్కడ ఏడెనిమిది చోట్ల పదునైన ఆయుధంతో గీరినట్లు రక్తం కారుతున్నది. ఆమెకు కడుపులో దేవినట్లయింది. "దేవా! తప్పయింది. క్షమించు నా తండ్రీ!" అంటూ ఆమె సిద్ధుల పాదాలు పట్టుకొన్నది.

సిద్ధారూఢులు ఉజ్జణ భీమప్పకు దత్త పుత్రులైన తర్వాత ప్రతిరోజు సాయంత్రానికి వారింటికి వచ్చి, ఉదయం తిరిగి మఠానికి వెళ్లేవారు. రోజూ సాయంత్రం వారింట్లో సిద్ధులు శాస్త్ర ప్రవచనం చేసేవారు. ఎందరో భక్తులు సిద్ధుల శివవాణి వినడానికి వచ్చి చేరేవారు. ఒక ఇంటికోడలు ఇంటి పనంతా ముగించుకొని రోజూ వచ్చేది. అత్త గయ్యాళి. ఆమెకిది నచ్చక, ఇల్లు కదలరాదని ఆంక్షపెట్టింది. నిస్సహాయురాలైన ఆ కోడలు సిద్ధుల దర్శన భాగ్యమైనా కలుగుతుందేమోనని సిద్ధులు వచ్చేవేళకు కిటికీ దగ్గర నిలబడి వారి కోసం ఆర్తితో చూస్తూ వుండేది. కోడలు ఎవరి కోసమో నిరీక్షిస్తున్నదని, ఆమె శీలాన్ని శంకిస్తూ, కొడుకుకు లేనిపోనివి కల్పించి చెప్పింది. అతడు తల్లిమాట నమ్మి భార్యను హింసించసాగాడు. తన శీలాన్నే శంకించినతరువాత తనకిక జీవితమే అనవసరమని ఆ కోడలు ఒకరోజు ఆత్మహత్య చేసుకోడానికై బయలుదేరింది. అత్త నిద్రిస్తున్న సమయం చూచుకొని, వాకిటి తలుపు తీసుకొని బయటకు వచ్చింది. ఎదురుగా సిద్ధారూఢులు! ఆమె తన కళ్ళను తానే నమ్మలేకపోయింది. దుఃఖం కట్టలు తెంచుకు వచ్చింది. వారి పాదాలపై పడి తనివితీరా రోదించింది. "అమ్మా! నీవు సహనానికి మారుపేరుగావాలి. ఇది ఒక కష్టకాలము. త్వరపడవద్దు. సహించు, నీకు శుభం జరుగుతుంది." అని ఒక కథ చెప్పారు. "ఒకప్పుడు ఆదిశేషుడు పోతూ ఉంటే ప్రక్కన గడ్డిలో ఉండే ఒక పురుగు ఆ నాగలింగని ఠీవిని చూచి ఓర్వ లేక , వెనుక నుంచి "ఓ నాగ్యా! గూగ్యా!" అని తిట్టనారంభించిందట నాగలింగడు కోపం తెచ్చుకోవటానికి బదులుగా ఒక చిన్న నవ్వు నవ్వి "ఓయీ! క్షుద్ర జంతువా? నీకు ఉదాత్తభావాలు ఎక్కడ నుండి వస్తాయి? నీ బ్రతుకంతా ఎంతసేపు?

కొంచెం సేపట్లో ఎండ తీవ్రత పెరుగుతుంది. ఆ ఎండ బాధకు చచ్చిపోతావు" అనేసి వెళ్ళిపోయాడు. నీయత్త ఆమె సంస్కారాన్ని అనుసరించి ప్రవర్తిస్తున్నది. అదింకా ఎంత కాలం? ఓరిమి వహించు. చింతించకు, ఇంటికి నడు" అని ఆశీర్వదించారు. మూడవ రోజున ఆ అత్త శవం ఊరి బైట చెరువులో తేలుతూ కనిపించింది.

ప్రచార, ప్రసార సాధనాలు విశేషంగాలేనటువంటి ఆరోజులలోనే సిద్ధుల కీర్తి దేశమంతా వ్యాపించింది. ఎందరో సాధు సత్పురుషులు సిద్ధులు గురించి అనేకులకు ప్రచారం చేసారు. అక్కలకోట శరణప్ప మహారాష్ట్ర దేశంలోని రాజకుటుంబాలన్నిటికి సిద్ధుల శివసందేశాన్ని తీసుకు వెళ్ళి అందించేవాడు. అనేక మంది రాజులు, రాణులు సిద్ధుల దర్శనానికై తహతహపడేవారు.అక్కలకోట మహారాజు హుబ్లీలోనే ఒక భవనం కట్టించుకొని ఉండి, ఎక్కువకాలం సిద్ధుల సేవలో గడిపేవాడు. ఆరాణి తన పట్టువస్త్రపు కొంగుతో సిద్ధుల గది తుడిచి శుభ్రం చేసేవారట.

కాని సిద్ధులు మాత్రం ఎల్లప్పుడు ఎల్లరను సమదృష్టి చూచేవారు. వారు చూచేది నిర్మల అంతఃకరణాన్ని మాత్రమే. ఒకసారి ఒకమహారాజు సిద్ధులదర్శనానికి రాదలచి, వారికి ఏమి కానుకలు తీసుకెళ్ళాలో నిశ్చయించుకోలేక, సిద్ధులనే కనుక్కురమ్మని తన సేవకుని పంపించారు. "దేవా! మా మహారాజు మీ దర్శనానికి వస్తున్నారు. మీకు ప్రీతికరమైన కానుకలు తీసుకొని రాదలచి, మీకేమి ప్రీతికరమో కనుక్కొని రమ్మని నన్ను పంపించారు. తాము దయ ఉంచి ఏమేమి కావలెనో సెలవివ్వవలసింద"ని ప్రార్థించాడు. దానివి సిద్ధులు, "వినయం అనేది ఒకటి ఉంది. వచ్చేటప్పుడు అది ఒక్కటే తీసుకొస్తే చాలు. అంతకిమించి నేను దేనిని అపేక్షించనను" అన్నారు.

ఒకసారి సిద్ధుల దర్శనానికి ఒక మహారాజు సిద్ధారూఢుల చేయి పట్టుకొని వారిని కైలాసమంటపం వైపుకి నడిపించుకు వెళ్తున్నాడు. ఆ రాజు భక్తితో, "స్వామీ! తాము నా చేతిని విడిచిపెట్టకండి" అన్నాడు. సిద్ధారూఢులు "రాజా! ఇప్పుడు ఎవరి చేయి ఎవరు పట్టుకొన్నారు?" అని అడిగారు. "నేనే మీ చేయి పట్టుకొన్నాను" అన్నాడు ఆ రాజు. "చూడు రాజా! నీవు ఎంత సేపు నా చేయి పట్టుకొని ఉంటావో అంతసేపు

నాచేయి నీచేతిలో ఉంటుంది. నీవే నాచేయి విడిచిపెడితే దానికి నేనేమి చేయను? "అన్నారు. మర్కట కిశోర న్యాయంగా భక్తుడే భగవంతుని పట్టుకొని ఉండాలని సూచించారు సిద్ధులు.

నిత్యం వేలకొద్ది జనులు సిద్ధుల దర్శనానికి వచ్చేవారు. శాస్త్ర విషయం ముగిసిన పిదప సిద్ధులే కొద్దిసేపు సమాధి దగ్గర కట్టమీద కూర్చునేవారు. అప్పుడు భక్తులువచ్చి వారి పాదాలకు నమస్కారము చేస్కునేవారు. మొక్కులు మొక్కుకునేవారు డబ్బు సమర్పించేవారు. సిద్ధులు అవేమీ పట్టించుకొనేవారుకాదు. వారి దగ్గర కూర్చున్నవాళ్ళే ఒక బుట్ట తెచ్చి అవన్ని బుట్టకెత్తి మఠం లోపలికి తీసికెళ్ళేవారు. అందులో ఎంత తమ జేబులో వేసుకొనేవారో, ఎంత మఠానికి లెక్కవ్రాసేవారో అన్నీ తెలిసినా, సిద్ధులు ఏమీ తెలియనట్లే ఉండేవారు.

ఒకసారి శివరాత్రి తిరుణాళ్ళకు దేశం నలుమూలల నుంచి భక్తులు వచ్చారు. అనేక రాజమహారాజులు, శ్రీమంతులు వారి పాదాల వద్ద, వెండి బంగారం సమర్పించారు. వారందరు అక్కడ కూర్చొని ఉండగ ఒక ముదుసలి, కడుపేదరాలు ఎంతో దూరం నుంచి నడిచి నడిచి సిద్ధుల దర్శనానికివచ్చింది. సిద్ధుల దర్శనం చేసుకొనిదే అన్నం, నీరు ముట్టరాదనే నిశ్చయంతో, భక్తితో వచ్చింది. సిద్ధుల దర్శనం అయ్యింది. ఆమె ఆతృతతో వారి వైపు వస్తుంటే, అక్కడ చేరిన వారు మురికిబట్టలలో ఉన్న ఆమెను అసహ్యంగా చూసారు. ఒకడు లేచి ఆమెను వారించబోయాడు. అంతలో సిద్ధులే లేచి వచ్చి చేయి పట్టుకొని ఆమెను తీసుకువెళ్ళి తన దగ్గర కూర్చోపెట్టుకొన్నారు. ఆమె ఆనందానికి అవధులు లేవు. కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వారి పాదాల మీద వ్రాలి, పొర్లాడింది. ఆమె తన చీర కొంగు ముడి విప్పి, ఒక కాని బయటకి తీసింది. అది సిద్ధుల చేతిలో పెడుతూ, "స్వామి! నేను కడుపేదరాలిని. ఒక్క కాణీ తెచ్చాను. ఇది సమస్త దైవాలకు ముట్టేట్లు చేయి"అని చెప్పింది. అక్కడ కూర్చున్న జనమంతా ఆమె మాటవిని ఆశ్చర్యపోయారు. సమర్పించింది ఒక్క కాణీ! వారినే ఆజ్ఞాపిస్తున్నదే! అని అనుకొన్నారు. శ్రీమంతులు బంగారం సమర్పించినా, అటువైపు చూడనైనా చూడని సిద్ధులు ఆ ముదుసలి ఇచ్చిన కాణీ ఎంతో ప్రేమతో చేతిలోకి తీసుకొని, తన నుదుటికి అద్దుకొన్నారు. ఆమె ఇచ్చింది ఒక కాణీ! లక్షల్లో వచ్చిన ఈ తిరుణాల జనానికందరికీ ముట్టేట్లు చేయడమా? ఏం చేస్తారు? అంటూ భక్తులందరూ ఆతృతగా చూస్తూ

వున్నారు. సిద్ధులు రాచప్పను పిలిచారు. "రాచప్పా! ఈ తల్లి మనకు ఒక కాణీ సమర్పించింది. ఈ కాణీ ఈ తిరణాల జనమంతటికీ ముట్టేటట్లు చేయవలసిందని కోరింది. ఏం చేస్తావు?" అని అడిగారు. "దేవా! తమరే సెలవివ్వండి" అని చేతులు జోడించి నిలబడ్డాడు రాచప్ప. సిద్ధుల దృష్టి మఠం ముందు తిన్నె మీద కొత్తిమీర అమ్ముతున్న అవ్వ మీదపడింది. ఆ కాణీతో కొత్తిమీర కొనుక్కొచ్చి చారులో వేయమని సెలవిచ్చారు. అక్కడ చేరిన వాళ్ళంతా ఆశ్చర్యపోయారు. శ్రీమంతుల ఆడంబర భక్తికంటె పేదల నిరాడంబర సరళభక్తియే భగవంతునికి ప్రీతికరమని సిద్ధులు ఆచరణలో చూపించారు.

శివరాత్రికి ముందు ఊరిలోని భక్తులు సిద్ధులను తమ తమ ఇండ్లకు తీసుకువెళ్ళి ఉత్సవ నిమిత్తం కానుకలు సమర్పించేవారు. ఆ డబ్బు వారి వద్దనే వుంచమని, శివరాత్రి నాటికి మఠానికి పంపించమని చెప్పేవారు. కొందరు ఆ డబ్బు మళ్ళీ అవసరాలకి వాడేసుకొనేవారు. కొంతమంది "స్వామీ! నా కూతురి పెళ్ళికి ఖర్చయిపోయిందీ" అనేవారు. అన్నిటికీ సిద్ధులు "శివాయనమః" అనేవారు.

చన్నపేటలో ఒక పేదవాడు పది వెండిరూపాయలు తెచ్చి సిద్ధుల పాదాల వద్ద వుంచి నమస్కరించాడు. అతని స్థితిగతులు సిద్ధులకు తెలుసు కాబోలు, "ఇది నీ శక్తికి మించినది. ఒడి పట్టు" అని ఆ పదిరూపాయల్లో ఎనిమిది రూపాయలు అతని ఒడిలో వేసి ఆశీర్వదించి, పంపారు. "మీరు తినగా మిగిలినదే మఠానికి ఇవ్వండి" అనేవారు సిద్ధులు. "అన్నసత్రానికి సమర్పిస్తే సమస్త దేవతలకూ సమర్పింప బడుతుంది". అనేవారు. ఒకసారి ఒక భక్తుడు సిద్ధుల పాదాలకు మొక్కి "అప్పా! మఠానికి ఏమి సమర్పించను?" అని అడిగాడు. సిద్ధులు "అందరికీ ముట్టేటటువంటిది తెచ్చి సమర్పించు" అన్నారు. అతను పది బస్తాల ఉప్పు తెచ్చి మఠానికి సమర్పించాడు.



# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 7

సిద్ధులు శాస్త్ర ప్రవచనం గావిస్తుంటే అనేక పశుపక్ష్యాదులు కూడ అక్కడకు వచ్చి చేరి, శ్రద్ధతో వినేవి. ఆ పశుపక్ష్యాదుల జన్మ జన్మాంతరాలన్నీ సిద్ధులకు తెలుసు.

ఒకసారి ప్రవచనం జరుగుతుండగా ఒక కాకి వచ్చి కూర్చున్నది. దాని ఒళ్లంతా తడిగా వుంది. ఎవరూ పెద్దగా పట్టించుకోలేదు. కానీ, ప్రతిరోజూ ప్రవచనం ప్రారంభించే సమయానికి ఆ కాకి స్నానం చేసి, తడి వంటితో వచ్చి కూర్చుని శ్రద్ధగా ఆలకించేది. ప్రవచనానంతరం సిద్ధులు తమ హస్త ప్రసాదంగా ఒక ముద్ద పెట్టేవారు. అది తీసుకువెళ్లి చెట్టు మీద పెట్టుకొని తినేది. సిద్ధులు శిష్యులతో, " ఈ కాకిని ఏ పిల్లీ పొట్టన పెట్టుకోకుండా ఒక వారం రోజులు కాపాడండి. ఇవ్వాళ్టికి ఎనిమిదవ రోజున ఈ పక్షి శాస్త్రంవిని, చెరువు కట్టమీదకు వెళ్లి ప్రాణాలు విడుస్తుంది" అని చెప్పారు. ఆ కాకి గత జన్మలో ఒక తపస్వియనీ, మానవదౌర్బల్యం వలన పతనమై ఇప్పుడీ కాకి జన్మనెత్తాడనీ, అయినా పూర్వజన్మ సంస్కారం వలన ఆత్మోద్ధారం చేసుకోవాలనే ప్రబల ఆకాంక్ష కలిగిందనీ సిద్ధులు ఆ కాకి గురించి అక్కడ కూర్చున్న వారితో చెప్పారు.

ఆ రోజు గురువారం. సిద్ధులు కాకి భవిష్యత్తు గురించి చెప్పినది విని, ఆ వింత చూడటానికై అనేకులు అక్కడ చేరారు. శాస్త్రం ప్రారంభమయింది. కాకి కూడ స్నానం ముగించి వచ్చి తన స్థానంలో కూర్చున్నది. తన్మయంగా శాస్త్రవిషయం విన్నది. శాస్త్రబోధ పూర్తికాగానే అది ఎగిరి వెళ్లి వంటశాల ఎదురుగా వున్న ఒక చెట్టుమీద కూర్చుంది. సిద్ధులు బయటకు వచ్చారు. చెట్టుమీద కూర్చున్న కాకి అరుస్తూ వచ్చి, వారి పాదాల మీద వాలింది. తన ముక్కు అటూ ఇటూ తిప్పి, మెడచాచి ప్రణామం చేసింది. సిద్ధులు ఆశీర్వదించారు. అది ఎగిరి చెరువు గట్టు మీదకు వెళ్లింది. వెళ్లి చూచేసరికి దాని ప్రాణ పక్షి ఎగిరిపోయింది.

అలాగే ఒకసారి ఒక కోతి రోజూ వచ్చి కూర్చుని తన సహజ చాపల్యం విడిచి పెట్టి శ్రద్ధగా ప్రవచనం వినేది. ప్రవచనానంతరం సిద్ధులు దాని వద్దకు వెళ్లి "రామభక్తా! రా!" అని దాన్ని చేత్తో నిమిరి, శెనక్కాయలు పెట్టేవారు.

ఒకసారి సిద్ధుల వద్దకు ఇద్దరు సాధువులొచ్చారు. వచ్చిన వారి జన్మజన్మాంతర విషయాలన్నీ తెలిసిన సిద్ధులు, వారి ముందు కొన్ని వేరుశనక్కాయలు చల్లి, "మోకాళ్ల మీద పడుకొని పశువుల్లాగా నోటితో ఈ కాయలు తినండి. దీని వలన మీకు ముందు రానున్న పశుజన్మ పరిహరింపబడుతుంది." అని చెప్పారు. వాళ్లట్లాగే తిన్నారు. "మీ జన్మ ఉద్ధరింపబడింది. పశుజీవనం ముగిసింది." అని ఆశీర్వదించి పంపారు.

మఠంలో ప్రతిరోజూ వేల కొద్దీ భక్తులు వచ్చి ప్రసాదం తీసుకొని వెళ్లేవారు. ఒక రోజు ఒక ముదునలి వచ్చి భిక్ష అర్థించింది. సిద్ధులు ఆమెను చూచారు. ఒకామెను పిలిచి, "ఈమె, మహాత్ములను హింసించి చంపింది. ఈమెను దూరంగా తరిమి రా!" అని చెప్పి పంపించి వేశారు. ఈమె ఈ రీతిగా ఇంకా ఆరుజన్మలు గడపాల్సి వుందనీ, తమని చూచిన మాత్రానికే ఆమెకు ఒక జన్మ పరిహరింపబడిందనీ సిద్ధులు చెప్పారు.

సిద్ధులు ప్రవచనం చేస్తూండగా ఒకతను వచ్చాడు. వందరూపాయలు సిద్ధుల పాదాల వద్ద వుంచి, "దేవా నాకు ప్రసాదం ఇప్పించు" అని ప్రార్థించాడు. సిద్ధులతన్ని చూచారు. ప్రక్కనే కూర్చున్న తిల్హాపురపు కృష్ణగౌడను పిలిచి, "గౌడా, వీడిని ఆ దీపస్తంభం అవతలికి తగిమిరా!" అన్నారు. "వీడు మహాత్ముని మనస్సు కష్టపెట్టాడు. చాల కష్టాలు కల్గించాడు. వీడిదే విధంగా ఆరుజన్మలు తిరుగవలసి వుంది. దూరంగా తరిమిరా" అన్నారు.

ఒకసారి మద్రాసుకు చెందిన ఒక శ్రీమంతుడు తనకు అరిష్టాన్ని కల్గిస్తున్నదని నీలమణిని వక్కలో పెట్టి, ఆకు వక్క సిద్ధుల పాదాల వద్ద సమర్పించాడు. ప్రక్కనున్న వాడది అందుకోబోతుంటే సిద్ధులు వారించి "ఇందులో నీలమణి వుంది తీసుకోవద్దు" అని వారించారు. ఆ శ్రీమంతుడు తన బాధ విన్నవించుకొని ప్రార్థించిన మీదట సిద్ధులది స్వీకరించి, చెరువులోకి విసిరేశారు. ప్రార్థిస్తే ఎవరి కర్మనైనా తీసివేసేవారుగాని, కుయుక్తులను సహించేవారు కాదు.

సిద్ధులు మనుష్య నిర్మిత జాతిని నమ్మేవారు కాదు. వర్ణాశ్రమ ధర్మాలను పాటించేవారు కాదు. అందరనూ తనతో సమానులుగా చూచేవారు. వారు భోజనోపచారానికిగానీ, ఉపాసనకుగానీ బ్రాహ్మణుల మొదలు చండాలుర వరకూ శివుని బిడ్డలుగానే చూచేవారు. ఎటువంటి విధి, నియమ, ఆరాధనలను వారు ఆచరింపచేయలేదు. వారి వద్దకు సర్వజాతి, మత, కులస్థులు వచ్చేవారు. జనివారపు (జంధ్యపు) వారు, శివదారపు వారు కూడా వచ్చేవారు. కానీ, వారు మాత్రం ఏ దారాన్నీ నమ్మేవారు కాదు. "జనివారపువారు విష్ణువును, శివదారపు వారు శివుని పంచుకొంటే, మిగిలినవారికి దేవుడే ఇకలేడా ఏమప్పా?" అని ప్రశ్నించేవారు. మఠంలో 1920లో కోర్టు జరిగేటప్పుడు న్యాయవాది సిద్ధులను కబీరుదాసు గురించి ప్రశ్నిస్తూ "అతడు ముసల్మానేనా?" అని అడుగగా సిద్ధులు, "అతని జాతి ఏమిటనేది నేను ఎన్నడూ ఆలోచించలేదు" అని సమాధానమిచ్చారు.

సిద్ధుల మఠంలో కొంతమంది మడివంతులైన బ్రాహ్మణులు దూరంగా ఇతరులతో కలవకుండా కూర్చునేవారు. సిద్ధులు వారిని చూశారు. "చూడండయ్యా! మా జాతి ఎల్లరితో కలిసిపోయే జాతి. మీ జాతి ఎవరితో కూడని జాతి" అన్నారు.

ఒకసారి ఒక స్వాముల వారు సిద్ధుల మఠానికి పల్లకీలో వచ్చారు. ముందుగా వారి శిష్యులు వచ్చి, అక్కడ వాకిట్లో పడిన జొన్న గింజలను ఎత్తుతూ వున్న సిద్ధుల వద్దకు వెళ్లి, "స్వామీ! మా మహాస్వాముల వారు ఇప్పుడు మీ వద్దకు దయ చేస్తున్నారు. వారికి కాళ్లు చేతులు కడుక్కోవడానికి నీరెక్కడ?" అని అడిగారు. సిద్ధులు వంచిన తల కూడ ఎత్తకుండా "కాళ్ళు చేతులు కడుక్కోవడానికి నీరు కావలెనా? అదుగో ఆ కాలువలో కాళ్ళు చేతులు కడుక్కొని రమ్మని చెప్పండి మీ స్వామికి" అన్నారు. ఆ శిష్యులు మళ్లీ "మా స్వాముల వారు కూర్చోవడానికి ఆసనమెక్కడ?" అని అడిగారు. సిద్ధులు నవ్వారు. "ఎక్కడ కూర్చున్నా ఎవరూ నేలను విడిచిపెట్టి కూర్చోలేరు. నేలయే భద్రాసనము. కాబట్టి మీ స్వాముల వారిని నేలమీదనే కూర్చోమని చెప్పండి" అన్నారు.

ఒకసారి గదగ్ నుంచి శ్రీ శివానంద స్వామి సిద్ధుల మఠానికి వచ్చారు. సిద్ధులు తామే లేచి వారికి దీర్ఘదండ ప్రణామం చేసి, వారిని వంటశాలలోనికి తీసుకువెళ్లారు.

అందరూ ప్రసాదానికి కూర్చున్నారు. సిద్ధులు విస్తరిలో నుంచి ఒక ముద్ద ప్రసాదం తీసి శివానందస్వామి నోటిలో పెట్టి, "నీ కులం చెడిపోయిందా?" అని అడిగారు. అప్పుడు శివానందులు, "కులము వుంటేనే గదా చెడిపోయేందుకు? చెడిపోయేదంతా చెడిపోగా ఇప్పుడు చెడిపోనటువంటి కులం మిగిలింది" అన్నారు.

ఒకసారి ఉత్సవ సమయంలో ఒకడు చాల అన్నం పెట్టించుకొని, తినలేక పారవేయడానికి లేచి వెళ్తున్నాడు. సిద్ధులది చూశారు. వాడిని దగ్గరకు పిలిచి, విస్తరి చేతిలోకి తీసుకొన్నారు. అతను తిని మిగిల్చిన అన్నం తీసి అన్నపు రాశిలో పడవేశారు. వాడు గాభరా పడుతూ, "స్వామీ ఇది ఎంగిలి చేసిన అన్నం" అంటుంటే సిద్ధులు వానితో, "అప్పా! ఇది ఎంగిలి కాదు. నీ ప్రసాదం. నీ అంతటి వాని ప్రసాదం భక్తులైన మా అందరకూ ఎప్పుడు లభిస్తుంది?" అన్నారు. వారికి ఎంగిలి అనేది కన్పించలేదు. సిద్ధులు సర్వాన్నీ బ్రహ్మమనే భావంతోనే చూచేవారు.

వారు తమ వద్దకు వచ్చే వారికి అనుక్షణం శివనామస్మరణ చేయమని చెప్పేవారు. "మీ చేతులు పనులు చేస్తూ వున్నా, నోటితో శివమంత్రం జపించండి. దాని వలన మీకు కళ్యాణమౌతుంది" అని సిద్ధులు చెప్పేవారు. "డబ్బూ, దస్కం అక్కర్లేకుండా, ఎక్కువ శ్రమ లేకుండానే పుణ్యము, సుఖ, శాంతి, సౌభాగ్యాలు మీకు అనాయాసంగా లభిస్తూ వుంటే, మీరు ఎందుకు శివనామ స్మరణ చేయరు?" అని అనేవారు. ముక్తిని పొందే అతి సులభమార్గాన్ని మన ఇంటి వాకిలికి తెచ్చి నిల్పిన సరళ సాధువు సిద్ధులు. సిద్ధుల నోటి మాటయే మహామంత్రము. వారు నడిచి చూపినదే నిజమైన బాట. వారు ఏ వర్ణాశ్రమానికీ అంటని అత్యాశ్రమియైనారు. సిద్ధుల అతి సరళ జీవనము, మూఢుని మనస్సుకి కూడ చటుక్కున స్ఫురించేటట్లు తత్వాన్ని బోధించే నేర్పు, నిష్కల్మష మానవ ప్రేమ, జాత్యాతీత భావన, జీవుల ఉద్ధరణ, నైష్ఠిక బ్రహ్మచర్యము, ఉదాత్తనీతి, అతుల వైరాగ్యము, నిస్వార్థ సేవ, నిర్మమకార బుద్ధితో సిద్ధులు భక్తులకు సాక్షాత్తు శివుడే అయ్యారు. వారి అపార జ్ఞాన రాశి, సిద్ధి, కారుణ్య గుణములు లక్షలాది భక్తులను తమ వద్దకు లాగుకొని వచ్చేవి.

ఒకసారి కొందరు ఊరి పెద్దలు సిద్ధులను పరీక్షింపదలచి కొందరు వేశ్యలను వారి వద్దకు పంపించారు. వాళ్ళు సిద్ధుల దగ్గరకు వెళ్లడంతోనే సిద్ధులు, "రండి తల్లీ గురువు మీకు శుభము కలుగజేస్తాడు" అని ఆహ్వానించారు. సిద్ధుల ఎదుట వారి అపక్వ బుద్ధి వెన్న కరిగినట్లు కరిగిపోయింది. సిద్ధులను చెడగొట్టాలని వచ్చిన వారు తామే చెదిరి వెళ్లిపోయారు. సిద్ధుల చూపులో ఈమె పతివ్రత, ఈమె వేశ్య అనే తారతమ్య భావమే కనిపించలేదు. కొందరు పాపాలు చేసి సిద్ధుల వద్దకు వస్తే వారిని దగ్గరకు తీసుకొని "తల్లీ, రోగులే వైద్యుని వద్దకు వస్తారు. రండి! గురువు మీకు కళ్యాణము చేకూర్చుతాడు" అని చెప్పేవారు.

మంగళవారపేటలోని రుద్రాక్షి మఠస్వాములవారైన శ్రీ చన్నమల్లప్ప స్వాములకు సిద్ధుల పట్ల చాల భక్తి. నిజగుణులే సిద్ధుల రూపంలో మళ్లీ జన్మించారని వారి నమ్మకం శ్రీ చన్నమల్లస్వామి సిద్ధులను రుద్రాక్షి మఠానికి తీసుకువెళ్లి, పూజ గావించేవారు ఒకసారి రుద్రాక్షి మఠపు మహాద్వారం మీద "ఓం నమఃశివాయ" అనే మంత్రాన్ని చెక్కిస్తున్నారు. లింగాయతులు చాల మంది గుప్తంగా వుండవలసిన మంత్రాన్ని అట్లా చెక్కించరాదని అడ్డుకొన్నారు. కొందరు సిద్ధుల భక్తులు తప్పులేదని వాదించటంతో పరిస్థితి విషమంగా మారింది. "అసలా సిద్ధారూఢుడెట్లా ఈ మఠానికి వస్తాడో చూస్తాం మేం" అని కొందరు రాళ్లు, కర్రలు తీసుకొని కూర్చున్నారు. ఈ విషయం సిద్ధుల చెవిని పడింది. "భక్తుల మనస్సుకు కష్టం కలిగేటప్పుడు నేను రుద్రాక్షి మఠానికి వెళ్లడం మాత్రం ఎందుకు?" అని వెళ్లలేదు.

సిద్ధులు తాము లింగం ధరించనప్పటికీ వారిని సేవించే భక్తులకు లింగాన్ని త్యజించమని ఆయన బోధించలేదు. వారిని సేవించే లింగాయతులు, వారిని చూసి తమలింగాలను త్యజించనూ లేదు. శ్రీ నిర్వాణప్ప గాని, అక్కలకోట శరణప్ప,షణ్ముఖస్వామి, ఖాస్గత స్వామి గానీ లింగాలను ధరించే వారే. ఉదయాన్నే లింగార్చన చేసుకొనే వారే. "మీ పూజ జరగనివ్వండి" అనే వారు సిద్ధులు.

ఒకసారి ఒక వ్యక్తి సిద్ధుల వద్దకు వచ్చి "స్వామీ, మీరు లింగము లేకుండా ఆత్మోద్ధారణకి దారి ఎట్లా చూపిస్తారు?" అని అడిగాడు. వచ్చిన వానిని కూర్చోమని చెప్పారు

సిద్ధులు. అతని యోగక్షేమాలు విచారిస్తూ, "నెవ్వెక్కడి వాడివి? సిద్ధారూఢుల మఠం ఇక్కడ వుందని ఎట్లా తెలిసింది?" అన్నారు. "స్వామీ, నేను రైల్వేస్టేషనులో అడిగితే, పాత హుబ్లీకి వెళ్లమన్నారు. పాత హుబ్లీకి రావడంతోనే "సిద్ధారూఢుల మఠానికి దారి" అని ఒక బోర్డు వుంది. దాని ప్రకారం వచ్చాను" అని చెప్పాడు. "అయ్యా! ఆ బోర్డునీకు ఏమి చూపించింది?" అన్నారు సిద్ధులు. "మఠానికి వెళ్లేదారి చూపించింది" అన్నాడు. "అయ్యా! అయితే నీకు దారి చూపించిన ఆ బోర్డును నీతోపాటు తీసుకరాలేదేమిటి?" అనడిగారు సిద్ధులు. "స్వామీ, మఠానికి రావడం నా లక్ష్యం. నా లక్ష్యసాధనకు దారిలో ఆ బోర్డు ఒక సంజ్ఞ మాత్రమే. కార్యం సాధించిన తర్వాత, సాధనము యొక్క అవసరము వుండదు" అన్నాడతను. అప్పుడు సిద్ధులు "చూడయ్యా! ఈ లింగము కూడా దాదాపు ఆ బోర్డు చేసే పనే చేస్తుంది. పైకి ఎక్కడానికి నిచ్చెన ఆసరాగా తీసుకుంటారు. పైకి వెళ్లిన తర్వాత ఆ నిచ్చెనను కూడా తీసుకుపోరు. కాబట్టి లింగము ఆరంభంలోనే గానీ అదే అంత్యం కాదు" అని బోధించారు.

సిద్ధుల దీక్షా పద్ధతి అత్యంత సరళము. ఆడంబరం గానీ, ప్రదర్శనాబుద్ధిగానీ లేని ఈ నిర్మల సాధువు చేతినుండి దీక్ష తీసుకోవాలని ఎంతో మంది వచ్చేవారు ఒకసారి బొంబాయి నుండి కొందరు భక్తులు దీక్షతీసుకోవాలని వచ్చారు. దీక్షకు కావలసిన పూవులు, పండ్లు, వెండి పాత్రలు, గురుకానుకలు అన్నీ సిద్ధంచేసుకొని కూర్చున్నారు. సిద్ధులవన్నీ చూసి నవ్వి, దీక్షను స్వీకరించడానికి మనస్సు ఎంత ఉత్కంఠతతో వున్నదో అనేది ముఖ్యంగానీ, ఇవి కావు" అని చెప్పి "రండి! రండి! త్వరత్వరగా రండి!" అని పిలువ సాగారు. అప్పుడు ఒకడు, "స్వామీ! ఎందుకింత హడావుడి?" అని అడిగితే సిద్ధులన్నారు "ఓరి పిచ్చివాళ్ళారా! కన్ను మూసి తెరిచేటంతటిలో బుద్ధి మారిపోతుంది. అంతలోకి అసలు ఈ దీక్ష తీసుకోవటం ఎందుకు. అనే దుర్బుద్ధి పుట్టవచ్చు, అందుకని" అని అందరనూ పిలిచి శివమంత్రం ఉపదేశించారు.

గద్వాలకు చెందిన శ్రీమంతుడొకడు ఒకసారి శివరాత్రికి ఉపదేశం పొందడానికి సిద్ధుల వద్దకొచ్చాడు. సిద్ధులు ఉత్సవంలో పల్లకీలో వున్నారు. వెళ్ళి విన్నవించుకొన్నాడు.

సిద్ధులు, "అట్లాగే దీక్షనిస్తాను. పల్లకీ ఊరంతా తిరిగి వచ్చే వరకు ఉత్సవంలో బాకా ఊదుతూరా!" అన్నారు. ఖరీదైన దుస్తులు, ఆడంబరమైన వేషమున్న ఆ ధనికునకు దిక్కుతోచలేదు. కానీ, గుర్వాజ్ఞను పాటించి తీరాలన్న సంకల్పంతో, బాకా ఊదుతున్న ద్యామణ్ణ వద్దకు వెళ్ళి, సిద్ధుల ఆజ్ఞను చెప్పి, తనకు బాకా ఇమ్మన్నాడు. ఆ ద్యామణ్ణ విషజ్వరంతో బాధ పడుతూ వున్నవాడైనా "అయ్యా! ఈ పుణ్యాత్ముని సేవ, ఈ దేవుని సేవ నాకు ఈ జన్మలో లభించింది. జ్వరం వస్తే ఏమయింది? నా సేవను మాత్రం నేను విడువను" అని బాకా ఇవ్వడానికి ఒప్పుకోలేదు. ఆ శ్రీమంతుడు అతనిని పరిపరివిధాల వేడుకొని, చివరకు కాళ్ళు పట్టుకొన్నాడు. ఆ శ్రీమంతుని దైన్యతకు కరిగి, చివరకు ద్యామణ్ణ ఆ బాకా అతని చేతికిచ్చాడు. ఎట్లా ఊదాలో చూపించాడు ఎవరైనా చూస్తారేమో, తనను అపహాస్యం చేస్తారేమో అనే జంకు, తాను శ్రీమంతుడిననే అహంకారము పటాపంచలయ్యాయి. పల్లకీ తిరిగి మఠానికి వచ్చేవరకు ఆ ధనికుడు బాకా ఊదుతూ సిద్ధుల సేవ చేసుకొన్నాడు. అప్పుడు సిద్ధులతనిని పిలిచారు "దీక్షనిస్తాను రా!" అన్నారు. దానికా ధనికుడు, "స్వామీ! తమ ఆశీర్వాదం అప్పుడే లభించింది. మీ మంత్రం స్వీకరించాను. మీరే నా హృదయంలో వచ్చి కూర్చున్నాక బాహ్యమైన మంత్రం ఏం చేస్తుంది?" అని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"హుబ్లీలో శివుడున్నాడు. ఆ పరమశివుని రోజూ కళ్ళారా చూచే మీరు ధన్యులు" అని అథణి శివయోగి అనేవారు. హృషీకేశంలో నివసించే శ్రీ గోవింద స్వామి సిద్ధుల వద్దకు వచ్చి, ఆరేసి నెలల పాటు వుండి వెళ్తుండేవారు. "ఇంతటి పరిపూర్ణులను వేరెక్కడా చూడలేము" అనేవారు.

అయితే సిద్ధుల కీర్తి కొందరి అసూయకు కారణమైంది. సిద్ధులను దూషించే ఒక పెద్ద వర్గం తయారైంది. వాళ్ళందరూ కలిసి సిద్ధులను చంపితే గానీ, హుబ్లీకి పీడవిరగడవదని తలచి, బంగారం ఆశ చూపించి ఒక ముసలి దాని చేత సిద్ధులకు విషాన్నం పంపించారు. 1915-16 సం॥ శ్రావణమాసంలో ఒక రోజున సిద్ధులు భోజనం కావించి, పడుకొన్నారు. ఒక ముసలిది వచ్చి సిద్ధులకు నమస్కరించి "దేవా! మీ కోసమై ప్రసాదం ఎంతో విశేషంగా తయారు చేసి తెచ్చాను. స్వీకరించి ఈ భక్తురాలిని ఉద్ధరించవలసింది" అని వేడుకొన్నది. "తల్లీ! ఇప్పుడే నేను ప్రసాదం తీసుకోవడం

అయిపోయింది. నేను రోజులో ఒక్కసారి మాత్రమే తీసుకొంటానని నీకు తెలియదా! కొంచెం ముందుగా వస్తే, నీవు తెచ్చిన ప్రసాదమంతా స్వీకరించేవాడిని కదా!" అన్నారు సిద్ధులు. కానీ ఆమె విడిచిపెట్టలేదు. బంగారం మీది ఆశతో మరింత ధైర్యం తెచ్చుకొని స్వామీ మీ కోసం ఎంతో శ్రమపడి చేసుకొచ్చాను. మీరు స్వీకరించకపోతే నేను ఈ రోజు అన్నంముట్టను, ఉపవాసముంటాను" అని దీనంగా ప్రార్థించింది.

సిద్ధులు "అవునమ్మా! అవును! నీవు నా కోసం విశేషప్రసాదం తయారు చేయడానికి రెండు నెలల నుంచి శ్రమపడుతున్నావని నాకు తెలుసు. చూడు తల్లీ! తెచ్చినది అది ఏదైనా కానివ్వు ప్రసాదమే. నీవు ఏ భావంతో వచ్చినా అది నాకు భక్తిగానే కన్పిస్తుంది. నీవు ఉపవాసముంటే నీ పొట్టలోని అన్నబ్రహ్మను హింసించిన వాడినౌతాను. వద్దు. ఇటుతే నీ ప్రసాదం" అని ఐదు వేళ్ళతో గుప్పెడు విషాన్నం తీసుకొన్నారు. సాధారణంగా సిద్ధులు భక్తులు తెచ్చిన దానిలో నుండి ఒక ముద్ద హస్త ప్రసాదంగా వారి నోటిలో పెట్టి, పిమ్మట తాము తీసుకొంటారు. కానీ, ఇప్పుడట్లా పెట్టలేదు. "అమ్మా! నీవు తెచ్చిన ప్రసాదం తిన్నానో లేదో అని అపనమ్మకం పడతారు. ఇదుగో నీ ఎదురుగానే తింటున్నాను" అని చెప్పి నోట్లోవేసుకొన్నారు. తన కార్యం సాధించినందుకామె అత్యంత సంతోషంతో వెనుదిరిగింది. సిద్ధులామెను వెనక్కు పిలిచి "ఈ మిగిలిన అన్నం ఎక్కడా పారవేయకుండా భూమిలో పూడ్చిపెట్టు. త్వరగా పారిపో! భక్తులు చూస్తే నిన్ను ప్రాణాలతో వదలరు" అని చెప్పారు.

ఆరూఢులు తాము నోట్లో పెట్టుకొన్న ముద్దను బయటకు ఊయకుండా "నేను అనుభవించాలని నిర్ణయింపబడి వచ్చిన ఈ విషాన్నాన్ని ఈ రోజు నేను విడిచి పెడితే, రేపు ఇంకో రోజైనా దీన్ని అనుభవించక తప్పదు" అని తలచి మ్రింగారు. అది శరీరమంతటా వ్యాపించి తీవ్రంగా బాధపెట్ట సాగింది. పీఠం మీద కూర్చుని, భక్తబృందాన్నంతా దగ్గరకు పిలిచి, "నేను 21 రోజులు సమాధిలో ఉండాలి. మీరెవ్వరూ నన్ను కదిలించవద్దు" అని చెప్పి ధ్యానసమాధిలోకి వెళ్ళిపోయారు.

స్వామి వారికి విషం పెట్టిన సంగతి తెలుసుకొన్న భక్తులు భయపడిపోయి వెంటనే గొప్పగొప్ప వైద్యులను పిలుచుక వచ్చారు. సిద్ధులు నిరాకరించి, తామప్పుడే దేహత్యాగం చేయబోవటం లేదని అభయమిచ్చి, అందరనూ ఏకాగ్రమైన మనస్సుతో గురుధ్యానంలో నిమగ్నం కావలసిందని ఆదేశించారు.

సద్గురునాధులకు విషజ్వాల రోజు రోజుకూ ఎక్కువ కాసాగింది. గొంతు, శిరస్సు వాచిపోయి గుర్తుపట్టలేనట్టుగా అయిపోయారు. నాలుక బయటకు వచ్చింది. నోట్లో నుంచి నురుగు కారుతున్నది. భక్తులు అది చూచి "గురునాధులు మనల్ని విడిచి పెట్టి వెళ్ళిపోతున్నారు" అని కన్నీరు మున్నీరుగా విలపించసాగారు. అంతటి స్థితిలోనూ సిద్ధులు 'భయపడవద్దు' అని చేతితో సౌంజ్ఞచేస్తూ, వారిని శాంతపరచారు.

ఇదే సమయమని భావించి, మఠంలో వుండే ఒక స్వార్థపరుడైన సాధువు తానే ఉత్తరాధికారి అయ్యేటట్లుగా ఒక దొంగ వీలునామా సృష్టించాడు. ఈ సంగతి బయటపడి భక్తులు వెంటనే అతనిని మఠంనుంచి బయటకు వెళ్ళగొట్టారు.

సిద్ధులకు విషం పెట్టిన సంగతి ఎవరో కబీర్ దాసుకు తెలియజేసారు. అతడు పరిగెత్తుకొంటూ వచ్చి, పెల్లుబికివస్తున్న దుఃఖంతో, సిద్ధుల దగ్గర కూర్చుని హృదయవిదారకంగా రోదిస్తూ, "అప్పా" అని ఎలుగెత్తి పిలిచాడు. "ఈ పరమాత్మయే వెళ్ళిపోతే, నాకిక గతి ఎవరు? అంతటి దైవమే వెళ్ళిపోయాక నేనుండడం ఎందుకు?" అంటూ ప్రాణత్యాగం చేయడానికని అక్కడే వున్న త్రిశూలం ఎత్తి గుండెలో గుచ్చుకొనబోతూ వుండగా సిద్ధులు వద్దని చిన్నగా చేత్తో వారించారు. కబీరుకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది. మళ్ళీ ఒకసారి "అప్పా" అని పిలిచాడు. సిద్ధులు క్షీణస్వరంతో "ఏమిటి కబీరు"? అన్నారు. "అప్ప మాకోసం వున్నారు. అప్ప వెళ్ళిపోలేదు.. నా తండ్రి నా కోసమే వున్నాడు" అంటూ సిద్ధుల కాళ్ళు, చేతులు, శరీరం ముద్దుపెట్టు కొంటూ, ఆనందభాష్పాలు రాల్చాడు. సిద్ధుల పాదాల మీద శిరస్సు వుంచి "దేవా! ఈ దేహము నీ వలన పావనమైనది. అది నీ ముందుగానే వెళ్ళిపోవాలి. ఇది నా కోరిక! తండ్రీ, ఆశీర్వదించండి"! అని వేడుకొన్నాడు. సిద్ధులు సరేనన్నట్లుగా కబీరు తలను చేత్తో నిమిరారు.

ఈవిధంగా 21 రోజులు గడిచేసరికి సిద్ధుల శరీరంలో వ్యాపించిన విషం యొక్క శక్తి మెల్లమెల్లగా క్షీణింపసాగింది. ఇరవై ఒకటవ రోజున సమాధి నుంచి లేచి కూర్చున్నారు సిద్ధులు. కాలకూట విషాన్ని ఆరగించుకొని సాక్షాత్తూ పరమశివుడే అయ్యారు సిద్ధులు. గురువుగారులేచి కూర్చోవటం చూచి, భక్తులకు పట్టలేని ఆనందమైంది. అందరూ జయజయ ధ్వానాలు చేస్తూ, మంగళ హారతి ఇచ్చారు.

సిద్ధులు కోలుకొనేటంతలో విషం పెట్టిన ఆ ముదుసలికి మతి భ్రమించి "దేవా! నీకు విషం పెట్టనా?" అంటూ పశ్చాత్తాపంతో ఆక్రోశిస్తూ, జుట్టుపీక్కుంటూ వీధుల్లో తిరిగేది. "స్వామీ, నేను తప్పు చేశాను. స్వామీ, నేను తప్పు చేశాను". అంటూ హృదయవిదారకంగా రోధిస్తూ వుంటే ఎవరో వచ్చి సిద్ధుల చెవిన వేశారా విషయం కారుణ్య సాగరులైన గురునాధులు అతను తెచ్చిన టాంగాలో ఆమె ఇంటికి వెళ్ళారు ఆమె సిద్ధుల రెండు కాళ్ళకూ చుట్టుకొని కన్నీరు మున్నీరుగా విలపించసాగింది ఆమె తల మీద సిద్ధులు తమ పాదాన్నుంచారు. ఆమె ప్రాణం విడిచింది. సిద్ధులు లేచి, తర్వాత కార్యక్రమాన్ని జరిపించమని చెప్పి, మఠానికి వచ్చేశారు.

శ్రీ సిద్ధారూఢ ప్రభువులు మహావిషాన్ని సేవించి, బ్రతికిన వార్త దేశం మూల మూలలకూ వ్యాపించింది. అందరూ "వీరు సాక్షాత్తూ నీలకంఠులే" అని స్తుతించారు కొంత కాలానికి రాక్షసనామ సంవత్సర కార్తీక బహుళ నవమినాడు కబీరుదాసు ఇహలోకయాత్ర చాలించి, శ్రీ గురు పాదాల వద్ద అసువులు విడిచాడు. ఆ పూజ్యుని శరీరాన్ని భూ సమాధి యందుంచి, దానిమీద పాలరాళ్ళతో సుందరమైన సమాధి కట్టించారు. ప్రతి సంవత్సరమూ ఉత్సవాలప్పుడు ఆ సమాధికి వైభవంగా పూజలు జరిపే సాంప్రదాయం ఈ నాటికీ వున్నది. కొంతకాలం గడిచిన తర్వాత సద్గురువుల సమాధి మందిరం మీద భక్తులు అందమైన గోపురాన్ని కట్టించి, దానిమీద బంగారు కలశాన్ని ప్రతిష్ఠించారు. పిమ్మట శ్రీరామనవమికి శ్రీసద్గురువుల జన్మోత్సవాన్ని కసబీపేటలో జరిపారు. పదమూడవ రోజున స్వామి వారిని సుందరంగా అలంకరించి శ్రీ గంధపు ఊయలలో కూర్చోబెట్టి నామకరణోత్సవం జరిపి ఉత్సవం పూర్తిచేసేవారు. ఇదే విధంగా ప్రతి సంవత్సరం జరిపే సాంప్రదాయం ప్రవేశపెట్టారు. పండరీపురంలో వలెనే ఆషాఢ, కార్తీక మాసాల్లో ఇక్కడకూడ భాగవత సప్తాహం ప్రతిసంవత్సరమూ జరపాలని నిశ్చయించారు. ఇదిగాక ప్రతీ సోమవారమూ కీర్తన, పాదపూజ చేసేవారు. ఈ ఉత్సవాలన్నీ అత్యుత్సాహంతో జరిపే వారని భక్తులందరూ చెబుతారు.

గౌరీ పున్నమి ఉత్సవానికి చేయించిన రథం లాగడానికి అక్కడ తగినంత చోటులేదు. ఒకరోజు ఉదయం హుబ్లీలోని తేజప్ప అనే శ్రీమంతుడు వచ్చి"స్వామీ! నిన్నరాత్రి నా తండ్రి నాకు కలలో కన్పించి, 'సిద్ధారూఢుల రథం లాగడానికి అవసరమైన

భూమి పరిశుద్ధమైన మనస్సుతో ఇవ్వు దానివలన నాకు తృప్తి లభిస్తుందని చెప్పాడు. కాబట్టి స్వీకరించవలసింది" అని చెప్పి కొంతభూమి రాసిచ్చాడు. ఒకసారి భక్తుల కోరిక మీదట సిద్ధులు వారితో పాటు గోకర్ణ క్షేత్రానికి ప్రయాణమయ్యారు. మొదట ఆరూఢులు శ్రీ గజదండ గురువుల సేవలోవున్నప్పుడు, వారితో వాదము పెట్టుకొన్న సుబ్బయ్య శాస్త్రి కొన్ని సంవత్సరాలు సురపుర రాజ్యంలో ఆస్థాన పండితుడుగా వుండి, వృద్ధుడైన తర్వాత దేశసంచారం చేస్తూ, చివరకు గోకర్ణానికి చేరుకొన్నాడు. అతడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ ఒకచోట "సిద్ధ, సిద్ధ" అంటూ సిద్ధుని ధ్యానిస్తూ పడుకొన్నాడు. ఆ స్వరాన్ని విన్న ఆరూఢులు "ఎవరు నీవు?" అని అడిగారు. వెంటనే సుబ్బయ్యశాస్త్రి ముఖం పైకెత్తి చూసి, "సిద్ధా నేను పండితుడననే అహంకారంతోనూ, మంద బుద్ధితోనూ మీతో వాదించి పరాభవం పొందిన సుబ్బయ్యశాస్త్రిని. శివుని అవతారమైన సిద్ధులను నిందించి మహాపరాధం చేశానన్న వ్యథతో, తమ క్షమకు పాత్రుడనైతే నాకు మరుజన్మలోనైనా మోక్షం లభిస్తుందని భావించి దేశదేశాల్లోని క్షేత్రాలన్నీ మీ కోర్కై వెదుకుతూ తిరుగసాగాను. కానీ మీరు నాకెక్కడా లభించలేదు. అందువలన నా దౌర్భాగ్యానికి విలపిస్తూ, దిక్కుతోచక, చివరకు గోకర్ణ క్షేత్రానికి వెళ్ళి అక్కడ ప్రాణత్యాగం చేయాలని ఇక్కడకు వచ్చాను. కానీ, అంత్య సమయానికి నీవే వచ్చి నాకు దర్శనమిచ్చి, ధన్యుణ్ణి చేశావు! మీ కృపకు పాత్రుణ్ణి కావాలన్న నా కోరికను మన్నించి, నన్ను ఉద్ధరించవలసింది. మొదట నేను చేసిన అపరాధాన్ని మన్నించి రక్షించవలసింది" అని అర్థిస్తూ ఆరూఢుల పాదాల మీద వ్రాలాడు.

సిద్ధులు అతడిని లేవనెత్తి "మరణ సమయంలో ఎవరు మనస్సులో ఏ భావనతో దేహాన్ని విడుస్తారో, వారికి అటువంటి శరీరమే వస్తుంది. కాబట్టి నీవు కూడ సద్భావంతో ప్రాణాలు విడిస్తే, అదే విధమైన దేహం నీకు లభిస్తుంది. పిమ్మట గురుభక్తి జనించి, నా వద్దకు వస్తావు. ఇది గురు సంకల్పము" అని ఆశీర్వదించారు. గురువచనాన్ని ఆలకించి సుబ్బయ్యశాస్త్రి, సిద్ధులను ధ్యానిస్తూ ప్రాణాలు విడిచాడు.

ఇటు ఆరూఢులు తమ శిష్యులకు క్షేత్రాలన్నీ చూపించి అక్కడ కొన్ని రోజులు కాలం గడిపి, మళ్ళీ హుబ్లీకి వచ్చారు. మరణించిన శాస్త్రి, స్వర్గ నరకాదుల సుఖ

దుఃఖాలను అనుభవించి, పిదప గరగ గ్రామంలోని శ్రీ మడివాళ స్వామి వారి భక్తులైన శివబసప్ప, శివలింగమ్మల పుత్రునిగా జన్మించాడు. శివపుత్రుడు 12 సంవత్సరాల వాడయ్యాడు. తల్లి దండ్రులతనికి వివాహం చేశారు. కానీ పూర్వజన్మ కర్మాన్ననుసరించి శివపుత్రుడు 14 సం॥లకే ఇల్లువిడిచి హుబ్లీలోని శ్రీ సిద్ధారూఢుల సన్నిధికి వచ్చాడు. అతడు పూర్వజన్మలో సుబ్బయ్యశాస్త్రి అని తెలిసిన సిద్ధారూఢులు అతడు పూర్వజన్మలో సంస్కారం వలన గొప్ప పండితుడౌతాడని తెలుసుకొని, సంస్కృత పాఠశాలకు పంపించారు. శివపుత్రుడక్కడ అతి శీఘ్రంగా విద్యనభ్యసించి, స్వామి వారి సన్నిధిలో ఉపనిషదర్థాన్ని శ్రవణం చేయసాగాడు. అది చూచి సద్గురువెంతో సంతోషించారు. ఇది గాక శివపుత్ర స్వామికి వేదాంతంలోని మర్మాలన్నీ వివరించి బోధించారు. సద్గురువులు తాము బోధించిన విషయాలను శ్రోతలందరకూ శ్రవణం చేయమని శివపుత్ర స్వామికీ, శరణప్పకూ అనుజ్ఞ ఇచ్చారు. వారిద్దరూ మఠంలో రెండు ప్రొద్దులా ముముక్షువులకు శాస్త్రశ్రవణం గావిన్నూ, గురుభక్తితోను, వైరాగ్యంతోనూ మఠంలోనే ఉండసాగారు.



# శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర

## అధ్యాయం - 8

ఉజ్జణ్ణ భీమప్పగారి దత్తపుత్రుడు సిద్ధప్ప. సిద్ధప్ప కొడుకు గురప్ప. గురప్ప అంటే సిద్ధులకు ప్రత్యేకమైన ప్రేమ. గురప్పకు చిన్నతనంలోనే తల్లి చనిపోవడంతో సిద్ధులే అతనికి తల్లీతండ్రియై పెంచారు. గురప్పకు ఐదు సంవత్సరాలు వచ్చే సరికి బడిలో వేశారు. బడిలో గురప్ప ఎవరితో కలవక తనలోతాను, ఎటో శూన్యంలోకి చూస్తూనే కూర్చునేవాడు. అతనికి లౌకికమైన చదువు మీద ఆసక్తి కలుగలేదు. అతని కన్నులలో దైవీకాంతి ప్రస్ఫుటించేది. గురప్పకు సిద్ధుల వద్ద చనువు ఎక్కువ. సిద్ధుల మీద ఎక్కితొక్కేవాడు. చెవి కొరికేసేవాడు. సిద్ధుల మీసాలు పట్టుకొని లాగేవాడు. భుజం మీద ఎక్కి కూర్చునేవాడు. ఇట్లా ఎన్ని చేసినా సిద్ధులు ఆనందంగా సహించేవారే గానీ, ఎన్నడూ కోపగించుకొనే వారుకాదు. ఒకసారి ఉత్సవం పనులతో బాగా అలసిపోయి సిద్ధులకు జ్వరం వచ్చింది. వారికి విశ్రాంతి ఇవ్వాలన్న ఉద్దేశంతో ఆరోజు శాస్త్రబోధ కూడ కట్టిపెట్టారు. వారు నిద్రపోవడానికి అవకాశం కల్పిస్తూ భక్తులందరూ బయటకు వచ్చి కూర్చున్నారు. ఇంతలో గురప్ప వెళ్లి పడుకొన్న సిద్ధుల వక్షంమీద కూర్చుని, వారి ముఖమంతా గిచ్చుతూ, నోటితో కొరుకుతూ ఆడుకోసాగాడు. అది చూచిన భక్తులకు చాలా బాధ కలిగి "అప్పా గురప్పను బయటకు పంపించెయ్యండి" అన్నారు. అప్పుడు సిద్ధులిట్లా అన్నారు. "మొదట నేనే గురప్ప మీద ఎక్కి కూచుని రకరకాలుగా నొప్పించే వాడిని. కాబట్టి ఇప్పుడితను నామీద ఎక్కి కూచుంటే నాకు హితమేగాని కష్టం కలుగదు". అదివిన్న భక్తులందరకూ ఆశ్చర్యం కల్గింది. గురప్పమీద సిద్ధులు ఎప్పుడు ఎక్కికూర్చున్నారు? ఏమిటి? అని భక్తులందరూ ఆశ్చర్యపోతూ వుంటే, సిద్ధులు లేచి కూర్చుని, "అక్కడ రోడ్డు మీద ఆడుకొంటూ వున్న ఆ పిల్లవాణ్ణి తీసుకురండి" అన్నారు. భక్తులు వెళ్ళి పిలుచుకొని వచ్చారు. సిద్ధులు వాడికొక అరటి పండు ఇచ్చి తినమని చెప్పి, వాడిమీద తమ యోగదృష్టిని నిల్పారు. వెంటనే ఆ పిల్లవాని ముఖం మీద ఒక అలౌకిక తేజస్సు వ్యాపించింది. "ఈ బాలుని నోటినుండి గురప్ప పూర్వ జన్మ వృత్తాంతం వినండి'

అన్నారు సిద్ధులు. ఆ కుర్రవాడు, సిద్ధులు శ్రీశైలం అడవుల్లో ఒక పులిమీద ఎక్కి తిరిగే వారనీ ఆ పులితో ఆటలాడుతూ, చెవులు, తోక మెలిపెడుతూ అనేక విధాల ఆ పులిని బాధిస్తూ దానితో ఆటలాడేవారనీ, ఆ పులి ఒక వేటగాని తుపాకి గుండుకు బలియై సిద్ధుల చరణాల వద్ద ప్రాణం విడిచి ఆ పశుజన్మను వదిలి ఇప్పుడు గురప్పగా నరజన్మను పొందిందనీ వివరించాడు. సిద్ధులు మరొక అరటి పండు తినిపించడంతో ఆ బాలుడు మామూలు స్థితికి వచ్చాడు. పరుగెత్తుకొంటూ వెళ్ళిపోయి ఆటల్లో మునిగి పోయాడు. తర్వాత ఎంతమంది పిలిచి ఆ పిల్లవాడిని గురప్ప పూర్వజన్మ గురించి ప్రశ్నించినా "నాకేమీ తెలియదు" అనేవాడు. అదంతా సిద్ధులు యోగదృష్టిని నిల్పిన ప్రభావం! ఇదే విధమైన లీల అక్కలకోట స్వామి చరిత్రలో కూడ కనిపిస్తుంది.

అటువంటి అనుబంధం వుండబట్టే సిద్ధులు ఒక్కక్షణం గురుప్పను విడిచి పెట్టేవారు కాదు. గురప్ప సిద్ధులను విడిచి పెట్టేవాడు కాదు. ఒకసారి శ్రావణమాసంలో సిద్ధులు శాస్త్ర ప్రవచనం చేస్తూవున్నారు. గురప్ప ప్రాంగణంలో ఆటలాడుతూ వున్నాడు. ఉన్నట్టుండి గురప్ప "దేవా! వాని ఇల్లు దొంగలు దోచుకొన్నారు. వాని ఇల్లు దొంగలు దోచుకొన్నారు" అని తనలో తాను అనుకొంటూ వుంటే, అది సిద్ధుల చెవిన పడింది. వారు ఒక్క నిమిషం శాస్త్రప్రవచనం ఆపి "అవునా? దొంగలు దోచుకొన్నారా చూచి వస్తానుండు" అని పదిసెకండ్లు కళ్ళుమూసుకొని అంతర్ముఖులైనారు. కళ్ళు తెరిచి, "అవును గురప్పా చూచి వచ్చాను. దొంగలు పాతగుడ్డకూడా మిగల్చలేదు. కానీ దాని వలనఇతనికి శుభమే జరుగుతుందిలే" అన్నారు. అక్కడ కూర్చున్న జనులకు వీరి సంభాషణ ఏమాత్రం అంతుబట్టలేదు. ఒకరు లేచి అడిగారు కూడ. అప్పుడు సిద్ధులు అక్కడ కూర్చుని వున్న ఒక శ్రీమంతుని చూపిస్తూ "ఈ రామదాసు ఇంట్లో దొంగలు పడి సర్వం దోచుకుపోయారు. కానీ, అతనికి శుభమేలే" అని చెప్పారు. ఆ శ్రీమంతుడు సిద్ధుల సేవ చేసుకోవడానికై బెంగుళూరు నుంచి హుబ్లీ వచ్చి ఒక చిన్నగది తీసుకొని వుండేవాడు. తనతోబాటు చాల ధనం తెచ్చుకొన్నాడు. అతడు తెల్లవారు జామునేలేచి మఠానికి వచ్చి పగలంతా సిద్ధుల సన్నిధిలోనే గడిపి మళ్ళీ రాత్రికి ఇల్లు చేరుకొనేవాడు. ఇంటివద్ద ధనం వుండటంతో మఠంలో కూర్చున్నా అతని మనస్సు మాటి మాటికీ ఆ ధనం జాగ్రత్తగా వున్నదోలేదో అనే విషయం మీదకే

పోతూ ఉండేది. ఆ వున్నది కాస్తా పోయింది. కాబట్టి ఇక నిశ్చితంగా, మఠంలోనే వచ్చివుండు అని ఆజ్ఞాపించారు సిద్ధులు. అతడట్లానే చేసి ధనమోహం నుంచి బయట పడ్డాడు. సిద్ధులాతని ప్రేమతో 'రామదాసు' అని పిలిచేవారు.

గురప్ప పెరిగి పెద్దవాడయ్యాడు. నాలుగేళ్ళు కన్నడ పాఠశాలలో చదివాడు. సిద్ధులు స్వయంగా శాస్త్ర విషయాలు బోధించేవారు. శ్రీ శివపుత్ర స్వామి గురప్పకు సంస్కృతం బోధించేవారు. ఒకసారి స్కూల్లో ఒక టీచర్ గురప్పను కొట్టేసరికి, ఏడుస్తూ సిద్ధుల వద్దకు వచ్చాడు. సిద్ధులకంతా అర్థమైంది "గురూ! నిన్ను బడికి పంపనులే! సరస్వతియే నీదగ్గరకు వెతుక్కుంటూ వస్తుంది. రా!" అని దగ్గరకు తీసుకొన్నారు సిద్ధులు. గురప్పకు పెద్దవుతున్న కొద్దీ మొండితనం పెరగసాగింది. అతని ప్రవర్తన చాలా మందికి కష్టం కలిగించేది. సిద్ధుల వద్ద సేవ చేసే పెద్దలను కూడ గురప్ప లెక్క చేసేవాడు కాదు.

ఒకసారి సిద్ధులు దేకప్ప గారింటికి ప్రసాదానికి వెళ్తున్నారు. టాంగా వచ్చి నిలిచింది. సిద్ధులు గురప్ప కోసం వెదుకుతున్నారు. గురప్ప పరిగెత్తుకొని వెళ్ళి పాఠశాలలో ఒక మూల కూర్చున్నాడు. ఎంత పిలిచినా రాడు. అంతట సిద్ధులు తమ్మణ్ణశాస్త్రి గారిని గురప్పను తీసుకురావడానికి పంపించారు. శాస్త్రి వెళ్ళి, "గురూ! అప్ప పిలుస్తున్నారు రా!" అన్నాడు. గురప్ప పరుగెత్తుకొంటూ వచ్చి శాస్త్రిగారిని కొట్టి వెళ్ళిపోయాడు. శాస్త్రికి కష్టం కలిగింది. తిరిగి వచ్చి, 'ఏమి స్వామీ! గురప్పపిలిస్తేను వచ్చి పిచ్చి పట్టినట్టు కొట్టి పోయాడు" అని సిద్ధులతో అన్నాడు. సిద్ధులు నవ్వుతూ, "శాస్త్రీ! గురప్ప శుకుని అవతారం అతనిని చూచినంత మాత్రాననే మీ నూరు జన్మల పాపాలు హరింపబడతాయి. అతని హస్తస్పర్శ కలిగిందంటే నీ కర్మ క్షయించిన దన్నమాటే! నీకు శుభం జరుగుతుందిలే! రా!" అన్నారు. "గురప్ప యోగ్యత ఇప్పుడు మీకు తెలియడం లేదు. భవిష్యత్తులో మీరే చూస్తారు" అని చాలా ముందుగానే సిద్ధులు గురప్ప భవిష్యత్తు గురించి చెప్పారు.

ఒకసారి హఠం చేస్తున్న గురప్పను పిలిపించారు సిద్ధులు. గురప్ప భయంతో చిన్నబోయిన ముఖంతో ఒక స్తంభం వెనుక నిల్చున్నాడు. సిద్ధులు గురప్ప కపాలం

మీద తీవ్రంగా ఒక దెబ్బవేశారు. ఆ దెబ్బతో గురప్ప మొండితనమూ, హఠమూ రెండూ మాయమై వివేక వైరాగ్యాలు ఉదయించాయి. గురప్ప పెద్దైన కొద్దీ ఎక్కువగా అంతర్ముఖుడై వుండేవాడు. కూర్చుంటే అట్లానే కూర్చుని వుండిపోయేవాడు. నిలబడితే అట్లాగే నిలబడి వుండేవాడు. ఏమి చేస్తున్నాననే ఆలోచనే వుండేదికాదు. సిద్ధారూఢులంతటి మహాత్ముని సాన్నిధ్యంలో అనేక ఆధ్యాత్మిక స్థితులు, అవస్థలు అనుభవయ్యేవి.

భక్తులందరూ గురప్పనే ఉత్తరాధికారిని చేయమని ప్రార్థించడంతో సిద్ధులు గురప్పకు సన్యాస దీక్షనిచ్చి, మఠానికి ఉత్తరాధికారిని గావించారు. శ్రావణోత్సవ సమయంలో ధర్మశాలలో శాస్త్ర శ్రవణం జరిగేది. ఆ సమయానికి స్వామివారికి తీవ్రంగా జ్వరం వచ్చింది. అప్పుడు వారిని ఒక కుర్చీమీద కూర్చోబెట్టి ఎత్తుకొని కైలాస మంటపానికి తీసుకువచ్చి కూర్చోబెట్టారు. అప్పుడు సద్గురువులు "గురునాధుని నా వద్దకు పిలుచుకరండి" అని చెప్పారు. గురప్పను తీసుకువచ్చారు. సిద్ధులు గురప్పతో "గురప్పా! ఈరోజు పూజకు నీవు వెళ్ళి కూర్చో" అని ఆజ్ఞాపించారు. గురునాధులు కన్నీరునిండిన కళ్ళతో అశ్రువులు కారుస్తూ స్తంభములాగ మౌనంగా నిలుచుండి పోయారు. అదిచూచి సద్గురువులు "గుర్వాజ్ఞను పాటించవా?" అని కోపంగా అరిచారు. గురునాధులు ఏమీ మాట్లాడకుండా తల వంచుకొని వెళ్ళి కూర్చున్నారు. అప్పుడు శ్రీ గురుసిద్ధారూఢులు తమ సమ్ముఖంలో కూర్చున్న సత్పురుషులందరినీ ఉద్దేశించి "గురునాధారూఢులు మీకు మాత్రమే గురువు కాదు. నాకు కూడ గురువే అయినాడు" అని సూచించారు. పిమ్మట ఆరూఢులను పూజించినట్లు గానే, గురు నాధారూఢులను అతివైభవంగా పూజించి, మంగళహారతి ఇచ్చారు.

సిద్ధారూఢులు ఒకరోజు గురునాధులను తమ ప్రక్కన కూర్చోబెట్టుకొని, "చూడు, గురూ! నీవు ఆస్తి, ఐశ్వర్యము భోగభాగ్యాలు ఈ విషయాలేమీ పట్టించుకోవద్దు. భక్తుల చేతిలో చిక్కుకోవద్దు" అని హితబోధ చేశారు.

ఈ విధంగా కాలం గడుస్తుండగా, మఠానికి ఆస్థి సంవత్సర సంవత్సరానికి పెరుగుతూ వచ్చి, సాలుకు 25,000/- రూపాయల ఆదాయం వచ్చేటంత ఆస్తి

అయింది. ఆస్తి పెరిగే సరికి మఠ సంబంధమైన వైషమ్యాలు తలెత్తి కలహాలు ప్రారంభమైనాయి. అదిచూచి, ఇచ్ఛామరణ శక్తిగల సద్గురునాథులు వారిని పిలిచి మీరు రాజీకి వచ్చినట్లయితే నేను ఇంకా ఇరవై సంవత్సరాలు బ్రతుకుతాను" అని ఆశ్వాసన ఇచ్చారు. వారు సద్గురువులయందు శ్రద్ధనుంచక, నశ్వరమైన ఆస్తికోసమై రాజీ పడకుండానే వెళ్ళిపోయారు. కేసు హైకోర్టు వరకూ వెళ్ళింది. కోర్టు మఠంలోనే ప్రారంభమై ఇరవై ఒక్కరోజులు సిద్ధారూఢుల జవాబు నడిచింది. పిమ్మట "గురు నాథారూఢులు మఠానికి ఉత్తరాధికారి కాదు. వారు ట్రస్ట్ కమిటీలో ఒకరై సమాధి పూజ గావిస్తూ వుండవలెనని జడ్జిమెంటు పాసై వచ్చింది. ఉజ్జణ్ణ సిద్ధప్ప గారు మళ్ళీ ప్రీవీ కౌన్సిలుకు అప్పీలు చేశారు. వారు ఈ కేసు మళ్ళీ క్రిందికోర్టుకు ఇచ్చారు. ఎవరో ఒక వకీలు "మూల పురుషుడు నశిస్తే, న్యాయం మీదే అవుతుంది" అని చెప్పారని, కొందరు దుష్టులు సద్గురువును హతమార్చాలని పూనుకొన్నారు.

వారు సిద్ధులకు జబ్బు చేసిందని ప్రచారం చేసి, సిద్ధులకు సేవ చేస్తామనే మిషతో వారిని నానాహింస పెట్టేవారు. ఒకరోజు సిద్ధులు వంటగదివైపుకు వెళ్తున్నారు. ఇద్దరు వారి వద్దకువచ్చి, "స్వామీ! మీకోసం ఔషధం తీసుకువచ్చాము. తీసుకొందరు రండి!" అన్నారు. సిద్ధులు నవ్వి "నాకు ఏ జబ్బూలేదు. ఇప్పుడు మందు ఎందుకు తెచ్చారు?" అన్నారు. "స్వామీ! ఔషధం తీసుకొంటే మీకు ఇక జబ్బూ, అనారోగ్యంరాదు. రండి తీసుకోండి" అన్నారు. సిద్ధులు "దీని వలన మేలు జరుగుతుందా?" అనడిగారు. "స్వామీ! ఈ ఔషధము వలన మీకు మేలు జరుగక పోయినా, మాకు మేలు జరుగుతుంది కాబట్టి సేవించండి" అన్నారు. "ఓహో! నేను ఈ మందు తీసుకొంటే మీకు శుభం కలుగుతుందా! సరే అయితే! మీ మేలుకోసం తీసుకొంటాను. పిచ్చి సన్నాసుల్లారా! భక్తులు కావాలనుకొంటే మహాత్ములు వందల సంవత్సరాలు జీవిస్తారు. జీవించగలరు. ఆ భక్తులనబడేవారే వద్దంటే ఇక ఎందుకు జీవిస్తారు? ఎవరికోసం జీవిస్తారు? భక్తియనే నూనె ఇంకిపోయాక ఇక దీపం వెలగదు. పదండి! శివుని ఇచ్ఛఇలా వున్నది" అంటూ తమ గదిలోకి నడిచారు. వారిచ్చిన ఔషధాన్ని "శివార్పితం" అంటూ గడగడా తాగేశారు. "పిచ్చివాళ్ళారా! డబ్బు మీద మీకున్న ఈ మోహం శివుని మీద

పెట్టుకొనుంటే ఎంత బాగుండేది! మిమ్మల్ని చూస్తుంటే నాకుదుఃఖం కలుగుతున్నది. కేవలం మహాత్ముని సాన్నిధ్యంలో వున్నంత మాత్రాన్నే సద్గతి కలిగేటట్లయితే, అందరికన్నా ముందు మహాత్ములు కట్టుకొన్న లంగోటాకు ముక్తి కలగాలి" అని హెచ్చరించారు.

తెల్లవారింది. పీతాంబరప్ప అనే అతనుసిద్ధుల వద్దకు వచ్చాడు. సిద్ధుల స్థితిని చూస్తూనే "దేవా! ఇదంతా ఏమిటి?" అంటూ గోడుగోడున విలపించాడు. "ప్రారబ్ధము దేహానికి ఈ శిక్షను విధించి, కర్మాన్ని క్షయింపజేసి, జీవునికి కైవల్యాన్ని ప్రసాదిస్తున్నది" అని అన్నారు సిద్ధులు. విషం పెట్టిన భక్తులు వచ్చారు. "ఇంకా చావలేదే ఈ ముసలి పీనుగ!" అనుకొంటూ, ఇంకో రెండు పీసాల ఔషధం సేవింపజేశారు.

ఇక సిద్ధుల బాధ అంతా ఇంతాకాదు. బాధతో అటూఇటూ పొర్లాడుతున్నారు. ఒళ్ళంతా మంటలు! బాధ! తాగడానికి నీరు కావాలని ఆక్రోశిస్తుంటే, ఒక్క గుక్కెడు నీరుకూడ వారికి చిక్కనివ్వలేదు. వారి బాధ చెప్పనలవికాదు. వేటగాని బాణానికి గురైన లేడివలె నిస్సహాయంగా బాధతో అటూ ఇటూ పొర్లాడుతున్నారు సిద్ధులు. పగలు గడిచి రాత్రయింది. బయట వున్న వారికి సిద్ధుల పరిస్థితిని తెలియనివ్వలేదు. రాత్రి కావడంతోనే సిద్ధులకు సేవ చేస్తామనే నెపంతో వాళ్ళు మళ్ళీ వచ్చి, సిద్ధుల కాళ్ళు, ఒళ్ళు, గొంతు పిసుకుతూ చిత్రహింస చేస్తున్నారు. ఒకడు వారి గొంతు గట్టిగా పిసుకుతూ "ఇంతచేసినా, ఇంకా చావడే వీడు" అంటూ గొణుగుతున్నాడు. ఎముకలగూడై మిగిలిన వారి శరీరాన్ని పరిపరి విధాల పీడించసాగారు. సిద్ధులు మాత్రం అంతటి బాధలోనూ "పిచ్చివాళ్ళారా! మీరిట్లా చేయడం వలన మీకు సుఖం కలుగుతుందిరా!" అంటూ మెల్లగా మందలిస్తున్నారు. "జ్ఞాని అని ఎవరిని అనవచ్చు?" అని ఒకసారి ఒక భక్తుడు సిద్ధులను ప్రశ్నించాడు. దానికి సిద్ధులు "గుండెల మీద కూర్చుని, పదునైన కత్తితో గొంతుకను పరపరాకోస్తున్నప్పటికీ, బాధపడక, శపించక, మనస్సునందుశాంతి సమాధానములతో ఎవడైతే వుండగలడో అతడే నిజమైన జ్ఞాని" అని చెప్పి వున్నారు. ఈ రోజున తమ గుండెలమీద కూర్చుని అనంత విధాల హింసిస్తున్నా వారు

కోపించలేదు - మారు మాట్లాడలేదు. అంతటి కరుణా మూర్తులు సిద్ధులు! మనకు అతి సమీపంలో అవతరించిన మరో బుద్ధుడు! మరో ఏసుక్రీస్తు!

19-8-1929 సోమవారం - ఆరోజు కైలాసమంటపంలో సిద్ధుల పూజ జరుగవలసి వున్నది. సిద్ధుల ఆరోగ్యం బాగలేదనీ వారికి సంపూర్ణ విశ్రాంతి అవసరమనీ, ఎవరూ వారి దర్శనానికి రాకూడదనీ చెప్తున్నారు. ఎంతోదూరం నుంచి వారి దర్శనానికై వచ్చిన భక్తులు నిరాశతో "సిద్ధులకేమయింది? వారి ముఖదర్శనం కూడా మాకు లభించదా!" అని అడుగుతున్నారు. చివరికి "సిద్ధులు కైలాసమంటపానికి వస్తున్నారు అందరూ అక్కడికి వెళ్ళి కూర్చోండి" అని చెప్పారు. సిద్ధులను ఒక కుర్చీలో కూర్చోబెట్టుకొని కైలాస మంటపానికి తీసుకువచ్చారు. వారికి దేహప్రజ్ఞ వున్నట్లే కనిపించదు. తల ఒక ప్రక్కకు వాలిపోతున్నది. ఒకడు వాలిపోతున్న తలను పట్టుకొన్నాడు. సిద్ధులు త్రాగిన ఔషధాన్ని ఎక్కడ కక్కివేస్తారోనన్న భయంతో, గబగబా వారిని తీసుకువచ్చి కైలాస మంటపం వద్దకు తెచ్చి కూర్చోబెట్టారు. అక్కడ ఎన్నడూ ఎక్కడా లేనంత గందరగోళంగా వుంది. ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా చెప్పుకుంటున్నారు. సిద్ధులను కూర్చోబెట్టారు. పూజ చెయ్యలేదు. నామకః ఏదో జరిపించారు. హర హర మహాదేవా అంటూ కుర్చీ ఎత్తుకొని, సిద్ధులను మళ్ళీ గదిలోకి తీసుకువెళ్ళారు.

కొద్ది రోజులక్రితమే సిద్ధులు గురప్పను తమ శిష్యుడైన శ్రీ గోవిందస్వామి గారితో మీరజ్ పంపించివున్నారు. సిద్ధులు గురప్పను పిలిపించమని చెప్పారు. హుబ్లీ నుంచి టెలిగ్రామ్ అందడంతోనే గోవిందస్వామిగారు గురప్పను తీసుకొని 21-8-1929 కి హుబ్లీ చేరారు.

బాహ్య ప్రజ్ఞ లేకుండా పడివున్న సిద్ధులు మధ్య మధ్యలో "గురప్ప వచ్చాడా! గురుప్ప వచ్చాడా!" అని అడుగుతున్నారు. చివరకు గురప్ప వచ్చాడు. సిద్ధులకు ఎదురుగా వెళ్ళి నిల్చున్నాడు. సిద్ధులను ఆ స్థితిలో చూసిన గురప్పకు నోట మాట రావడం లేదు. కన్నీళ్ళు కారుతున్నాయి. తల వంచుకొని నిలబడ్డాడు గురప్ప. సిద్ధులు గురప్పను చూశారు. దగ్గరకు రమ్మని పిలిచారు. "గురూ! అవతార సమాప్తి సమయం

వచ్చింది. నీవువచ్చే వరకూ ఎలాగో, నిలిచివున్నాను. నీవు వచ్చావు" అన్నారు. గురప్పకు పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడం సాధ్యం కావడంలేదు. తల ఎత్తక నిలుచుని వున్నాడు. "గురూ! నా కార్యం పరిసమాప్తం అయింది. ఇక అంతా నీది. నీవు దుఃఖించరాదు. రా! ఇలాదగ్గరకు రా!" అన్నారు సిద్ధులు. సిద్ధుల కెదురుగా వెళ్లి నిల్చొన్నాడు గురప్ప. "గురూ! నేను మాట్లాడి చెడ్డవాణ్ణయ్యాను. నీవు మాట్లాడవద్దు. నీవు నీలోపలే అణగివుండు. ఇకముందు ఇంకా చాలా చాలా జరుగుతాయి. నీవు నోరు మెదపవద్దు! నాలుక కదిలించవద్దు. నేను వీళ్లను నమ్మాను. నన్ను ఈ స్థితికి తెచ్చారు. నీవు ఎవరినీ నమ్మవద్దు. నమ్మితే ఆ బూడిదను నమ్ము. నేను వీళ్లచేతిలో చిక్కాను. నీవు ఎవరి చేతిలోను చిక్కవద్దు" అని చెప్పారు సిద్ధులు.

తలవంచి నిల్చున్న గురప్పను క్రిందనుంచి పైవరకు తీక్షణ యోగదృష్టితో చూశారు సిద్ధులు. వారి కనులలో నుండి ప్రసరిస్తున్న అపూర్వ తేజోరాశిలో తడిచి ముద్దయ్యాడు గురప్ప. సిద్ధారూఢులు గురప్ప దేహమనే ఇంటిలో జ్ఞానమనే నందదీపాన్ని వెలిగించారు. గురప్ప దేహం లోపలా బయటా కసవూడ్చి స్వచ్ఛంగా వించారు. ఇల్లు నిర్మలమైంది. శివదీపం వెలిగింది. సిద్ధులు తమదేహమనే ఇంటి నుండి గురప్పదేహమనే ఇంటిలోనికి మారారు. "నీలో నీవు అణగి వుండు. నోరు మెదపవద్దు" అన్న సిద్ధుల మాటయే గురప్పకు మహామంత్రమైంది. గురప్ప గురునాధారూఢులయ్యారు.

సిద్ధుల నిర్యాణవార్త క్షణంలో ఊరంతా వ్యాపించింది. తల్లిని పోగొట్టుకొన్న పిల్లలవలె భక్తులంతా గుండెలు బాదుకొంటూ రోదిస్తున్నారు. కొందరికి పిచ్చి పట్టినట్లయింది. సిద్ధుల దేహాన్ని అలంకరించి ఎంతో ఘనంగా ఊరేగించారు. ఎక్కడెక్కడి భక్తులు, రాజులు, మహారాజులు వచ్చి ఆ ఊరేగింపులో పాల్గొన్నారు. నామస్మరణతో ఆకాశం ప్రతిధ్వనించింది. 1906లోనే నిర్మించబడివున్న సమాధి మందిరంలో సిద్ధుల దేహాన్ని వుంచారు. గంధము, కర్పూరము, సుగంధ ద్రవ్యాలు, ముత్యమాణిక్యాలు, వజ్రవైడూర్యాలు వేసి, ఈశ్వరుని వ్యక్తరూపమైన సిద్ధుల దేహాన్ని సమాధియందుంచారు.

ఇకముందు కార్యక్రం ఏమిటనే చర్చ వచ్చింది. "అ ఏముంది! సమాధి మీద రెండు చెంబులు నీళ్ల చల్లి, నాలుగు పువ్వులు వెయ్యడమే" అన్నాడు ఒకరు. మరొకరు "అంతే" అని తలాడించారు. సిద్ధుల ముఖ్యశిష్యులైన గోవిందస్వామి మాత్రము అక్కడ నిరంతర నామస్మరణ జరగాలనే సంకల్పంతో సమాధియైన మరుసటిరోజు నుంచే తంబూర తీసుకొని నామస్మరణ ప్రారంభించారు. అదే ఈరోజుకూ నిరంతరం జరుగుతూవున్నది. క్రింది కోర్టులో గురునాథారూఢులే మఠానికి ఉత్తరాధికారి అని తీర్పు ఇచ్చారు. గురునాథారూఢుల స్థితికూడ ఒక్కసారిగా మారిపోయింది. నిలుచుంటే రెండు, మూడురోజులు నిలుచునే వుంటారు. కూర్చుంటే అలానే కూర్చుని వుండిపోతారు. ఆకలి లేదు. దప్పికలేదు. నిద్రలేదు. వారి రెండు కంటిపాపలూ ఎటూ చలింపక, తటస్థమై బహిర్దృష్టికూడ అంతరించి పోయింది. వారినిబహిర్దేశానికి తీసుక వెళ్లడం, స్నానం చేయించడం, అన్నం తినిపించడం, పడుకోపెట్టడం, మరల లేపడం మొ॥పనులన్నీ వేళకు సరిగ్గా శిష్యులే చేసేవారు. గురునాథారూఢులు ఈ స్థితిలో వుంటూ, శ్రీ సిద్ధారూఢులు అజ్ఞాపించినట్టుగా సిరిసంపదలు, గౌరవ మర్యాదలు మొ॥ వాటిని మోహించక భక్తుల చేతికి చిక్కకనే తమ 52వ సంవత్సరంలో అంటే శక సం॥ 1884 శుభకృత నామ సంవత్సర వైశాక శుద్ధ నవమి ఆదివారం 13-5-1962 తేదీన విదేహ కైవల్యాన్ని పొందారు.

**(శ్రీ సిద్ధారూఢ స్వామి చరిత్ర సమాప్తము)**



# Sri Siddharudha Swamy Charitra



జననం : 1836

మహా సమాధి : 1929

సాక్షాత్తూ శివుని అవతారంగా కొలవబడిన సిద్ధ పురుషులు శ్రీ సిద్ధారూఢ స్వామి. వీరి భక్తులొకరు సాయి సన్నిధికి రాగానే వీరు ఒక గొప్ప మహాత్ముని కొలువుకు చెందిన వారు" అన్నారు బాబా. శ్రీ సాయిబాబా సిద్ధారూఢులు, రామమారుతీ మహరాజ్‌లతో కలిసి షహపూర్‌లోని ఉదుంబర వృక్షం క్రింద గజానన్ పట్వేకర్‌కు దర్శనమిచ్చారు.

కాశీలో ఒక అన్న సంతర్పణలో భోజనం చేసి, లేచి వెళ్ళిపోతున్న సిద్ధులను "నీవు తిన్న ఎంగిలాకు నీయబ్బ వచ్చి తీస్తాడా?" అని కొట్టబోగా, కాశీ విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై ఆ విస్తరి ఎత్తివేశాడు.

మంగళగిరి కొండమీది పానకాల స్వామిని చేయెత్తి ఆశీర్వదిస్తుంటే "తప్పు" అని చెప్పిన పూజారితో "మావంటివారి ఆశీర్వచనం దేవునికి కూడా అవసరమే" అన్నారు సిద్ధులు.

హుబ్లీ లోని వారి సమాధినుంచి నేటికీ పిలిచిన వారికి పలుకుతూనే వున్నారు సిద్ధులు.

శారదా ఉమేష్


శ్రీ గురుపాదుకా పబ్లికేషన్స్

యం.యం. డొంక, ఒంగోలు - 523 002.

Sai Sri., 0866-573017, 436848.